

ఫిబ్రవరి - మార్చి 2022

# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి: 50 సంచిక: 2,3 384 పేజీలు 52 రూ. 20/-




మౌనానికి
సెలవంటూ
మాటవుదామా?

- జన విజయాలను
గానం చేసే
పాటవుదామా?








# స్వీకారం



**ఈవేళప్పుడు**
అరసవిల్లి కృష్ణ
కవిత్వం
ప్రచురణ:
విరసం
వెల: రూ.120/-
పేజీలు: 176




సింగరేణి
కార్మికోద్యమ నవల
**సైరన్**
అల్లం రాజయ్య
ప్రచురణ:
మలుపు బుక్స్
వెల: 295/-
పేజీలు: 392




**అంటరాని వసంతం**
జి. కళ్యాణరావు
ప్రచురణ:
విరసం
వెల: 250/-
పేజీలు: 266



**సాహిత్య లేఖలు**
వి. చెంచయ్య
ప్రచురణ:
విరసం,
నెల్లూరు జిల్లా శాఖ
వెల...లేనిది
పేజీలు: 40



**సాహిత్య స్పందన**
పిన్నిబోయిన కోటయ్య
ప్రచురణ:
విరసం,
నెల్లూరు జిల్లా శాఖ
వెల: రూ.40/-
పేజీలు: 80




**భూమిరంగు మనుషులు**
కెక్యూబ్ వర్మ కవిత్వం
ప్రచురణ:
అనేక
వెల: 100/-
పేజీలు: 128




**పూల పరిమళం**
కోడం కుమారస్వామి
కవిత్వం
ప్రచురణ:
జనగామ రచయితల సంఘం
వెల: రూ.100/-
పేజీలు: 129



**ఆమె అడవిని జయించింది**
గీతాంజలి
ప్రచురణ:
వెన్నెల-అంజలి
ప్రచురణలు
వెల: రూ.150/-
పేజీలు: 173



**సంస్కృతి మార్క్సిస్టు సాంస్కృతిక సిద్ధాంతం**
పాణి
ప్రచురణ: విరసం
వెల: 30/-
పేజీలు: 72




**తత్వశాస్త్రం అంటే ఏమిటి?**
హెూవర్డ్ సెల్సం
తెలుగు: పార్థసారథి
ప్రచురణ: విరసం
వెల: 30/-
పేజీలు: 56




**అమ్మ జ్ఞాపకాలు**
ఆలూరి లలితా పరమేశ్వరి
ప్రచురణ:
రాహుల్ సాహిత్య సదనం
వెల: రూ.50/-
పేజీలు: 58




**జోలాలీ...**
ఉ.సా పాటలు
ప్రచురణ:
ఉ.సా స్మారక కమిటీ
వెల: రూ.150/-
పేజీలు: 312



**బహుళ బహుజన జెండా-అజెండా**
ఉ.సా
ప్రచురణ:
ఉ.సా స్మారక కమిటి
వెల: 200/-
పేజీలు: 300




**దేశీ దిశ**
ఉ.సా స్మారక
సదస్సుల పత్రాలు
ప్రచురణ:
ఉ.సా స్మారక కమిట
వెల: 150/-
పేజీలు: 176




నిష్పక్షపాత నిర్భయ
నిజానిజాల
**నిప్పుకణికలు**
ఉ.సా
ప్రచురణ:
ఉ.సా స్మారక కమిటీ
వెల: 100
పేజీలు: 152

సంపాదకీయం




సంపుటి : 50 ◆ సంచిక : 2 ◆ ఫిబ్రవరి-మార్చి 2022 ◆ వెల : రు. 20/-

# దేశాలను కాదు ప్రజలను ప్రేమిద్దాం..

**రివేరా**

అమెరికా అనుకూల ప్రభుత్వాన్ని ఉక్రేయిన్‌లో కూల్చడంతోనే పుతిన్ సమస్య తీరిపోతుంది. మరో సోవియట్ పూర్వ దేశం నయా జారిస్టుల అఖండ రష్యా ఎజెండా కింద తన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను కోల్పోతుంది. భారీ పరిశ్రమలు, ఆయుధ ఫ్యాక్టరీలతో నిండిన ఉక్రేయిన్‌ని దురాక్రమించి మరింత ఉబ్బిన తన కండలను పుతిన్ ప్రపంచం ముందు ప్రదర్శించుకుంటాడు. కొంతకాలం ఆగి మరో సోవియట్ పూర్వ దేశం వంతు. ఇంకేదో వంక..మరెంతో భయానక బలప్రదర్శన! తూర్పు యూరప్ భౌగోళిక రాజకీయాలను ఇలా యుద్ధాలు నడిపించడం కొత్తేమీ కాదు. కానీ, యుద్ధ తక్షణ ప్రభావంలోని ఉక్రేనీయన్లు, చారిత్రక విషాదాల ఎరుకతో రష్యన్లు ఇద్దరూ ఇప్పుడు రోడ్ల మీదే ఉన్నారు. యుద్ధం వద్దని మాస్కో సహా ప్రధాన రష్యన్ నగరాల్లో శాంతి కవాతులు చేస్తున్నారు. అయితే.. రష్యన్లు కోరని ఎజెండాను వారి పేరిటే విస్తరణవాద యుద్ధోన్మాదులు ప్రపంచం మీద రుద్దారు. ఈ యుద్ధం మధ్యలో చదువుల కోసం, ఉద్యోగాల కోసం ఉక్రేయిన్ చేరుకున్న వేలాదిమంది విదేశీయులు చిక్కుకుపోయారు. ఉక్రేయిన్ భూ, గగన మార్గాల్లోకి చొచ్చుకెళుతూ రష్యా తన దాడిని ఆరేడు రోజులుగా సాగిస్తున్నా.. యుద్ధ మేఘాలు కొన్ని నెలలుగా అలుముకునే ఉన్నాయి. అయినా.. తన పౌరులను యుద్ధభూమి నుంచి తరలించే ప్రయత్నాలపై ముందస్తుగా మోదీ ప్రభుత్వం కేంద్రీకరించలేదు. ప్రచార ఫోనింగులు తప్ప వాస్తవిక ప్రణాళికతో తన వాయు బలగాలను ముందుకు నడిపించలేదు. దీంతో యుద్ధం మొదలైన ఆరో రోజున ఉక్రేయిన్ ప్రధాన నగరం ఖీర్కివ్‌లో జరిగిన మోర్టార్ దాడిలో కర్ణాటకకు చెందిన ఓ మెడికో చిక్కుకుని మరణించాడు. మోదీ సర్కారు నిర్లక్ష్య నిర్లిప్తతలదే ఇందుకు బాధ్యత.

యుద్ధాలను వ్యతిరేకించడానికి ప్రజలకు, సామ్రాజ్యవాదులకు ఎవరి కారణాలు వారికి ఉన్నాయి. ఈ కారణాల్లో సారూప్యతల కంటే వైరుధ్యాలే ఎక్కువ. సాధారణంగా ఏ ప్రజ, ఏ దేశమూ యుద్ధాలను ఆహ్వానించదు. ఎక్కడో ఉక్రేయిన్‌లో బాంబు పడితే కర్ణాటకలో కన్నీరు చిందింది కదా! యుద్ధాలను మనం వ్యతిరేకించడానికి ఇంతకు మించిన కారణం కావాలా? అపార ప్రాణ నష్టం, ఆర్థిక వ్యవస్థలకు అంతకుమించిన కష్టాలను తొలి రెండు ప్రపంచ యుద్ధాలు కలిగించాయి. ఈ అనుభవం ప్రజలను, ప్రపంచ దేశాలను యుద్ధ విముఖులను చేసింది. ముఖ్యంగా యూరప్ దేశాలు యుద్ధాల నుంచి బాగా దూరం జరిగాయి. ప్రపంచీకరణ అనంతర ప్రపంచం గత మూడు దశాబ్దాల్లో మరింత సున్నితంగా మారింది. టైమ్‌బాంబును పక్కన పెట్టుకున్నట్టు ఉంది సంపన్న దేశాల పరిస్థితి. అణు ప్రపంచం కావడం, ద్రవ్య పెట్టుబడే అంతటా రాజ్యం చేస్తుండటమే ఈ పరిస్థితికి కారణాలు. స్థానిక ఆర్థిక వ్యవస్థల్లోకి తొలుత చొరబడి అక్కడి రాజకీయ వ్యవస్థలను అంతిమంగా నియంత్రించడమే ద్రవ్య పెట్టుబడి సారాంశం.

అమెరికా కారాలు నూరే చైనాలో ఆ దేశం పెట్టుబడులే ఎక్కువ. ఉక్రేయిన్‌కు మద్దతుగా ఇప్పుడు రష్యాపై మిరియాలు దంచుతున్న నాటో సైనిక కూటమిలో ఫ్రాన్స్, జర్మనీ కీలక దేశాలు. ఈ దేశాలకు అందే పెట్రో ఉత్పత్తుల్లో ఎక్కువశాతం రష్యా నుంచే సరఫరా అవుతాయి. మల్టీ నేషనల్ కంపెనీల ప్రయోజనాలతో పూర్తిగా ముడిపడిన వ్యవహారం ఇది. ఈ కంపెనీల కోసం పనిచేసే ప్రపంచ దేశాలు, అంతర్జాతీయ సంస్థలు, వేదికలు పరిస్థితిని యుద్ధం వరకు తీసుకురావు. ఒకవేళ అదే అనివార్యమైతే మరీ సాగదీయవు. ఏదో ఒక చిన్నదేశాన్ని బలి ఇచ్చి యుద్ధం విస్తరించకుండా జాగ్రత్త పడతాయి. ఇందువల్లే రష్యాకు వ్యతిరేకంగా నాటో దళాలు తమ శక్తిని కనిష్ఠ స్థాయిలో ప్రయోగించాయి. ఉక్రేయిన్‌లోకి పదివేల సైన్యం పంపుతున్నట్టు చేసిన ప్రకటనను రష్యా దాడి మొదలైన తొలి గంటలోపే నాటో వెనక్కి తీసుకుంది.

అత్యాధునిక ఆయుధాలను ఇస్తానని అమెరికా రోజూ ప్రకటనలు చేస్తోంది. అయితే, ఈ ఆయుధాలను ఆపరేట్ చేసే పరిజ్ఞానం లేని ఉక్రేయిన్ సైనికులకు ఇప్పటికిప్పుడు అవి అక్కరకు రావు. అమెరికా సాయంపై అతి అంచనాలతో రష్యాను సవాల్ చేసిన ఉక్రేయిన్‌ను ఇలా అందరు కలిసి నట్టేట ముంచారు. ఏకపక్షంగా, యథేచ్ఛగా ఉక్రేయిన్‌పై రష్యా దాడి చేయడానికి దోహదం కలిగించాయి. ముందుకు ఉక్రేయిన్‌ను నెట్టి వెనకనుంచి తప్పుకున్నాయి. నమ్మక ద్రోహాలు, దొరికినంత దోచుకోవడాలే ద్రవ్యపెట్టుబడి నీతి.. ఉక్రేయిన్ లాంటి చిన్న దేశాలే ఈ నీతికి ఎరలు.

తాజా వివాదంలో తెరపైకి వచ్చినవారిలో ఏ ఒక్కరినో బాధ్యులను చేయలేం. ఉక్రేయిన్ పాలకులనూ ఉపేక్షించలేం. తిలా పాపం తలా కొంచెం పంచుకున్నారు. అందరూ కలిసి ఉక్రేనీయర్లకు మాతృభూమిని దూరంచేశారు. లక్షలాది మంది పౌరులు ఉక్రేయిన్ సరిహద్దులు దాటి వలస పోతున్న దృశ్యాలు ఒకవైపు! వందలు, వేలుగా రష్యా యుద్ధ ట్యాంకులు ఆ సరిహద్దులను చీల్చుకొని దూసుకెళుతున్న దృశ్యాలు మరోవైపు! భౌగోళిక ఆధిపత్య రాజకీయాల వికృతత్వాన్ని పట్టి ఇస్తున్నాయి. సోవియట్ విచ్ఛిన్నంతో పాతాళానికి కుంగిపోయిన రష్యాను ఆ

(మిగిలినది 40వ పేజీలో...)



అరుణతార నిర్వహణ కోసం వరంగల్‌కు చెందిన లోచన్‌గారు రూ. 5000 విరాళం ఇచ్చారు. అలాగే ఇళ్ల వెంకటేశ్వరరావు ఎంఎల్‌సీ (అమలాపురం) రూ. 2000, కరీంనగర్ నుంచి వీరగాని పెంటయ్యగారు రూ. 1000, హైదరాబాదు నుంచి శివలక్ష్మిగారు విరాళం ఇచ్చారు. వారికి ఉద్యమాభివందనాలు.

ఎడిటర్
అరసవిల్లి కృష్ణ

వర్కింగ్ ఎడిటర్
పి. వరలక్ష్మి

రచనలు పంపించాల్సిన చిరునామ :
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు-516360.

* email : arunatara1977@gmail. com

Like Page:
//viplava rachayitala sangahm arunatara

facebook:
//viplava rachayitala sangahm virasam

Virasam website :
www. vasanthamegham.com

చందాలు, విరాళాలు పంపవలసిన చిరునామా
అరసవిల్లి కృష్ణ, 6-1/16-7ఎ/1, పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-520001.
చెక్‌లు / డ్రాఫ్టులు / ఆన్‌లైన్‌లో పంపడానికి
A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595, IFSC : SBIN0020714, Branch : Vagu Center, Vijaywada.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;
రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;
ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-



వసంతమేఘం

# ఈ సంచికలో



## వసంతమేఘం అంతర్జాల పత్రికలో..

### జనవరి 15, 2022 సంచిక



### ఫిబ్రవరి 1, 2022 సంచిక

కవిత్వం:
రాజు దొగ్గల : ఆకలి జోలె, గణ'తంత్రం'
మహమూద్ : నా తలపుల తలుపులు తెరిచీ, ఎడారి పుష్పం

## ఫిబ్రవరి 15, 2022 సంచిక

సంపాదకీయం: హిజాబ్ ఒక సాకు మాత్రమే -పి.వరలక్ష్మి
వ్యాసాలు:
మేధావి, సృజనశీలి కామ్రేడ్ మిళింద్ -మిళింద్ మిత్రమండలి
చట్టాల ద్వారా ప్రజాస్వామ్యం పై దాడి -సీమా ఆజాద్
రెండు ఇంజన్ల ప్రభుత్వ ఆర్థిక స్థితి లో మోడీ-యోగీ ప్రభుత్వం -డి.ఎం.దివాకర్
ఆదిత్యనాథ్ ప్రభుత్వ రిపోర్టు కార్డ్ -ఆకాంక్షా ఆజాద్
బోనులో మోడీ సర్కార్ -ఎ.నరసింహారెడ్డి
భారత రాజ్యాంగం వైరుధ్యాల పుట్ట -ప్రొ.శేషయ్య
సంభాషణ:
ఇంటర్వ్యూ: సరళీకరణ సన్నివేశంలో ఉద్యోగుల ఉద్యమం, లొంగుబాటు - ఎన్వీ రమణయ్య
ఇంటర్వ్యూ: భారత రాజ్యానికి ఆధునిక స్వభావం లేదు -వైకె
నిమ్మలపాడు దీర్ఘకాలిక పోరాటం -షాగన్
కవిత్వం:
వడ్డెబోయిన శ్రీనివాస్ : స్టాచ్యు ఆఫ్ అనీ క్వాలిటి, ఒక ప్రజాస్వామ్యంలో, వీరగాధ
ఆర్. శశికళ : ఈ క్షణం, కన్నా..
బుచ్చి రెడ్డి గంగుల : జియ్యం గారు

కాలమ్స్:
కవి నడిచిన దారి: నా కవిత్వం ఒక నినాదం -మహమూద్
లోచూపు: బ్రాహ్మణవాదం-విమర్శనాత్మక పరిశీలన-మెట్టు రవీందర్
పత్రికా ప్రకటన: వరవరరావుకు తుమకూరు అక్రమ కేసులో అక్రమ వారెంట్ -విరసం

## మార్చి 1, 2022 సంచిక

కాలమ్స్:
ఆర్థికం: పెరుగుతున్న అసమానతలు పెట్టుబడి దోపిడీకి సంకేతం -ఎ.నర్సింహారెడ్డి
సమకాలీనం: దాడి దుర్మార్గమే, కాని దానికి బాధ్యులెవ్వరు?-అశోక్
కవినడిచిన దారి: ధ్వనిలోంచి కవనంలోకి -చరణ్
లోచూపు: కవిత్వమే సూక్ష్మదర్శిని, దూరదర్శిని -మెట్టు రవీందర్
ఇంటర్వ్యూ:
రాజ్యాంగాన్ని విమర్శనాత్మకంగా చూడాలి -ఎన్ వేణుగోపాల్
వ్యక్తి స్వేచ్ఛలేని చోట లిబరల్ డెమోక్రసీకి అవకాశమే లేదు -ప్రొ.పద్మజా షా
సాహిత్య వ్యాసం: మూసీ నది మాట్లాడితే-నా అనుభవాలు -కవిని ఆలూరి
వ్యాసం: సామ్రాజ్యవాద శిబిరాల మధ్య ప్రపంచ మార్కెట్ల పునర్విభజన కోసమే యుద్ధం -పి.ప్రసాద్ (ఇఫ్టూ)
కవిత్వం:
కవిత్వమూ-కవీ: టి.వెంకటేశ్ కవితలు తొమ్మిది
యుద్ధమూ-మనమూ -కెక్యూబ్

---

**లేఖ:**

## అమ్మా క్షమించు..

అమరుడు కామ్రేడ్ మిళింద్ తేల్తుంబ్డే తల్లి అనసూయ తేల్తుంబ్డే 92 ఏళ్ల వయసులో సజీవంగా ఉందని మిత్రులు 'అనంద్ సహచరుడు' రాయడం సంతోషం. ఆమె గురించి మేం నిజంగానే పూర్తి సమాచారం సేకరించి రాసి ఉండాల్సింది. మిత్రుడు సూచించినట్టు సామాజిక మాధ్యమాలు చూడాల్సిందే! మావైపు నుండి జరిగిన తప్పుకు చింతిస్తున్నాం. నిజంగా మా మిత్రుడు అమరుడు మిళింద్ సజీవంగా ఉన్నపుడు తెలిసి ఉంటే ఆయన తన కలం పేరు తన తల్లి స్మృతిలో పెట్టుకునేవాడే కాదు. ఆయన అమితంగా ప్రేమించే తన తల్లి ఇక లేదన్న వార్త తెలియడంతోనే ఆయన అమెను చిరస్మరణీయురాలుగా తన కలం పేరుగా నిలుపుకొని తనలో మిళితం చేసుకున్నాడు. నేడు మిళింద్ మనకు లేదు. కానీ అమ్మా నీకు మేమున్నాం.

అమ్మా, మా రచనలో జరిగిన పొరపాటుకు చింతిస్తున్నాం. నీ జ్ఞాపకాలు అనేకం మిళింద్ మాతో పంచుకునేవాడు. పేద దళిత కుటుంబంలో నువు పడిన బాధలు ఆయన మాతో చెప్పేవాడమ్మా. అంత మంది సంతానాన్ని పోషించడంలో ఎదురైన నీ కష్టాలు తలచుకొని కంట తడి పెట్టేవాడమ్మా. మాంసప్రియుడైన మా మిళింద్ ప్రతి అదివారం స్కూల్ నుండి కాలి నడకన ఎంతో సంబరంగా ఇంటికి వచ్చి నీవు వండిన మాంసం ఎంత ప్రియంగా తినేవాడో గుర్తు చేసుకునేవాడు. గొంగూర తిన్న ప్రతి సందర్భంగా 'అంబడ్ ఖాజీ, జొన్న అన్నం" జీవితాన్ని గుర్తు చేసుకునేవాడు. నీవు ఇప్పపూలు ఏరుకొచ్చి కూర వండడం, ఇంకా రకరకాల వంటకాలు ఉన్నదాంట్లోనే పిల్లలకు చేసి పెట్టడం లాంటి బోలెడు జ్ఞాపకాలు మిళింద్ మాతో పంచుకునేవాడు. నీ జ్ఞాపకాల ఒడిలో తుదివరకూ జీవించిన మిళింద్ ఇక లేడని తెలుపడానికి కలం ఒప్పుకోవడం లేదమ్మా. కానీ, ఇది ఒక చేదు నిజం. ఆయన భౌతికంగా తన జీవిత లక్ష్య సాధనలో మనందరికి దూరమయ్యాడు. ఉద్యమ ప్రాంతాలలోని వేల మంది తల్లులు ఆయన లేని లోటును గుర్తు చేసుకుంటూ ఆయన వారికి చేసిన విప్లవ సేవలను స్మరించుకుంటున్నారు.

అమ్మా, నీ పెద్ద కొడుకు జైలులో, చేయని నేరానికి, కక్షతో బ్రాహ్మణవాద రాజ్యం విధించిన శిక్షకు బలవుతున్నాడు. నీ మిళింద్ ఇక నీ కళ్లలో సదా వెలుగొందుతాడు. కన్నీళ్లై ప్రవహిస్తాడు. నీ జ్ఞాపకాలుగా అందరి మధ్య నిలుస్తాడు. నీవు ఆయురారోగ్యాలతో నిండా నూరేళ్లు జీవించాలి. మిళింద్‌ను గుర్తు చేసుకుంటూ, రాజ్యం కర్కశంగా అనంద్‌ను జైలు పాలు చేయడాన్ని ఖండించడానికి పీడిత ప్రజల తల్లిగా నీవు జీవించాలని కోరుకుంటున్నామమ్మా.

మిత్రుడు 'అనంద్ సహచరుడు' పత్రికా ముఖంగా ఒక సంతోషకర నిజాన్ని తెలిపినందుకు ధన్యవాదాలు. మీరూ మా తప్పును, మేం ఉన్న పరిస్థితులలో జరిగిన పొరపాటును పెద్ద మనసుతో అర్థం చేసుకుంటారని భావిస్తున్నాం. మీరు మా కామ్రేడ్స్ నర్మద, కిరణన్నల గురించి రాశారు. వారు ఈ వయసులో, తీవ్ర అనారోగ్యంతో అరెస్టు కావడం బాధాకరం. వారికి ఫాసిస్టు కోర్టులలో న్యాయం దొరుకదనీ నానావటే, ఫాదర్ స్టాన్‌స్వామిల హత్యలతో మరింత స్పష్టమైంది. ఈ మధ్యే భారత రాజకీయ ఖైదీల విడుదలకై అంతర్జాతీయంగా ఒక యేడాది ప్రచార కేంపెయిన్ చేపట్టారు.

విప్లవాభివందనాలతో
'మిళింద్ ఉద్యమ సహచరులు'



# కొడవటిగంటి వరూధినికి జోహార్లు

**(మార్చి 1925 - ఫిబ్రవరి 9, 2002)**

కృష్ణాబాయి

వరూధిని' పేరు తెలుగు సాహిత్యంలో చాలా అపూర్వం. మన వరూధినిగారి పెదనాన్న గుడిపాటి వెంకటచలం ఆమెకి పేరు పెట్టారు. ప్రముఖ రచయిత కొడవటిగంటి కుటుంబరావు గారి సహచరి వరూధిని. సాహిత్యం, సంగీతం ఆ కుటుంబానికి రెండు కళ్లు.

వరూధిని ప్రాచీన తెలుగు సాహిత్యం దగ్గర నుంచి ఆధునిక సాహిత్యం దాకా అన్నీ తెలుసుకోవడంతోపాటు, మిత్రులతో అవన్నీ చర్చిస్తారు. అమెది గొప్ప జ్ఞాపక శక్తి.

మద్రాసు కాపురంలో, కుటుంబరావుగారు 'చందమామ' పత్రిక నిర్వహణతోపాటు, పుంఖానుపుంఖంగా రచనలు చేశారు. యాభై సంవత్సరాల రచనా జీవితంలో అన్ని ప్రక్రియల్ని తడిమారు. ఆంధ్రదేశం నుంచి వచ్చే పాఠకుల జాబులన్నిటికి ఎప్పటికప్పుడు జవాబులు రాసేవారు. వరూధిని స్వయంగా రచనలు చేయకపోయినా, సాహిత్యాన్ని గురించి స్పష్టంగా చర్చించేవారు. వారి కొడుకు రోహిణీ ప్రసాద్ శాస్త్రవేత్త, సంగీతజ్ఞుడూ కూడాను. వరూధినిగారి కూతురు శాంతసుందరి హిందీ నుంచి ఆధునిక సాహిత్యాన్ని తెలుగుదేశానికి సరళంగా పరిచయం చేసింది. 'అచట పుట్టిన చిగురు కొమ్మయిన చేవ' అన్నట్టు ఇంట్లో అందరూ సాహిత్య జిజ్ఞాసాపరులే. బాలమురళీ, చిట్టిబాబు లాంటి సంగీత విద్వాంసులు వీరికి సన్నిహితులు. అందరూ కలిసి సంగీత కచేరీలకి వెళ్లేవారు.

కుటుంబరావుగారితో లేఖా పరిచయం ఎక్కువగానే వుండేది నాకు. ఉత్తరం రాయగానే జవాబు ఆఘమేఘాల మీద వచ్చేది. మార్క్సిజం, తెలుగు సాహిత్యం గురించి ఎన్నో విషయాలు వారి దగ్గర నుంచి గ్రహించాను.

విప్లవ రచయితల సంఘం సభలలో వారితో కలిసి పాల్గోవడం ఒక ముచ్చట.

మద్రాసు ఎప్పుడు వెళ్ళినా మా వేణుగోపాలరావుగారు కుటుంబరావుగారిని కలవకుండా వచ్చేవారు కాదు. ఆ విశేషాలన్నీ రోజుల తరబడి ముచ్చటించుకునేవాళ్ళం.

రోహిణీ ప్రసాదుకి ఆంధ్రా యూనివర్శిటి న్యూక్లియర్ ఫిజిక్స్‌లో సీటు వచ్చింది. గార్డియన్ వేణుగోపాలరావు. ఇంటి దగ్గరనుంచి మొదటిసారి ఇంత దూరం వచ్చిన రోహిణి అమ్మకి రోజూ ఉత్తరం రాసినట్టే, మా ఇంటికి రోజూ వచ్చేవాడు. సంగీత సాహిత్యాల గురించి కబుర్లు కొట్టి పోసేవాడు. తనకి సితార, హిందుస్థానీ సంగీతం చాలా ఇష్టం. అప్పటికే మా అమ్మాయిలు వీణ నేర్చుకుంటూండే వాళ్ళు. ఓ ఆదివారం మా ఇంట్లో రోహిణీ సితార్ కచేరి పెట్టాం - సంగీతాభిమానుల సమక్షంలో. "ఓహో, నువ్వు మా వరూధిని కొడుకువా?!" అని రచయిత బి.వి. నరసింహారావు మురుసుకున్నాడు. రోహిణీ ప్రసాద్ యూనివర్సిటీలో చేరినప్పుడు కుటుంబరావుగారూ, వరూధిని గారు వచ్చి పరిసరాలు పరిశీలించి తృప్తిగా వెళ్ళారు.



కుటుంబరావు గారి సాహిత్య సర్వస్వం విరసం ప్రచురించాలని వరూధినిగారి ఆమోదం కోరాం. ఆమె సంతోషంగా అంగీకరించారు. చలసాని ప్రసాదు, నేను కలిసి పూర్తి చేసిన ఆ పని ఆమెకెంతో తృప్తినిచ్చింది. వరూధిని గారి తల్లి కొమ్మూరి పద్మావతీదేవి పేరుగాంచిన నటీమణి. బళ్లారి రాఘవగారితో కలిసి సినిమాల్లో, నాటకాల్లో నటించింది. వరూధినిగారి తమ్ముడు కొమ్మూరి సాంబశివరావు డిటెక్టివ్ నవలలు పుంఖానుపుంఖంగా రాశాడు. చెల్లెలు ఉషారాణి భాటియా నేషనల్ బుక్ ట్రస్ట్ తెలుగు విభాగం సంపాదకురాలిగా పనిచేశారు. పెదనాన్న గుడిపాటి వెంకటచలం అమ్మమ్మ ఇంటికి దత్తత పోవడం వల్ల ఇంటి పేరు మారిపోయింది. ఆయన వరూధిని పెళ్లి విషయం విని, భౌతిక బంధాల్లో చిక్కుకుపోతున్నందుకు విచారవద్దాడని చెప్పి నవ్వేవారామె. కుటుంబరావుగారు వీరి కుటుంబ మిత్రుడిగా ఇంటికి

(మిగితాది 13వ పేజీలో...)

నూరేళ్ల 'మాలపల్లి' సందర్భంగా ప్రత్యేక వ్యాసం

# ఐతిహాసిక నవల మాలపల్లి

కాత్యాయనీ విద్మహే



గత సంచిక తర్వాత భాగం

4

సాంఘికంగా వివక్షకు గురయ్యే వర్గాలే తరచు ఆర్థిక పీడనకు కూడా గురిఅవుతాయి అన్నది వాస్తవం. సమాజంలో కులంవల్ల హీనులుగా వివక్షను, అవమానాన్ని ఎదుర్కొనే మాలలలో స్వంత భూమి, సాగు ఉన్నవాళ్లు రామదాసు వంటివాళ్ళు ఏ ఒకరిద్దరో తప్ప కనబడరు. వాళ్ళయినా ఇంటిల్లిపాదీ ఉదయం లేచింది మొదలు రాత్రి వరకు పొలంలో పాటుపడవలసినవాళ్ళే. నీళ్లు మోసుకొనటం, పశువులను చూసుకొనటం అన్నీ వాళ్ళ పనులే. రామదాసు పెద్దకొడుకు వెంకటదాసు, మేనల్లుడు అప్పదాసుల సహాయంతో వ్యవసాయం చేస్తున్నా సంగదాసు చౌదరయ్య దగ్గర జీతానికి ఉన్నవాడే. అయితే ఆధిపత్య కులాల ధనబలం, రాజ్యబలం కలిసి రామదాసు లాంటి వాళ్లను కూడా ఏమీ లేనివాళ్లుగా చేసి ఎలా కూర్చోబెట్టగలదో మాలపల్లి నవల ఇతివృత్తమే చెప్తుంది. ఇక మిగిలిన మాలపల్లి మనుషుల జీవిక ఏమిటి? "మాల మాదిగపల్లెల్లో నాలుగు నెలలు పూర్తైన భోజనమంటే జొన్నన్నం, గోంగూరా, కారం - ఇవి కడుపునిండా తినడం, నాలుగు నెలలు అర్ధభోజనం, మిగిలిన రోజులు కటిక వుపవాసం" సంగదాసు రామానాయుడికి చెప్పినమాట ఇది. 'దొరికితే నాగజెముడు పండ్లూ, బొద్దాకు, చచ్చిన గొడ్ల మురికి మాంసం' తమ ఆహారం అని కూడా చెప్పాడతను. దానికి కొనసాగింపుగా అవీ దొరక్కపోతే మడత కుదుములు అంటే ఆకలి తెలియకుండా అన్నపు తిత్తి మడతలు పడేట్లుగా ముడిచి పెట్టుకొని పడుకొనటం అని వివరణ కూడా ఇచ్చాడు. కూలిగింజలు కొలిపించుకొని ఇళ్లకు వెళ్తున్న స్త్రీలు మాలపల్లె సమీపంలో ఉన్న కోమటి దుకాణం దగ్గర ఆగి రాత్రి వంటకు దమ్మిడీకి ఒకటి చొప్పున ఉప్పు మిరపకాయలు, చింతపండు కొనుక్కొంటున్న దృశ్యం మాలపల్లి ఆర్థిక దుస్థితికి నిదర్శనం. ఇలాంటి వాళ్ళే కూలీరేట్ల పెంపుదల కోసం సమ్మెలు కట్టటం అనివార్యం అవుతుంది. ఆ మేరకు కార్మికోద్యమమం మాలపల్లి నవలేతివృత్తంలో భాగం అయింది.

కార్మికులంటే పరిశ్రమలలో, గనులలో, కర్మాగారాలలో పనిచేసేవాళ్ళు కదా! గ్రామీణ జీవిత నేపథ్యంలో సాగిన మాలపల్లి నవల కథలో అలాంటి పని స్థలాలు, వాటిలో పనిచేసే మనుషులే ఎవరూ లేరు కదా! మరి ఈ నవల ఇతివృత్తంలో కార్మికోద్యమం ఎలా భాగమైందీ అన్నది ప్రశ్న. మాలపల్లిలో కనబడే శ్రామికవర్గం అంతా వ్యవసాయ వర్గాలవాళ్లే. పేద రైతులు, వ్యవసాయ కూలీలు ఉపాధి కోల్పోయిన చేతివృత్తులవాళ్ళు భారతదేశ కార్మికులలో ప్రధాన భాగం.

బ్రిటిష్ వలస పాలనలో నీలిమందు (వస్త్రాల అద్దకానికి వాడే నీలి పొడి) తయారుచేయటానికి అవసరమైన మొక్కలు బీహార్, బెంగాల్ మొదలైన చోట్ల పెద్ద ఎత్తున సాగుచేయబడ్డాయి. అలాగే అస్సాంలో తేయాకును పెద్దఎత్తున సాగుచేయటానికి 1939 నాటికే అస్సామ్ తేయాకు కంపెనీ ఏర్పడింది. వివిధ కారణాలతో సాగు భూములు, చేతివృత్తులు కోల్పోయిన సామాన్యులు దేశం నలుమూలల నుండి బతుకుతెరువులు వెతుక్కొంటూ ఈ తోటలలో పనులకు చేరారు. (తెలంగాణ ఆదివాసీల భూమి హక్కుకోసం నిజాం సర్కార్ మీద యుద్ధం ప్రకటించిన కొమురం భీము అస్సాం తేయాకు తోటలలో కూలీగా పనిచేసి వచ్చినవాడే. అక్కడ వ్యవసాయకూలీల శ్రమ దోపిడీ తీరును, వాళ్ళపై అమలయ్యే అణచివేతను కొమురం భీము నవలలో నమోదు చేశారు అల్లం రాజయ్య, సాహూ.) ఆ రకంగా 1857 నాటికే వ్యవసాయరంగంలో కార్మిక వర్గం ఏర్పడిందన్నమాట. అదే సమయంలో బొంబాయిలో బట్టల మిల్లులు ఏర్పడి కార్మిక వర్గం అభివృద్ధి చెందింది. 1881 నుండి కార్మికవర్గం సంక్షేమాన్ని ఆశించి కర్మాగార చట్టాలు రావటం మొదలైంది. 1918 - 1924 మధ్యకాలం సంఘాలు పెట్టుకొంటూ కార్మికులు చైతన్యం పుంజుకొనటం వేగవంతమైంది. 1918లో మద్రాసు కార్మిక సంఘం ఏర్పడింది. జాతీయ కాంగ్రెస్‌కు అనుబంధంగా అఖిల భారత కార్మికసంఘం (ఎ ఐ టి యు సి) 1920లో ఏర్పడింది. అతివాద జాతీయ నాయకుల ప్రభావంతో కార్మిక వర్గ పోరాటాలలోకి కమ్యూనిస్టు ధోరణులు ప్రవేశించటం మొదలైంది. 1917లో చంపారాన్‌లో నీలిమందు తోటలలో వ్యవసాయ కార్మికుల స్థితి గతుల విచారణకు గాంధీ వెళ్ళటం, చంపారాన్ వ్యవసాయచట్టం 1918 రావటం, ఖేడా (1918), మోప్లా (1920-21) మొదలైన చోట్ల అధిక రెవిన్యూకు, నిర్బంధ వసూళ్లకు వ్యతిరేకంగా సాగిన రైతు ఆందోళనలకు కాంగ్రెస్ మద్దతుగా నిలబడటం చూస్తూ వున్న ఉన్నవ లక్ష్మీ నారాయణ ఆ సమకాలీన చరిత్ర వెలుగులో మాలపల్లి నవల ఇతివృత్తంలో రైతుకూలీ ఉద్యమాలను ఒక ప్రధాన భాగం చేసాడు.

మాలపల్లి నవలలో ఆహార ధాన్యాల పంటల సరసన పత్తి, పొగాకు, నీలిమందు వంటి వ్యాపార పంటలు సాగు కావటం చూస్తాం. సంగదాసు పొగాకు వినియోగం కూడదని ప్రబోధించటమే కాదు,

సాగును కూడా వ్యతిరేకిస్తాడు. సంగదాసు మాటను బట్టే రామదాసు పొగాకు వేయటం మానేస్తాడు. ఈ క్రమంలో సహజంగానే సంగదాసు చౌదరయ్య వ్యవసాయాన్ని, వ్యవహారాలను నడిపించే జీతపు పనివాడుగా రైతుకూలీలపై పెత్తనం చేయటం కాక వాళ్ళ పక్షం వహించి ఆలోచించాడు. మాట్లాడాడు. ఆచరణ వ్యూహాలను రచించి నడిపించాడు. పత్తి పట్టిన కూలీలకు రోజు కూలీ గింజలు తగ్గించటం గురించి బాధపడతాడు. వారానికి ఒక సారి కూలి గింజలు కొలవటం వల్ల జరుగుబాటు కావటం లేదంటే మూడురోజులకు ఒకసారి కొలిపించే ఏర్పాటు చేస్తాడు. పంట కోతకు కూలి గింజలకు బదులు డబ్బు ఇవ్వాలని ఆసాములు మంతనాలు చేస్తుంటే అది రైతుకూలీ ప్రయోజనాలకు భంగకరమని ఆదిలోనే పసిగట్టి రైతుకూలీలను హెచ్చరించాడు. రైతు కూలీ సంఘాలు ఏర్పడకపోయినా ఆ దిశగా రైతుకూలీలను కూడగట్టే చైతన్యయుతమైన నాయకత్వం రూపొందుతున్న క్రమాన్ని సంగదాసులో చూపించాడు ఉన్నవ. సంగదాసు సూచనతో కార్మికోద్యమాన్ని అల్లుకుపోగలిగిన కార్యకర్తల చొరవను, చురుకుదనాన్ని శేషయ్య, రంగదాసు, వీరయ్య వంటి రైతుకూలీలలో నిరూపించి కూడా చూపాడు.

'వ్యవసాయానికి కూలీ ముఖ్యుడు కానీ భూస్వామి కాదు' అన్న నిశ్చితాభిప్రాయం సంగదాసుది. మనిషి ఎక్కువ తక్కువలు కులాన్ని, అధికారాన్ని బట్టి కాక ఉత్పత్తి ప్రక్రియలో భాగస్వామ్యాన్ని బట్టి నిర్ధారించే దృష్టి ఇది. అతని అవగాహన మేరకు మందీ లేక ప్రభువు భూమికి అసలు హక్కుదారులు. వారి నుండి కవులు పొంది వ్యవసాయం చేయించే ఆసామీ, అతని పక్షాన వ్యవసాయపు పనులు నిర్వహించే కమతగాడు లేదా జీతగాడు, పొలంలో పాటుపడే కూలీ ఆమేరకు భూమి మీద హక్కుదారులే. అందువల్ల ప్రభువు, ఆసామీ, జీతగాడు, వ్యవసాయకూలీ నలుగురికీ ఫలసాయంలో సమానభాగం ఉండటం న్యాయం అన్నది సంగదాసు వాదన. ఆసాములు ఎద్దులు మొదలైనవాటికోసం పెట్టే పెట్టుబడిని కూడా పరిగణనలోకి తీసుకొని చేసిన వాదన ఇది. కూలీల శ్రమవల్ల ఉత్పత్తి అయ్యే సంపదలో కూలీగా వాళ్ళు పొందేది ఆసామికి లాభాలు తెచ్చిపెడుతూ వాళ్ళను ఆకలికి మాడేట్లు చేస్తున్నది కనుక అది అన్యాయం అంటాడు. దానిని మార్చాలంటాడు.' "అలగావాళ్ళకు అన్నం దొరికే మార్గం జూపందే సాంఘిక హక్కులిచ్చినా ప్రయోజనకారులు కావు" అని రామనాయుడితో స్పష్టంగానే చెప్పాడు.

విజయవాడ పంచముల సదస్సుకు వెళ్ళినప్పుడు వెంకటరెడ్డితో జరిపిన సంభాషణ సారం దీనికి కొనసాగింపే. ఆర్థిక వ్యత్యాసాల మీదే సంగదాసు ఊనిక. ఆది ఆంధ్రుల సంఘం బాగు ముందు చూడవలసినది అన్నది వెంకటరెడ్డి అభిప్రాయం కాగా సంగదాసు దుర్భరమైన దారిద్ర్య స్థితిలో మునిగిన మొత్తం హిందూ సంఘం పునర్నిర్మాణాన్ని కోరతాడు. చిన్న సంఘాల అభివృద్ధికై అవలంబించే మార్గాలు పెద్ద సంఘం యొక్క క్షేమానికి భంగం కాకుండా ఉండాలని కూడా హెచ్చరించాడు. ఆర్థిక సమస్యల పరిష్కారానికి రాజకీయ సమస్యల పరిష్కారానికి ఉండే సంబంధం గురించిన అవగాహన కూడా సంగదాసుకు ఉంది. అయితే అతను అర్ధాంతరంగా చౌదరయ్య చేతిలో మరణించకపోయి ఉంటే జాతీయోద్యమంలో భాగంగా కార్మికోద్యమాన్ని నడిపి ఉండేవాడనుకోవచ్చు. రామానాయుడు ఆ వారసత్వానికి కొనసాగింపు. ప్రతి విషయంలో తండ్రిని ప్రతిఘటించటం ఇష్టం లేక కొంతకాలం రైతుకూలీ సమ్మెలలో ప్రత్యక్ష జోక్యం కలిగించుకోకపోయినా తండ్రి మరణానంతరం పూర్తిగా ఉద్యమంలోకి చేరిపోవటానికి నిశ్చయించుకొన్నాడు. మంగళాపురం కార్మిక సంఘం ఏర్పడటం అతని చొరవ వల్లనే కావాలి. కార్మిక సంఘాలన్నీ దేశస్వాతంత్ర్యమునకు పూర్తిగా పనిచేయమని కార్యక్రమం ఇయ్యటం సంగదాసు ఆంతర్యాన్ని అమలు చెయ్యటం అనుకోవచ్చు.

ఆ కార్మిక సంఘం, కార్మిక సంఘ నాయకుడుగా రామానాయుడు పోలీసు నిఘాకు గురికావటం నివేదికలకు ఎక్కటం వాస్తవం. తక్కెళ్ల జగ్గడి నాయకత్వాన నడుస్తున్న ఉద్యమంలో పని చేస్తున్న సంతానులకు ఆశ్రయం ఇస్తున్నాడనే కేసును, ఖైదును కూడా అతను ఎదుర్కొనవలసి వచ్చింది. కార్మికోద్యమాన్ని గురించి పనిచేయనని వాగ్దానమిస్తే ఖైదు ఆర్డర్ రద్దు చేస్తామని ప్రభుత్వ బాధ్యుల రాయబారాలు కూడా. కార్మికోద్యమానికి పనిచేయటమో మానటమో నిర్ధారణ చేసుకొనటం తనపని గానీ తమది కాదు అని రామానాయుడు నిర్ద్వంద్వంగా పేర్కొనటం ఆ షరతు తమ అభిప్రాయానికి భిన్నంగా చెప్పగూడదని పాలక జాతులకుండే అహంకారానికి గుర్తుగా భావించి నిరసించాడు. వందేళ్ల తరువాత ఈ నాడు స్వతంత్ర భారతంలో కూడా అదే పరిస్థితి. తాము నమ్మిన రాజకీయాల కోసం మాట్లాడటం, వ్రాయటం, తమకు ఇష్టమైన వృత్తి ఉద్యోగ సాంస్కృతిక రంగాలలో పనిచేయటం ప్రభుత్వాల దృష్టిలో నేరం అయిన కాలం ఇది. సభలు, సమావేశాలపైన నిషేధాలు, ఇళ్లపై దాడులు, ఊపా వంటి కేసులు మోపి జనజీవితాన్ని కల్లోలానికి గురిచేస్తున్నకాలం ఇది. ఆ రకంగా బ్రిటీషు వలసపాలన ఆర్థిక రాజకీయ నీతి స్వతంత్ర భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోకి ప్రవహించి ఇప్పుడీ నవల చదువుతున్నవాళ్లకు కూడా ఇది తమకాలపు నవలే అనిపించేట్లుగా ఉంది.

5

మాలపల్లి నవల ఇతివృత్తంలో సంతానుల ఉద్యమం ఒక భాగం. ఒళ్ళు దాచుకోని వ్యవసాయ పనిమంతుడు, తల్లిదండ్రులపట్ల, తోడబుట్టిన వాళ్లపట్ల ప్రేమ, బాధ్యత గల మృదు హృదయుడు వెంకటదాసు తమ్ముడి మరణానికి, సాగుచేసే భూమి దగ్గర నుండి తనకుటుంబం అన్నీ కోల్పోవటానికి కారణమైన పెత్తందారీతనం మీద ఆగ్రహోదగ్రుడు కావటం ప్రతిక్రియకు పురికొల్పింది. అది ధర్మ కన్నాల కార్యక్రమంగా రూపు తేలింది. "ఎవరైనా తనకవసరమైన దానికంటే ఎక్కువ భాగ్యం పోగుచేసి అవసరమైన వాళ్ళకుపయోగపడకుండా నిలువ చేసినా లేక దుర్వ్యయం చేస్తున్నా వాడింట్లో కన్నం వేసి ఆ ద్రవ్యమంతా లోకానికి ఉపయోగపరిచే పద్ధతి ధర్మకన్నాలు" అని అతనే నిర్వచించాడు కూడా. ధనవంతుల పక్షాన ఉన్న దేవుడిని, రాజ్యాన్ని, ధనవంతుల ప్రయోజనాలకోసం ఏర్పడిన ధర్మశాస్త్రాలను నిరసించిన వెంకటదాసు వాటన్నిటికీ తాను అతీతుడిని అని ప్రకటించుకొని ఇల్లువదిలి వెళ్లి తక్కెళ్ల జగ్గడు అయినాడు. నల్లమల కీకారణ్యంలో సంతానులను సమీకరించి స్థావరం ఏర్పరచుకొని సైనిక సంతానులకు నివాసాలు ఏర్పరచి, సంతానుల భార్యలకు ఆశ్రమాలు ఏర్పరచి, అది కేంద్రంగా విశాఖ తదితర ఏజెన్సీ ప్రాంతాలలోనే కాక మద్రాసు, హైద్రాబాదు, మైసూరు రాజ్యాలవరకు బందిపోట్లు సాగించి లేనివాళ్లకు పంచిపెడుతూ, బీదల సంక్షేమానికి వెచ్చిస్తూ వచ్చాడని కథనం. 'కూలికి దగిన విలువ పుచ్చుకొనే కూలికి మారిపోండి' అన్నది అతని ప్రబోధం. 'పనివాండ్లందరు యేకమైతిరా ప్రపంచమే మీది' అని భరోసాను ఇచ్చినవాడు. సమతా ధర్మం ప్రపంచమందున స్థాపించటమే జీవితాదర్శంగా చేసుకొన్నవాడు.

సంతాలులు, సంతాల్ ఉద్యమాలు ఉన్నాయి. మరి ఈ సంతానులు ఎవరు?

సంతాల్‌లు ప్రాచీన ఆదివాసీ జాతి. వేటమీద, ఆహారసేకరణ మీద ఆధారపడి జీవిస్తూ ప్రకృతి వనరులను సహజ హక్కుగా వాడుకొనే జీవితం వాళ్ళది. బ్రిటిష్ పాలనలో శిస్తు చెల్లింపులకు, అప్పులకు వడ్డీలకు, వెట్టికి ఆదివాసీల బతుకు తాకట్టు పడింది. ఈ పరిస్థితులలో బ్రిటిష్ సాయుధ బలగాలకు వ్యతిరేకంగా జార్ఖండ్‌లో 1772లో మల్ పహారియా తిరుగుబాటుతో ఆదివాసీ తిరుగుబాటు చరిత్ర మొదలైంది. 1878లో వచ్చిన అటవీ చట్టం వలన బ్రిటిష్ వలస స్థానిక ఆదివాసీలకు అడవిలో సాగు, పశువులను మేపటం, వేట, కట్టె కొట్టి తెచ్చుకొనటం, తేనె తెచ్చుకొనటం అన్నీ నిషేధించబడ్డాయి. ఆదివాసీల ఆహార భద్రతకు ముప్పు ఏర్పడింది. అది సంథాల్ తిరుగుబాటుకు (1856) దారితీసింది. దారిద్ర్యంతో క్రైస్తవ మిషనరీలను ఆశ్రయించి కొంత చదువు, కొంత ఆధునిక లౌకిక జ్ఞానమూ సంపాదించిన ముండాలు భూమిపైన, అడవులపైన తమ హక్కును తిరిగి పొందటానికి చేసిన చట్టబద్ధ పోరాట చరిత్రలో 1900 జూన్ 9న మరణించిన బిర్సాముండా నాయకత్వంలో జరిగిన ఉల్ గులాన్ ఉద్యమం ఉన్నవ లక్ష్మీనారాయణకు సమకాలపుది. ఇరవై మూడేళ్ళ యువకుడుగా సమాజంలో సమానత్వం గురించిన కొత్త ఆలోచనలతో సంస్కరణ ఉద్యమం వైపు తొలి అడుగులు వేస్తున్న ఉన్నవ బిర్సాముండా గురించి అప్పుడో ఆ తరువాతో తెలుసుకొనే ఉంటాడు. సంతాల్ ఉద్యమంతో ప్రభావితమయ్యే ఉంటాడు. ఆ రకంగా ఈ నవల ఇతివృత్తంలోకి సంతానోద్యమంగా ఆ చరిత్ర ప్రవహించి ఉంటుందనిపిస్తుంది.

సంతానులు సనాతనులు. తొలి నుండీ ఉన్నవాళ్లు. సృష్ట్యాదిలో స్వంత సంపదలు ఏర్పడకముందు అందరూ అన్నీ సమానంగా పొందినవాళ్లు. సంతానులు అనే మాట వాడటంలో ఉన్నవ ఉద్దేశం భారతీయులందరూ ఒకే తల్లి సంతానం. ఏ ఒక్కరు మిగిలినవాళ్లకంటే తక్కువ కాదు. ఎక్కువ తక్కువలు ఉన్నాయంటే సమం చేయటమే కర్తవ్యం. బాధిత పీడిత సంతానం తమ హక్కుల కోసం ఉద్యమించారు కనుక అది సంతానుల ఉద్యమం అయిందని అనుకోవచ్చు. కోర్టులో తన వాదాన్ని వినిపిస్తూ వెంకటదాసు భగ్యవంతులు బీదలను దోచుకొంటే దాని పేరు వ్యవహారం, బీదలు తమ హక్కును తీసుకొంటే చౌర్యం ఎందుకైంది అని ప్రశ్నిస్తాడు. అంతే కాదు, “దేశమాత ప్రసాదించగల సౌఖ్యాలు ఆమె సంతానమంతా సమానంగా అనుభవించడానికవకాశం గలిగి ఇహమే స్వర్గమవుతుంది” అని తన నిశ్చితాభిప్రాయాన్ని వ్యక్తీకరిస్తాడు. దానిని బట్టి ఆయన తన ఉద్యమాన్ని సంతానుల ఉద్యమం అన్నాడు. ఆదివాసీలను కూడగట్టటంలో, సాయుధ సైనిక నిర్మాణం కలిగి ఉండటంలో, బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదుర్కొనటంలో, చివరకు అణచివేతకు గురి కావటంలో కూడా సంతాలుల ఉద్యమానికి సమీపంగా, సమాంతరంగా ఈ సంతానుల ఉద్యమాన్ని నవలేతివృత్తంలో భాగం చేయగలిగాడు ఉన్నవ.

ఆదివాసీల జీవితాన్ని ధ్వంసం చేస్తున్న అటవీచట్టాలకు వ్యతిరేకంగా బ్రిటిష్ రాజ్యంపై అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో జరిగిన రంప పితూరీగా ప్రసిద్ధికెక్కిన పోరాటం మాలపల్లి రచనాకాలానికి ఇంకా మొదలు కాలేదు కానీ, 1905 బెంగాల్ విభజన సమయంలో భారత స్వాతంత్ర్యం విప్లవ మార్గంలో సాధించవలసినది అని అరవింద్ ఘోష్ జుగంతర్ పార్టీని ఏర్పరచి తొలి అడుగులు వేస్తున్న క్రమం, అమెరికాలో ఏర్పడి భారత స్వాతంత్ర్య ఉద్యమంలోని విప్లవకర శక్తులకు సహాయ సహకారాలు అందించిన గదర్ పార్టీ పనిక్రమం అన్నీ ఉన్నవ భావప్రపంచాన్ని కుదిపేసిన ప్రభావం కూడా సంతానుల ఉద్యమ కల్పనలోకి చొచ్చుకువచ్చే ఉంటుంది.

జమీందారులు, వర్తకులు సొమ్మును ఒక దగ్గర పోగుపెట్టి తిన్నది తినగా తాగుడుకు, భోగాలకు తగలేస్తుంటే బీదలు అన్నానికి లేక బాధపడే వైరుధ్య పరిష్కారానికి జగ్గడు ఎన్నుకొన్న కార్యక్రమం ఉన్నవాళ్లను దోచి లేనివాళ్లకు పెట్టటం. కేసు విచారణలో కోర్టుకు అతను వినిపించిన వాదంలో దీనిని సమర్థించుకొనటం ఉంది. సమర్థులై ఇతరుల ధనం అపహరించినవాళ్లు ఆ సంపదను సంతానానికి వారసత్వంగా సంక్రమింప చేయటానికి తగిన చట్టాలు తెచ్చుకొన్నారు. కష్టపడి పంటలు పండించి, చేతి పనులు చేసి అమర్చిన పదార్థాలను ధనవంతులు అపహరించి శ్రమ చేసిన వాళ్లకు తిండి లేకుండా చేస్తున్నారు. ‘ఒక చోట పల్లం చేస్తేనే కాని వేరొక చోట మెట్ట ఏర్పడదు. భూమి కుంగి చేరువైతే పక్కన కొండ ఒకటి పైకుబుకుతుంది’ వంటి ఉపమానాలతో అశేష జనులు దరిద్రులై ఎవరో కొందరు భాగ్యవంతులవుతున్న వాస్తవాన్ని వివరించగలిగిన వెంకటదాసు జ్ఞానం అనుభవం నుండి, పరిశీలన నుండి కలిగినదే అయినా సోషలిస్టు జ్ఞానానికి దగ్గరదే. పూర్తిగా సోషలిస్టు జ్ఞానం కాకపోవటం వల్లనే ఆ పరిస్థితిని మార్చటానికి తాను అనుసరించిన ధర్మకన్నాల పద్ధతి కాక మరొకటి లేదని అతను అనుకొన్నాడు. అందుకే భాగ్యవంతులు బీదలను దోచుకొంటే అది వ్యవహారం, సామర్థ్యం అయి, బీదలు తమహక్కును తీసుకొంటే అది చౌర్యం ఎలా అవుతుందని అతను సవాల్ చేయగలిగాడు. ‘అక్రమ చట్టాల ఔరస సంతానమే బీదల నేరాలు’ అని శిక్ష బీదల నేరాలకు కాక ఆ నేరాలకు కారణమైన ధనికవర్గపు అక్రమ చట్టాలకు వేయాలన్న అభిప్రాయాన్ని ధ్వనింప చేయగలిగాడు. ధనికవర్గం తమ వర్తనను మార్చుకోకపోతే బీదలే ఆ చట్టాలు మార్చి భూతల స్వర్గం స్థాపిస్తారు అని నమ్మకంగా ప్రకటిస్తాడు. అతను ఊహించిన భూతల స్వర్గం సోషలిస్టు సమాజాన్ని సూచించేదే.

జగ్గడి నాయకత్వంలో ఈ సంతానుల ఉద్యమానికి ఉన్నవ ఏ నల్లమలను కేంద్రంగా చేసాడో ఆ నల్లమల 1980ల నాటికి సమతాధర్మం ప్రపంచమందున స్థాపించాలన్న జగ్గడి ఆదర్శాన్ని ఆచరణ వాస్తవం చేయగల మార్క్సిస్టు లెనినిస్టు మావో ఆలోచనా విధాన మార్గంలోకి ప్రవహించటం చూస్తాం. అందువల్ల ఈ తాత్విక అవగాహన గలిగిన తరానికి మాలపల్లితో ఒక ఆత్మీయ బంధం సమకూరుతుంది.

సంగదాసు రైతుకూలీ ఉద్యమమైనా, రామనాయుడు చెప్పే కార్మికోద్యమమైనా, ‘పనివాండ్లందరు యేకమై ప్రపంచమంతా సమతా ధర్మాన్ని’ స్థాపించటానికి తక్కెళ్ల జగ్గడు చూపిన మార్గమైనా వాస్తవిక భూమికపై సుసాధ్యం అయ్యే ‘ప్రయోగాత్మక నమూనా’ఒకటి ఉన్నవ మాలపల్లి నవల వ్రాయటానికి మూడు నాలుగేళ్ల ముందే రష్యాలో సిద్ధం అయి ఉంది. అదే బోల్షివిజం.

సంగదాసు చౌదరయ్యతోనూ, రామనాయుడితోనూ భూమికి రైతు కూలీకి ఉన్న తక్షణ ప్రత్యక్ష సంబంధం గురించి, దాని ప్రాతిపదికగా వాళ్లకు లభించవలసిన ఉత్పత్తి ఫలితాల గురించి చేసిన చర్చ అంతా బోల్షివిక్ విప్లవ మూలసూత్రాన్ని గురించిన ఎదో ఒక స్థాయి అవగాహన లేకుండా సాధ్యం కాదు. అలాగే “నా ధర్మం జనులవలంబిస్తే ప్రతివాళ్ళూ యథాశక్తిగా పాటుపడి అవసరమైనంత తిని గుండె నిమ్మళంగా రేపనే చింత లేకుండా, విద్యాబుద్ధులభ్యసిస్తూ, పస్తులు లేని, భోగాలు లేని, ద్వేషాలు లేని స్వచ్ఛంద జీవితాలు

అనుభవించటానికి అవకాశముంటుంది" అని వెంకటదాసు జైలులో గడిపిన చివరి క్షణాలలో తన తండ్రితో అన్నమాటలు బోల్షివిక్ విప్లవ సారాన్ని చెప్పేవే. జగన్నాథం గారి ధర్మతత్వాలు అని చెప్తూ కొందరు రైళ్లలో కరపత్రాలు పంచుతూ స్వంత ఆస్తిలేని కాలపు సమత్వం దగ్గర ప్రారంభించి కొందరిని కలిగినవాళ్లుగా, మరికొందరిని ఏమీలేనివాళ్ళుగా చేసిన వర్గవ్యవస్థను శ్రామిక వర్గ వ్యవస్థగా మార్చటానికి పనివాళ్ల ఐక్యతను ప్రబోధిస్తూ చెప్పిన బుర్రకథ సోషలిస్టు సమాజ మూలమైన గతితార్కిక చారిత్రక భౌతికవాద స్వభావాన్నే వ్యక్తీకరించింది.

నవల ప్రారంభంలో విజయవాడలో జరిగిన పంచముల సభలో వెంకటరెడ్డి చేసిన ప్రసంగంలో ప్రధాన భాగం బోల్షివిజం గురించే కావటం గమనించవచ్చు. లెనిన్ నాయకత్వంలో రష్యాలో బోల్షివిక్కుల విప్లవం ఫలించి రాజ్యాధికారం శ్రామికవర్గం చేతికి రావటం, సృష్టిలో వున్న వస్తు భండారం అనుభవించటానికి అందరికీ సమానంగా వున్న హక్కును ఆచరణ వాస్తవం చేసే ప్రభుత్వ విధానాలు రూపొంది అమలు కావటం నూతన ఆర్థిక పరిణామాలకు ఎలా దారితీసిందో వివరంగానే ప్రస్తావించబడింది. అయితే ఆ ఉపన్యాసంలో వెంకటరెడ్డి ముఖంగా ఉన్నవ 'మనం విప్లవ మార్గాలకు దిగకూడదు. ఇంగ్లాండ్‌లో ఏర్పడుతున్న పద్ధతులననుసరించి ఆచి అడుగువేయటం ఉత్తమ మార్గం' అని చెప్పించాడు. భూస్వాములనందరినీ భూములు అందరికీ పంచిపెట్టమంటే అంగీకరిస్తారా? అది మనం కోరదమూ భావ్యం కాదు' అని చెప్పించిన మాటలు భారత జాతీయవాద రాజకీయార్థిక దృక్పథం సంస్కరణల పరిధిలో రూపొందుతున్న విషయాన్ని సూచిస్తూనే ఉంది. ఈనాటి పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని ధనస్వామ్య స్వభావానికి పునాది అదే.

రామానాయుడి దృష్టి, వకీలు నారాయణ రావు దృష్టి సోషలిస్టు సమాజం నిర్మాణం మీదకన్నా స్వరాజ్యం మీదనే ఎక్కువగా ఉండటం ఆ క్రమంలోనే జరిగింది. స్వరాజ్యం రానిదే ఏ ఉద్యమాలూ సాగవు అంటూ నారాయణరావు సమకాలపు ప్రభుత్వ వైఖరే బోల్షివిజం వ్యాపించటానికి ఆజ్యం పోస్తున్నదని భావిస్తాడు. సంతానోద్యమం బోల్షివిజానికి వామ శాఖ అని రామానాయుడి అభిప్రాయం. అంటే భారతదేశానికి బోల్షివిజం అభిలషణీయం కాదన్నదే తాత్పర్యం. స్వరాజ్యం వచ్చి ప్రజలందరి సౌఖ్యం సమకూడే క్రమంలో బోల్షివిజం అవసరం లేకుండా పోతుందని వాళ్ళ ఆంతర్యం. ఏది ఏమైనా దేశీయ సమస్యల గురించి చర్చిస్తూ పరిష్కార మార్గంగా బోల్షివిజం ఒకటి ఉందని అంతర్జాతీయ రాజకీయార్థిక పరిణామాలవైపు చూడమని చెప్పటం వల్ల, దానిని భిన్న కోణాల నుండి చర్చకు పెట్టటం వల్ల మాలపల్లి నవలలో ఐతిహాసిక స్వభావం గాఢతను సంతరించుకొన్నది.

6

సామాజిక జీవితరంగంలో సంస్కరణను ఆశించే పంచమోద్యమం, ఆర్థిక రంగంలో న్యాయబద్ధమైన మార్పును ఆశించే కార్మిక ఉద్యమం ఏవైతే మాలపల్లి నవల ఇతివృత్తంలో ప్రధానంగా చర్చకు వచ్చాయో అవి సక్రమంగా సాగటానికి, సత్ఫలితాలు ఇయ్యటానికి మొదటి షరతుగా నారాయణరావు వంటి లాయర్లు సంభావించిన స్వరాజ్యం జాతీయోద్యమ ఆశయం. మాలపల్లి నవలలో అది ప్రత్యక్ష అంశం కాకపోయినా అన్ని జీవితరంగాలపై దాని ప్రభావాన్ని తత్ఫలితమైన మనుషుల చైతన్య చర్యలను చిత్రించటంలో ఉన్నవ చూపిన శ్రద్ధ, నేర్పు చెప్పుకోదగినవి. ఆనాడు గాంధీ స్వరాజ్య సాధనకు ఒక కార్యక్రమంగా రూపొందించి ఇచ్చిన సహాయనిరాకరణ భావన అసహాయోద్యమం అనే పేరుతో తరచు ప్రస్తావనకు వస్తుంది.

పంట కోత కూలీ ధాన్యం నుండి ధనానికి మార్చటానికి ఆసాములు ప్రణాళికలు రచిస్తుంటే వాళ్ళు నిర్ణయించిన పావలా కూలీ పెరిగిన ధాన్యం రేటుతో పోల్చినపుడు న్యాయమైనది కాదని గ్రహించిన కూలీలు దానిని అడ్డుకొనటానికి అసహాయ ఉద్యమమే సరి అయినదని భావించటం చూస్తాం. కోతలకు పోవద్దు, ఎట్లా కోసుకొంటారో చూతాం అన్న వీరదాసు అన్న మాటలో ధ్వనించేది సహాయనిరాకరణమే. సక్రమమమైన కూలీ ఇయ్యక కూలీల శ్రమ వల్ల వచ్చే సంపదలో అధికభాగం భూస్వాములే అనుభవిస్తున్నందువల్ల వేతల, కోతల కాలంలో సమ్మెకట్టి సహాయనిరాకరణ చెయ్యాలని బెజవాడలో జరిగిన పంచముల సభ చేసిన తీర్మానం దాని ప్రతిధ్వనే.

ధర్మకన్నాలకు దిగిన వెంకటదాసు జగ్గడుగా ప్రబోధించిన ధర్మతత్వాలు కూడా ఈ అసహాయోద్యమ తాత్వికతను పట్టుకొన్నవే. " రామ రామ శ్రీరామా రామా- రామా -రఘురామా / తక్కెళ్ల జగ్గని ధర్మబోధలూ - తలపున నిలపండి" అని ప్రారంభమయ్యే బుర్రకథలో శ్రేణులు గట్టీ సమ్మె గట్టమని ప్రబోధిస్తూ "కొట్టా వద్దు, తిట్టా వద్దు కోర్కెలు నిడివేరున్ / అసహాయ యోగము తరుణము చూచి అవలంబించండి / దానికి మిగిలిన మంత్ర తంత్రములు - ధరలో లేవండి" అని చెప్పటం గమనించదగినది. తమ్ముడి దుర్మరణం, దానికి ప్రతిక్రియ లేకపోవటం వల్ల భూస్వామ్య ధనిక వర్గాలపట్ల, వారికి మద్దతుగా ఉన్న అధికారం పట్ల, భగవంతుని పట్ల కూడా ద్వేషంతో రగిలిపోయిన వెంకటదాసు కూడా అహింసాయోగాన్ని, అసహాయ ఉద్యమాన్ని అవలంబించమని ప్రబోధించాడంటే ఆనాడు అన్ని జీవితరంగాలపైనా అది ఎంత ప్రభావశీలమైన ముద్ర వేసిందో అర్థం చేసుకోవచ్చు.

రామదాసు కూడా అసహాయ ఉద్యమ అవగాహన ఉన్నవాడే. తక్కెళ్ల జగ్గడి బందిపోట్ల నెపంతో కార్మికోద్యమాన్ని అణచివేయ జూస్తున్న బ్రిటిష్ ప్రభుత్వం మంగళాపురంలో అనేకమందిపై జామీను కేసులు పెట్టింది. కార్మిక సంఘాలు ఏర్పరచి దొంగలకు తోడ్పడుతున్నారని, జీవనాధారం ఏదీ లేక చోరీలు వగైరా నేరాలు చేస్తున్నారని కేసు. మంచి నడవడికి హామీ ఇస్తూ ఒక సంవత్సరం పాటు నూరేసి రూపాయలకు ఇద్దరితో జామీను ఇప్పించుకొన్నా, అదే మొత్తానికి స్వంత జామీను అయినా ఇయ్యవచ్చునని ఆ కేసు సారాంశం. ఆంధ్రమహాకార్మిక సంఘం వారి సూచనప్రకారం మంగళాపురం కూలీసంఘపు సభ్యులు సమావేశమై మేజిస్ట్రేట్ కోర్టు నోటీసులో సంగతులన్నీ అబద్ధాలనీ వాదించాలనీ, మేజిస్ట్రేటు ఉత్తరువులు ఖాయపరిచేట్లయితే జామీను ఇయ్యక అందరూ ఖైదుకు పోవాలనీ తీర్మానించారు. జామీను ఇయ్య నిరాకరించటం అసహాయోద్యమ వ్యూహంలో భాగమే. మేజిస్ట్రేట్ తన వయసుకు, వ్యక్తిత్వానికి గౌరవం ఇచ్చి వదిలేసి మిగిలిన వాళ్ళ కేసులు ఖరారు పరచి నిడదవోలు సెంట్రల్ జైలుకు పంపిస్తే తనను అక్రమంగా వదిలిపెట్టారని రామదాసు బాధపడటం కార్మిక సంఘపు సూచనల మేరకు శాసనోల్లంఘన అవకాశం కోల్పోయానన్న అసంతృప్తి వల్లనే.

మంగళాపురంలో మతవిషయచర్చలో తనను ఎదిరించి ఓడించాడన్న బాధ లోపల తొలుస్తున్న బ్రాన్ సన్ ఈ సందర్భాన్ని ఉపయోగించుకొని రామదాసు కూలీలకు దొంగలకూ గురువని, అతను వూళ్ళో ఉండటం ప్రమాదకరమని తాను సూపరెంటెంట్‌గా ఉన్న ఉండవల్లి సెటిల్‌మెంట్‌కు అతనిని తరలించటానికి తన అధికారాన్ని వినియోగించాడు. సెటిల్‌మెంట్స్ అంటే నేరస్థజాతుల సంస్కరణ కోసం ఏర్పరచిన స్థావరాలు. 1871 క్రిమినల్ ట్రైబల్ యాక్ట్ ప్రకారం నేరస్థ

జాతుల గుర్తింపు మొదలైంది. వాళ్లను సంస్కరించటానికి తీసుకోవలసిన చర్యలను సూచించటానికి 1902-3 సంవత్సరంలో ఏర్పడిన అత్యున్నతాధికారం గల పోలీస్ కమీషన్ చేసిన సిఫారసుల మేరకు 1911లో ఒక చట్టం వచ్చింది. దానిప్రకారం నేరస్థ జాతులుగా గుర్తించబడిన ఎరుకల వాళ్ళ కోసం గుంటూరు జిల్లా బాపట్ల సమీపంలో 1913లో స్టువర్ట్‌పురం సెటిల్మెంట్ ఏర్పడింది. అలా నేరస్థ జాతుల వారిని ఒక దగ్గరకు సమీకరించి పోలీసు పహారాలో ఉంచి తగిన జీవనోపాధి కల్పించటం లక్ష్యంగా ఇలాంటి సెటిల్మెంట్స్ ఏర్పడుతున్న దశాబ్ది ఉన్నవకు సమకాలం. అధికారవర్గపు ఆగడాలకు, మతమార్పిడులకు, నేరాన్ని వ్యవస్థీకృతం చేయటానికి, ధనికవర్గపు వ్యవసాయ, నిర్మాణరంగ అవసరాలకోసం చౌకగా శ్రామికవర్గాన్ని సరఫరా చేయటానికి కేంద్రాలుగా ఈ సెటిల్‌మెంట్లు ఎలా పని చేస్తున్నాయో చూస్తూ, తెలుసుకొంటూ వస్తున్న ఉన్నవ ఆ వ్యవహారాన్ని కూడా నవలేతివృత్తంలో భాగం చేసాడు.

రామదాసు సెటిల్మెంట్‌లోకి ప్రవేశించింది మొదలు అక్కడి వాళ్ళ సమస్యలు తెలుసుకొనటానికి, సమీకరించటానికి, పోరాటానికి సంసిద్ధం చేయటానికి తన సమయాన్ని శక్తిని వెచ్చించాడు. క్రైస్తవ మతబోధకు హాజరు కాకుండా ఉండే స్వేచ్ఛ కోసం, సాగుకు భూములు, బడి పెట్టించి చేతిపనులు నేర్పించటం అన్న మూడు డిమాండ్లతో ఉద్యమనిర్మాణానికి రూపకల్పన కూడా చేసాడు. ఇదంతా స్వరాజ్య ఉద్యమ స్ఫూర్తి వల్లనే సాధ్యం అయింది. సేవకు మనుష్యులను చేర్చుకొనటానికి, క్రైస్తవ మతవ్యాప్తికి తప్ప మరి ఏ విధమైన ప్రయోజనమూ లేని ఈ సెటిల్మెంట్లను స్వరాజ్యం వచ్చిన తరువాత పద్ధతులన్నీ మార్చి గ్రామాలుగా చేయాలి అని కలలు కన్నాడు. ఫలితంగా సెటిల్‌మెంట్ నుండి పారిపోతున్నారన్న దొంగ కేసు బనాయించబడి ఆరునెలల జైలు శిక్ష అనుభవించవలసినవాడైనాడు. ఈ సందర్భం అభిప్రాయాలు కలిగి ఉండేందుకు, ప్రకటించేందుకు, ప్రచారం చేసేందుకు ఉన్న సాంస్కృతిక రాజ్యాంగ హక్కులను వినియోగిస్తున్నవాళ్ళపై నిఘా, నిర్బంధం, తప్పుడు కేసుల బనాయింపు సర్వసాధారణమై జైళ్లు నింపబడుతున్న వర్తమాన గాయాల సలపరింతను పెంచేదే.

ఈ విషయం తెలిసి గుంటూరు చేరిన మంగళాపురం జనం తాలూకా ఆఫీసు ముందు నిలబడి మహాత్మాగాంధీకి, రామదాసుకు జైకొట్టినట్లు చెప్పటం ద్వారా ఉన్నవ రామదాసును జాతీయోద్యమ కార్యకర్తగానే నిరూపించినట్లయింది.

రామదాసు దంపతుల మీద కేసు మోపి జైలుకు తరలించటం వల్ల సెటిల్మెంట్‌లో ఒంటరిగా మిగిలిన పిల్లలు జ్యోతి, రంగడు విషయంలో తీసుకోవలసిన చర్యల గురించి సంప్రదించటానికి రామానాయుడు లాయర్ నారాయణరావును కలిసినప్పుడు వారిద్దరి మధ్య స్వరాజ్యం గురించిన చర్చ నడుస్తుంది. స్వరాజ్యం వచ్చే ప్రయత్నం అంతా చేయాలి అన్న అంగీకారానికి నారాయణరావు రావటం చూస్తాం. గాంధీగారి ఉద్యమంలో బాగా నమ్మకం కుదరక ఇంతవరకూ అజ్ఞాయిస్తున్న ఆయన అసహాయోద్యమం మనతత్వానికి బాగా పట్టిన మందు అన్న అవగాహనకు వచ్చాడు. బ్రిటిషు వారి న్యాయస్థానాలలో వాదించము అని లాయర్లు ప్రాక్టీస్ వదిలేస్తున్న సమకాలీన సందర్భం నుండి ఇక కొత్త కేసులు పట్టను అన్న నిర్ణయానికి వచ్చాడు. 1920లో ఉన్నవ లక్ష్మీనారాయణ ఈ రకంగానే న్యాయవాద వృత్తిని వదిలేసాడు.

సహాయనిరాకరణ ఉద్యమంలో ఒక కార్యక్రమం బ్రిటిష్ ప్రభుత్వానికి అత్యధిక ఆదాయ వనరుగానూ దేశీయ ప్రజల ఆరోగ్యానికి, ఆదాయాలకు హానికరంగానూ ఉన్న సారా దుకాణాలను బహిష్కరించటం. కోస్తా ఆంధ్రాలో అది సారాయి అమ్మకాలను కొనుగోళ్లను వ్యతిరేకిస్తూ దుకాణాల ముందు గుమి కూడి దిగ్బంధం చేయటంగా సాగింది. దానిని ఈ నవలలో ఒక కేసు రూపంలో భాగం చేసి చూపాడు రచయిత. సారా దుకాణాలకు పోయేవాండ్లను నిర్బంధిస్తున్నాడని ఒకనిపై ఆరోపణ. సారాదుకాణం నడి ఊళ్ళో ఉన్నదని చుట్టుపక్కల కాపురముండేవాళ్ళకు తాగుబోతుల వల్ల అసౌకర్యంగా ఉందని అందువల్ల ఆపటానికి ప్రయత్నించినా మాట నిజమేనని ముద్దాయి అంగీకరించాడు. దుకాణాలు దూరంగా ఉంటే తాగేవాళ్లకు మాత్రం అసౌకర్యం కాదా అని తాగుబోతుల పక్షాన జిల్లా మేజిస్ట్రేట్ వాదన. సౌకర్యంగా తాగటం వాళ్ళ హక్కు అన్న స్థాయిలో, ఆ హక్కును కాపాడటం ప్రభుత్వ బాధ్యత అన్న స్థాయిలో ఉన్నాయి ముద్దాయి లేవనెత్తిన అభ్యంతరాలకు అధికారి ఇచ్చిన సమాధానాలు. ప్రభుత్వ ఉద్యోగులు, సారాయి ఇజారాదార్లు జనం చేత సారాయి తాగించాలని చేసే విశ్వప్రయత్నాలు, సారాయి తాగవద్దని బోధించే వారిని అల్లరి మూకలుగా చెప్తూ జనులకు తాగేటందుకు స్వతంత్రత వుండాలని, తాగవద్దని ప్రబోధించటం వాళ్ళ స్వేచ్ఛకు భంగకరమని ప్రబోధకులమీద కేసులు పెట్టి జైళ్లకు పంపిన బ్రిటిష్ వలస ప్రభుత్వ వైఖరి 1980-90లలో స్వతంత్ర్యం భారత ప్రభుత్వ విధానంగా కొనసాగటం చూస్తాం. సారా ధరల తగ్గుదల ఉద్యమ సందర్భంలో కానీ, సారా వ్యతిరేక ఉద్యమ సందర్భంలో కానీ పోలీసు నిఘా మధ్య తాగుబోతుల హక్కులకు భంగకరం కాని విధంగా ప్రభుత్వమే పథకాలు పెట్టి సారా అమ్మకాలు కొనసాగించిన చరిత్ర గుర్తుకురాక మానదు. అది ప్రజల ఆరోగ్య ఆర్థిక కౌటుంబిక సామాజిక జీవితాలలో సృష్టించే బహుముఖీనమైన విధ్వంసానికి పేద మొహం పెట్టి ఈనాటికీ ప్రభుత్వాలు మద్యాన్ని ఒక ప్రధాన ఆర్థిక వనరుగానే భావిస్తూ ప్రవర్తించటం చూస్తున్నదే.

రామానాయుడు తన మీద జామీను కేసు రావటానికి ముందు ఒకసారి, వచ్చి జామీను ఇయ్యనిరాకరించి ఆరునెలలు ఖైదులో ఉన్నప్పుడు ఒకసారి వకీల్ నారాయణరావుతో చేసిన సంభాషణలో కార్మిక సంఘాలు అన్నీ ఖద్దరు పని చేస్తున్నవి అని, దేశ స్వాతంత్ర్యం కోసం పనిచేస్తున్నవని చెప్పటం గమనించదగినది. 1920 లో అఖిలభారత కాంగ్రెస్ కార్మిక సంఘం (ఎ ఐ టి యు సి) ఏర్పడిన తరువాత జరిగిన పరిణామం ఇది. కార్మికులు కూలీ పెరుగుదల, పని పరిస్థితులలో మెరుగుదల కోరుతూ సమ్మెలు చేయటం తక్షణ ప్రయోజనాల సాధన కొరకు. కార్మికుల దీర్ఘకాలిక ప్రయోజనాలకు దేశానికి బ్రిటిష్ వలసపాలన నుండి విముక్తి మొదటి షరతు అన్న అవగాహనతో కార్మికులను స్వాతంత్ర్య ఉద్యమంలో భాగస్వాములను చేసే పని అఖిలభారత కాంగ్రెస్ సంఘం నాయకత్వంలో జరిగింది. ఈ సమకాలీన చారిత్రక పరిణామాలను సూచిస్తాయి రామానాయుడి మాటలు.

అంతే కాదు. రామానాయుడు రాజకీయ వ్యవహారాలలో తనకు ప్రత్యక్షంగా ప్రవేశం కలిగించుకోలేదని చెప్తూనే దేశ స్వాతంత్ర్య కోసం పూర్తిగా పనిచేయాలని కార్మిక సంఘాలన్నిటికి ఖండితంగా చెప్పివచ్చాను అన్నమాటను బట్టి అతను అఖిలభారత కాంగ్రెస్ కార్మిక సంఘంలో ఏదో బాధ్యతాయుతమైన స్థానంలో ఉన్నట్లు అర్థం చేసుకోవచ్చు. తాగుడు మానటం, నూలు వడకటం మొదలైన కాంగ్రెస్ లక్ష్యాలు కార్మికులకు ఆచరణ కార్యక్రమాలు కావటం, కార్మిక

సంఘాలన్నీ తమ సభ్యులు ఖద్దరు బట్టలే ఉపయోగించాలని తీర్మానాలు చేయటం, పన్నులు కట్టనిరాకరించటం విషయంలో కూడా అవసరం వచ్చినప్పుడు చర్యకు దిగటానికి, చివరకు ఖైదుకు కూడా పోవటానికి కార్మికులను సిద్ధం చేయటం జరిగిందని రామానాయుడు చెప్పినది భారత కార్మికవర్గం జాతీయోద్యమంలోకి సమీకరించబడుతున్న క్రమాన్నే సూచిస్తుంది. స్వరాజ్యం రానిదే కార్మికోద్యమ విజయం సాధ్యంకాదన్న అవగాహన దీని వెనుక ఉంది. మహాసంఘ నిర్మాణానికి అనుకూలంగా ఇతర సంఘాలను నడపటం అనే సంగదాసు ఆశయంలో భాగం ఇది. అయితే అదే సమయంలో రామానాయుడు స్వరాజ్యం వస్తే అన్నీ తేలుతాయి కదా అని ఎవరైనా తాము పనిచేసే ఏ స్థాయి ప్రజా ఉద్యమాన్ని అయినా వదులుకోకూడదు అని గట్టిగా నమ్ముతాడు.

అందువల్లనే కార్మికోద్యమానికి పనిచేయను అని వాగ్దానమిచ్చి ఖైదు నుండి విడుదల కావటానికి వచ్చిన అవకాశాన్ని తిరస్కరించాడు. పాలక జాతులకుండే అహంకారం ఏ స్థాయిలోనైనా గర్హించటం విధి అని అంటాడు. ఇక్కడ అభిప్రాయాలు ఏర్పరచుకొనటానికి, తమకు ఇష్టమైన రంగాన్ని ఎంచుకొని పనిచేయటానికి ఉన్న హక్కు ఏ సందర్భంలోనూ వదులుకోరానిది అని అతని భావనగా తోస్తుంది. ఒక ప్రయోజనం కోసం ఒక ఆశయాన్ని తాకట్టు పెట్టటం అంటే భావదాస్యానికి లోనవటమే. భావదాస్యానికి వశమైనవాళ్ళు జాతీయ దాస్యాన్ని అసహ్యించుకొని జాతీయ విముక్తికి పోరాడగలరు అంటే తాను నమ్మలేను అంటాడు. వకీల్ నారాయణ రావుతో రామానాయుడు మాట్లాడిన ఈ కొద్ది మాటలు ఈనాడు సంక్లిష్టమైన సామాజిక ఆర్థిక రాజకీయ సంబంధాల నేపథ్యంలో దేశంలో ఏదో ఒక అంశం గురిగా ఏదో ఒక చోట భిన్నస్థాయిలలో, విభిన్న రూపాలలో జరుగుతున్న బహుళ ప్రజాస్వామిక ఉద్యమాలకు మధ్య ఉండవలసిన అన్యోన్య సంబంధాన్ని, చైతన్యానికి, ఆచరణకు మధ్య సంబంధాన్ని గురించి జరుగుతున్న చర్చోపచర్చలను స్పృశించేవి, స్పృహను కలిగించేవి కావటం గమనించవచ్చు. **(ఇంకా ఉంది)**

---

**(7 పేజీ తరువాయి)**

వచ్చి కారమ్స్ అడుతూండేవారట. వరూధిని ఆయన్ని ప్రేమించింది - లవ్ ఎట్ ఫస్ట్ సైట్ లాగా! కాని ఇద్దరికీ వయసు తేడా వుందని గ్రహించి పెళ్లి వద్దన్నారట కెకె. కాదు కూడదని వరూధిని పట్టుదల పట్టారట. అమే గెలిచింది మొత్తానికి. తురగా జానకీ రాణీ వీరి బంధువే. ఇలా ఎందరో సాహితీవేత్తలు, కళాకారుల నడుమ పెరిగిన వరూధిని ఎంతో సాహితీ వివేచనతో కొడవటిగంటికి చేదోడు వాదోడు అయ్యారు.

1945లో కొమ్మూరు పద్మావతి ప్రథమ పుత్రిక వరూధిని కొడవటిగారు కొడవటిగంటిల (రిజిస్టర్) పెళ్లికి శ్రీశ్రీ, మాగోఖలే సాక్షి సంతకాలు పెట్టారు. బళ్లారి రాఘవ శుభాశీస్సులు పంపారు.

సైన్సు వ్యాసాలు, సాహిత్యవ్యాసాలు రాయడంతో పాటు సితార్ వాయించేవాడు రోహిణీప్రసాద్. శాంతసుందరి గొప్ప అనువాదకురాలిగా పేరుపొందింది.

శాంత సుందరీ, గణేశ్వర్రావుగారు తమ పిల్లల దగ్గరకీ, విదేశీ పర్యటనలకి వెళ్లినప్పుడు వరూధిని మొయినాబాద్ ఓల్డ్ ఏజ్ హోంలో వుండేవారు. ఆమెని చూసేందుకు నళిని దంపతులు వెళ్తుంటే నేనూ వెళ్లేదాన్ని. ఎన్నో కబుర్లు కలబోసుకునే వాళ్లం. హోమ్‌లో వున్న మిగిలినవాళ్లు తనకన్నా ఎక్కువ ఒంటరితనంతో బాధపడుతున్నారని వాపోయేవారు. మనుషుల్ని, వాళ్ల ప్రవృత్తుల్ని చక్కగా అంచనా కట్టేవారామె. ఆవిడ ధైర్యం, నిబ్బరం మరువలేనివి. ప్రతివారం నళిని, శ్రీనివాస్‌లతో ఫోన్లో మాట్లాడి వైద్య సలహాలు పాటించేవారు.

తనుకన్న ముందు ఇద్దరు బిడ్డల్ని కోల్పోయి, ఒంటరిగా వృద్ధాశ్రమంలో కాలం గడుపుతున్న వరూధిని చివరిదాకా తన ఆత్మస్థైర్యాన్ని మాత్రం కోల్పోలేదు. ఎప్పటిలా గలగల మాట్లాడుతూనే, చివర్లో భోరున ఏడ్చేవారు. నాకూ ఏడుపు ఆగేదికాదు. అన్ని ఆటుపోటుల మధ్య కూడా తన అభ్యుదయ భావాల్ని కించిత్తు కూడా ఒదులుకోలేదు. కడదాకా వామపక్ష భావాల్ని ప్రేమించిన వరూధినిగారికి నా హృదయపూర్వక నివాళి.




Statement about ownership and other particulars of periodical **ARUNATARA** as required to be published in the first issue of every year after the last day of February.

**Form IV (See Rule 8)**

| | |
|---|---|
| 1.Place of Publication | : Vijayawada |
| 2.Periodicity of its Publication | : Monthly |
| 3.Printer's Name | : Duvvuri Venkata Ramakrishna Rao |
| Whether citizen of India | : Indian |
| Address | HNo- 6-1/16-7A/1, Peddiraju Street, Prizer Peta, Vijayawada - 520001 |
| 4.Publisher's Name | : Duvvuri Venkata Ramakrishna Rao |
| Whether citizen of India | : Indian |
| Address | : HNo- 6-1/16-7A/1, Peddiraju Street, Prizer Peta, Vijayawada - 520001 |
| 5.Editor's Name | : Arasavilli Krishna |
| Whether citizen of India | : Indian |
| Address | : HNo- 6-1/16-7A/1, Peddiraju Street, Prizer Peta, Vijayawada - 520001 |
| 6.Name and addresses of Individuals who own the newspaper | : Duvvuri Venkata Ramakrishna Rao |

I, Duvvuri Venkata Ramakrishna Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*
*(Duvvuri Venkata Ramakrishna Rao)*
Signature of the Publisher

Date : 1st March, 2022

# టోని జోసెఫ్ 'తొలి భారతీయులు'

**రమేష్ పట్నాయక్**

ప్రముఖ రచయిత టోని జోసెఫ్ 'ఎర్లీ ఇండియన్స్' అనే తన రచనను 2018లో ప్రచురించాడు. ఈ రచనకు ఉపమకుటం 'ది స్టోరీ ఆఫ్ అవర్ యాన్సిస్టర్స్ అండ్ వేర్ వియ్ కమ్ ఫ్రమ్'. ఈ రచనను ఆకెళ్ళ శివప్రసాద్ గారు గత సంవత్సరం (2021) తెలుగులో 'తొలి భారతీయులు' అనే మకుటంతో అనువదించారు. సంఘ్‌పరివార్ శక్తులు అధికారంలో ఉండి చరిత్రను, సాంస్కృతిక వారసత్వాన్ని వక్రీకరిస్తున్న నేటి పరిస్థితులలో ఈ రచనను ప్రతి ఒక్కరూ చదవాలి. సామాజిక విషయాలపై వ్యాసాలు రాసేవారు, ఉపన్యాసాలు చెప్పేవారు అయితే తప్పక చదవాలి. ఆ రచనలో ఉన్న కొన్ని ప్రధానమైన విషయాలను పరిచయం చేయడమే ఈ వ్యాస ఉద్దేశ్యం. ప్రపంచ పఠంతో పరిచయం ఉండడం లేదా దగ్గర పెట్టుకోవడం మంచిది. ఉటంకింపులన్నీ, ప్రత్యేకంగా వివరించకపోతే 'ఎర్లీ ఇండియన్స్' నుంచే.

సంఘ్‌పరివార్ శక్తులు మానవ పరిణామం భారతదేశంలోనే జరిగిందని చిరకాలం వాదించారు. 'ఇప్పుడు మానవ పరిణామం ఆఫ్రికాలోనే జరిగింది, ఆఫ్రికానుంచి హెూమో సేపియన్స్ ప్రపంచమంతా విస్తరించారు' (పుట 21) అని చెప్పే ఔటాఫ్ ఆఫ్రికా థియరీ రూఢీ కావడంతో ఆ వాదన మానివేశారు. వారి మరొక వాదన, ఆర్యులు భారతదేశానికి బయట నుండి రాలేదని, భారత దేశం నుండే ఐరోపాకూ, పశ్చిమ మరియు కేంద్ర ఆసియాలకు విస్తరించారని. ఈ వాదన కూడా పూర్తిగా పూర్వ పక్షం చేయబడింది. ఈ 'తొలి భారతీయులు' అనే రచన వారి వాదనలను పూర్వ పక్షం చేయడమేగాక తొలి భారతీయులు ఎవరు, ఎక్కడి నుండి వచ్చారు అనే విషయాలను సప్రమాణంగా పాఠకుడి ముందు పెడుతుంది.

వాయు మండలం చల్లబడి భూమి ఏర్పడింది 470 కోట్ల సంవత్సరాల క్రితం అని, ఏకకణ జీవులు ఉద్భవించింది 380 కోట్ల సంవత్సరాల క్రితం అని, 40 నుంచి 70 లక్షల సంవత్సరాలకు పూర్వం చింపాజీలు, మానవ పూర్వ జాతులు విడివడినాయనే విషయాలు చాలా కాలంగా తెలిసినవే. చింపాంజీల నుంచి విడివడిన ఈ మానవ రూప (హెూమో) జాతులు వివిధ అభివృద్ధి క్రమాలు చూపించాయని, మన పూర్వీకులైన హెూమో సేపియన్స్ ఇతర మానవ జాతులైన నియాండ్రతలెన్సిస్, డెనిజోవాన్స్‌తో ఒకే కాలంలో జీవించారని, కొన్ని సందర్భాలలో లైంగిక సంబంధాలలోనికి వచ్చారని, ఆకారణంగా వారి జీన్స్ కూడా మనలో ఉన్నాయని శాస్త్రజ్ఞానం ఋజువు చేసింది. ఇటువంటి 'సంపర్కాలు' మరికొన్ని బయటపడవచ్చని శాస్త్రజ్ఞులు అంటున్నారు. అయతే ఇతర మానవ జాతులు నశించిపోయాయని, ఆధునిక మానవులుగా పిలువబడే మన పూర్వీకులు (హెూమోసేపియన్స్) మాత్రమే మిగిలారని వారి తొలి ఆధారాలు, 3 లక్షల సంవత్సరాల క్రితం ఆఫ్రికా ఖండం మొరాకో దేశంలో సఫి నగరానికి ఏభై కిలోమీటర్ల దూరంలో లభ్యమయినాయని (పుట 21), అప్పటి నుంచి ఇప్పటి వరకు ఈ మానవులలో 16 జెనిటికల్ గ్రూపులు (మైటో కాండ్రియల్ హాప్లో గ్రూపులు) ఏర్పడ్డాయని, అయితే అందులో 15 గ్రూపులు ఇప్పటికీ ఆఫ్రికా ఖండంలో లభ్యం అవుతున్నందున అంటే ఆఫ్రికా ఖండంలోనే ఎక్కువ వైవిధ్యం ఉన్నందున, ఆ ఖండంలోనే మానవ పరిణామం జరిగి ప్రపంచమంతా మానవ జాతి విస్తరించిందని శాస్త్రజ్ఞులు విశ్లేషిస్తూ వచ్చారు. అయితే ఈనాడు డి.యన్.ఎ అధ్యయనాల వలన ఆఫ్రికా బయట ఉన్న మొత్తం జనాభాకు తల్లి ఒకరే అని ఆమె మూలాలు ఆఫ్రికా అని తేలడంతో అన్ని అనుమానాలు పరిష్కారమై మన పూర్వీకుల పరిణామం ఆఫ్రికాలోనే జరిగిందని రూఢి అయింది (పుట 21). సదరు 16 గ్రూపులలో 'ఆఫ్రికా నుండి బయట పడిన L3 అనే గ్రూపు మాత్రమే ప్రపంచమంతా విస్తరించిందని సప్రమాణికమైన ఋజువులు ఉన్నాయి' (పుట 29). ఇక్కడే పాఠకుడు గమనించాల్సిన విషయం ఏమంటే ఈ పదహారు గ్రూపుల మధ్య జెనిటిక్ వ్యత్యాసం చాలా తక్కువ. అంతేకాదు ఆ వ్యత్యాసాలు గుణాత్మకంగా కూడా ప్రధానమైనవి కావు. కాబట్టి జెనిటికల్‌గా ఫలానా జాతి గొప్పది మరొకటి తక్కువది అని భావించడం శాస్త్రీయం కాదు, రాజకీయం మాత్రమే. ఇక అంతరించిపోయిన నియాండ్రతలెన్సిస్, డెనిజోవాన్స్ అనే మానవ జాతులను విడిచిపెట్టి మన పూర్వీకులైన హెూమోసేపియన్స్‌ను ఆధునిక మానవులు అంటారు. ఇక్కడ అధునికత అన్న భావం నాగరికతకు సంబంధించినది కాదని, మానవ పరిణామానికి సంబంధించినదని ఇప్పటికే పాఠకులు గ్రహించి ఉంటారు. మన ప్రస్తుత చర్చ మేరకు మానవ జాతి పరిణామం ఆఫ్రికాలోనే జరిగిందని ఇంకా, అక్కడి నుండే మానవ జాతి ప్రపంచమంతా విస్తరించిందనే విషయాలు గమనిస్తే సరిపోతుంది.

ఆఫ్రికా ఖండం నుండి మానవులు పలుమార్లు

బయటపడడానికి ప్రయత్నించారని, అయితే చివరిగా వారు సుమారు 70 వేల సంవత్సరాల క్రితం (80వేల నుండి 70వేల సంవత్సరాల కాలపరిధిలో ఒకానొకప్పుడు అనడం మరింత శాస్త్రీయంగా ఉంటుంది) ఆఫ్రికా ఖండంలో ఈశాన్యంగా ఉన్న ఎరిత్రియా దేశం నుండి 'గేట్ ఆఫ్ టియర్స్' వద్ద సౌదీ అరేబియాకు ఆగ్నేయ దిశలో ఉన్న యెమెన్ చేరుకోవడం ద్వారా ఆఫ్రికానుంచి బయటపడడంలో విజయవంతం అయినారని ఈ నాడు స్పష్టమైన ఋజువులు ఉన్నాయి. అనతి కాలంలోనే అంటే 65 వేల సంవత్సరాల నాటికే వారు భారత వాయవ్య ప్రాంతాలకు వచ్చారని, ఇంకా మధ్య ప్రదేశ్‌లో మెహ్తాఖేరి ప్రాంతానికి 45 వేల సంవత్సరాల క్రితం నాటికి (పుట 56), ఆంధ్రప్రదేశ్‌లో కర్నూలు జిల్లాలో జ్వాలాపురం ప్రాంతానికి 35 వేల సంవత్సరాల క్రితం నాటికి చేరిన మానవులు 30 వేల సంవత్సరాల క్రితం నాటికి సుమారు దేశమంతా విస్తరించారని చెప్పవచ్చు (పుట 60) . ఆనాడు జనాభా చాలా తక్కువగా ఉండేది. అంతేకాదు వారి వద్ద ఉన్నవి, కాస్తా పదును ఎక్కువ ఉన్నవి అయినా, రాతి పనిముట్లు మాత్రమే కావున వారికి నివాస యోగ్యమైన ప్రదేశాలు కూడా చాలా తక్కువ అని మనం గ్రహించాలి. భారతదేశం అంతటా విస్తరించడం అంటే వారు నిలదొక్కుకోగలిగిన ప్రాంతాలకు విస్తరించారని అర్థం చేసుకోవాలి. ప్రస్తుత జనాభాతో పోల్చితే వీరి జనాభా చాలా తక్కువ అన్న మాట వాస్తవమే కాని అనాటి ప్రపంచ జనాభాలో ఎక్కవ భాగం కేంద్ర మరియు తూర్పు భారతదేశంలోనే ఉండేది. ఏదేమైనా భారతదేశంలో వీరే తొలి 'ఆధునిక' మానవులు. జెనిటిక్‌గా వీరు L3 కి చెందిన M, N, R ఉప గ్రూపులకు చెందిన వారు. అండమాన్‌లో M అనే ఒక్క ఉపగ్రూపు (ఓంగే జాతి) మాత్రమే ఉంది. కాగా ఐరోపాలో N, R ఉప గ్రూపులు మాత్రమే ఉన్నాయి. 65 వేల సంవత్సరాల నుండి 30 వేల సంవత్సరాల కాల పరిధిలో తొలి మానవులు భారతదేశం అంతటా విస్తరించారన్నదే ఇక్కడ ప్రధానమైన విషయం. మైటోకాండ్రియా, వై క్రోమోజోమ్ లకు పరిమితం కాకుండా అన్ని ప్రాంతాలలో, అన్ని భాషా సమూహాలలో అన్ని కులాలలో, తెగలలో ఈ తొలి భారతీయుల జీన్స్ 50 నుండి 65 శాతాలలో ఉన్నాయి' (పుట 66). అంటే భారతదేశంలో జెనిటికల్‌గా అందరం ఒకటే.

ఈ ఆధునిక మానవులు ఆస్ట్రేలియాకు 65 వేల సంవత్సరాలకు పూర్వం, ఐరోపాకు 45 వేల సంవత్సరాలకు పూర్వం, బేరింగ్ జలసంధికి 16 వేల సంవత్సరాల పూర్వానికి, దక్షిణ అమెరికా దక్షిణ కొనకు 14,600 సంవత్సరాల క్రితానికి చేరారని అంచనా వేస్తున్నారు (పుట 43లో మ్యాప్). గత 45 – 20 వేల మధ్య కాలంలో ప్రపంచ జనాభాలో అత్యధికులు దక్షిణాసియాలోనే జీవించారు (పుట 57). మనం ఇప్పుడు సౌలభ్యం కొరకు దేశాల పేర్లు, ఖండాల పేర్లు రాసుకుంటున్నాం. కాని ఆనాటి తొలి మానవులకు అటువంటి ఎల్లలు ఏవీ లేవు, అటువంటి ఎల్లలు గుర్తించడం వారికి సాధ్యం కూడా కాదు.

భూమిపై వాతావరణ పరిస్థితులు మారుతూ ఉంటాయి. 'చల్లని పొడి' హిమనీనదీయ వాతావరణం, 'వెచ్చని తడి' వాతావరణం అనే వాతావరణ వ్యవస్థలు కాలగమనంలో ఏర్పడుతున్నాయి. వీటిని మెరైన్ ఐసోటోప్ స్టేజెస్ (MIS)లుగా గుర్తిస్తారు. 261 కోట్ల సంవత్సరాల క్రితం నుంచి ఇప్పటి వరకు 104 వాతవరణ దశలు మార్చి మార్చి ఏర్పడ్డాయి. 29వేల సంవత్సరాల క్రితం నుంచి 14వేల సంవత్సరాల క్రితం వరకు చల్లని పొడి వాతావరణం ఉండింది. ఈ వాతావరణం జీవజాతుల అభివృద్ధికి అనుకూలమైనది కాదు. మనం 14వేల సంవత్సరాల క్రితం నుంచి వెచ్చని తడి వాతావరణ దశలో ఉన్నాం. ఇందులో కూడా 12,900 నుంచి 11,700 సంవత్సరాల క్రితం వరకు యంగర్ డ్రైయాస్ కాలం. అది వృక్ష, జంతు జాతులకు, ఆ కారణంగా మానవులకు అనుకూలమైన వాతావరణం కాదు. అయినా పాలస్తీనాలో నాటుఫియన్ ద్వంద్వ జీవన విధానం - పశుపోషకులు, రైతులు సమాంతరంగా జీవించడం - కనిపించింది (పుట 79). ప్రపంచ వ్యాప్తంగా తీసుకుంటే వివిధ ప్రాంతాలలో మానవులు నాగరికత అభివృద్ధి ఇప్పటికి 11,700 సంవత్సరాల క్రితం తరువాత మాత్రమే. క్రీస్తు శకంలో చెప్పుకోవాలంటే క్రీ.పూ 9,700 సంవత్సరాల క్రితం నుంచి వివిధ ప్రాంతాలలో మానవ నాగరికత, ప్రధానంగా వ్యవసాయ నాగరికత అభివృద్ధి కనిపిస్తుంది. దీనిని హెూలోసీన్ ఉపయుగం అంటారు. ఈ కాల ప్రారంభానికి ప్రపంచ జనాభా సుమారు 40 లక్షలు అని ఒక అంచనా. ఈ యుగపు ప్రారంభంలో సారవంతమైన చంద్రవంకగా పిలువబడే ఇరాన్, ఇరాక్, లేవెంట్‌లలో, భారత్ భాగంగా ఉన్న దక్షిణ ఆసియాలో, ఈజిప్ట్‌లో తరువాత చైనా ప్రాంతాలలో వ్యవసాయ ప్రారంభ ప్రయోగాలు జరిగాయి (పుట 67, 80). "కాబట్టి మనం చూసే విశాలమైన విషయం ఏమంటే, అంతకు ముందు, హిమనీనదీయ కాలంలో వివిధ కాలాలాలో, వివిధ ప్రాంతాలలో వివిధ రూపాలలో సాధించిన ప్రగతి ఫలితంగా పదుతూ లేస్తూ ఉండిన అభివృద్ధి క్రీ.పూ 9,500 మరియు 6,500 మధ్య కాలంలో అంటే యంగర్ డ్రయాస్ ముగింపు జరిగి హెూలోసీన్ ఉపయుగం ప్రారంభం అయిన వెంటనే, 3000 సంవత్సరాల కాలం పాటు, మొక్కలు మరియు జంతువుల పెంపకం సారవంతమైన చంద్రవంక (ఫర్టైల్ క్రెసెంట్) భూములలో చాలావరకు వ్యాపించాయి."(పుట 82). ఇప్పుడు చరిత్రకారులు క్రీ.పూ మరియు క్రీ.శ తరువాతకు బదులు కామన్ ఎరా (సి.ఇ) అని, బిఫోర్ కామన్ ఎరా (బి.సి.ఇ) అని వ్యవహరిస్తున్నారు. కాలగణనలో తేడా ఏమీ ఉండదు కావున మనకు అలవాటైన క్రీ.పూ మరియ క్రీ.శ లనే వాడుతున్నాను.

ప్రస్తుత పాకిస్తాన్‌తో కలిపి భారతదేశ విషయానకి వస్తే క్రీస్తుపూర్వం 7000 సంవత్సరాల కాలంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో సంత్ కబీర్ నగర్ జిల్లాలో లాహురాదేవాలో బియ్యం పండించినట్లు తెలుస్తుంది (పుట 85). అక్కడ వ్యవసాయంలో ప్రయోగాలు జరుగుతున్నాయి. క్రీ.పూ 7,000 నుంచి 2,600 సంవత్సరాల కాలంలో మెహర్‌ఘడ్ (ప్రస్తుత పాకిస్తాన్ బలూచిస్తాన్ ప్రాంతంలో) వ్యవసాయ నాగరికత విస్తరించింది. లాహోరాదేవా అనంతర కాలంలో గుజరాత్, తూర్పు రాజస్థాన్ ప్రాంతాలలో క్రీ.పూ 3,700, దక్షిణ మరియు తూర్పు భారత దేశాలలో క్రీ.పూ 3,000, మధ్య ప్రదేశ్ మాల్వా ప్రాంతంలో క్రీ.పూ 2,000, వింధ్యలో క్రీ.పూ 1,700 కాశ్మీర్ మరియు స్వాత్ లోయలలో క్రీ.పూ 1,500 కాలంలో వ్యవసాయం కనిపించింది. అయితే వ్యవసాయం కనిపించిన ప్రతి సందర్భంలో నగర నాగరికత కనిపించలేదు. వ్యవసాయంలో కనీస స్థాయి అభివృద్ధి సాధ్యం కాకుండా, 'అదనపు ఉత్పత్తి' జరగకుండా నగరి నాగరికత వృద్ధిచెందజాలదు. నగర నాగరికతల మేరకు గమనించాలంటే ముందుగా చెప్పిన మెహర్‌ఘడ్ నాగరికత క్రీ.పూ 7000 నుండి 2,200 వరకు తరువాత




హరప్పా నాగరికత క్రీ.పూ 5,500 నుండి 1,300 వరకు కనిపిస్తాయి (పుట 101). ఇందులో మెహర్‌ఘడ్ నాగరికత ఉచ్ఛదశ 5,500 నుండి 2,600 వరకు కాగా హరప్పా నాగరికత ఉచ్ఛదశ క్రీ.పూ 2,600 నుండి 1,900 వరకు. ఇక, వ్యవసాయ నాగరికతలు ప్రతి సందర్భంలో నిలదొక్కుకోలేదు. ఎంతగానో అభివృద్ధి చెందిన హరప్పా (సింధూ) నాగరికత కూడా చివరికి కూలిపోయిన విషయం తెలిసిందే. వ్యవసాయ నాగరికతలు ఏఏ సందర్భాలలో నిలదొక్కుకోగలిగాయి అనే విషయం ఈ రచనలో ప్రత్యేకంగా చర్చించలేదు.

సింధూ నాగరికతను ఇప్పుడు హరప్పా నాగరికత అంటున్నారు. ఈ నాగరికత చాలా విశాలమైనది. ఆనాటి ప్రపంచంలో అదే అత్యంత పెద్ద నాగరికత (పుట 8, 105). హరప్ప నాగరికత తన ఉచ్ఛ దశలో పాకిస్తాన్‌లో అత్యధిక భాగం, ఆఫ్ఘనిస్థాన్‌లో ఈశాన్య భాగం, భారత దేశంలో పంజాబ్, రాజస్థాన్, హర్యానా, ఉత్తర్ ప్రదేశ్ మరియు గుజరాత్ లలో విస్తరించింది (పుట 106). ఆనాడు ఈ నాగరికత ఒక మిలియన్ చదరపు కిలోమీటర్ల వైశాల్యం కలిగి ఉండింది, అంటే నేటి భారత్ వైశాల్యంలో మూడవ వంతు అన్న మాట (పుట 120). ఈ నాగరికతలో జీవించిన ప్రజాసమూహాలు కూడా ఆనాటి కాలంలో ఉండిన అన్ని నాగరికతల కంటే ఎక్కువ (పుట 121). ఈ నాగరికత క్రీ.పూ 3,300 నాటికే లిపి ప్రారంభ లక్షణాలను కలిగి ఉంది. ఈ నాగరికత సింధూ లోయ ప్రాంతాన్ని దాటికూడా విస్తరించి ఉండినందున మొదటిగా కనుగొనబడిన నగరం హరప్పా పేరుమీద ఈ నాగరికతను వ్యవహరిస్తున్నారు. దీనిని బి.జె.పి వారు వాదిస్తున్నట్లు సింధూ సరస్వతి నాగరికత అని పిలిచినా అన్ని ప్రాంతాలు కలవవు. ఇక సరస్వతి నది మీద చర్చ ఉండనే ఉంది. స్థలాభావం వలన ఆ చర్చలోనికి మనం వెళ్ళడం లేదు. ఈ హరప్పా నాగరికత ప్రజలకు మెసపుటేమియా వరకు వాణిజ్య సంబంధాలు ఉండేవి. మెసపుటేమియా మరియు హరప్పా సంస్కృతుల మధ్య చాలా సామ్యాలను ఈ రచయిత చూపుతాడు. ఆనాడు ఇరాక్, సిరియా నుండి గుజరాత్ వరకు కూడా నాగరికతల మధ్య సంబంధాలు ఉండేవి. నాగరికతల పరస్పర ప్రభావాలను రచయిత వివరించాడు.

మరల మనం మొదటికి వస్తే అంటే మనం ఎవరం, ఎక్కడి నుండి వచ్చాం అన్న ప్రశ్నలకు వస్తే, తొలి మానవులు 30వేల సంవత్సరాల క్రితం భారతదేశం 'అంతటా' విస్తరించారని గమనించాము. తరువాత 11,700 సంవత్సరాల క్రితం వరకు అంటే క్రీ.పూ 9,700 వందల సంవత్సరాల క్రితం వరకు మానవుల వలసలు గణింపదగ్గవిగా జరగలేదని చెప్పవచ్చు. తరువాత కాలంలో ప్రస్తుత ఇరాన్‌దేశం దక్షిణాన ఉన్న జాగ్రోస్ పర్వత పంక్తులనుండి మానవులు వాయవ్య భారతానికి మాత్రమే కాక గుజరాత్, మహారాష్ట్ర, కొంకణ్ ప్రాంతాల గుండా దక్షిణ రాష్ట్రాలకు విస్తరించారని రచయిత సాధికారికంగా వివరిస్తాడు. మనకు తెలిసిన మెహర్‌ఘడ్ నాగరికత (బలూచిస్తాన్, పాకిస్తాన్), విశాలమైన హరప్పా నాగరికతల నిర్మాణంలో ఇరాన్‌లో ఉన్న దక్షిణ లేదా మధ్య జాగ్రోసియన్ పర్వత శ్రేణి నుంచి వచ్చిన మేకల పెంపకందారుల ఆనవాళ్ళు డి.యన్.ఎ పరీక్షలలో చాలా స్పష్టంగా ఋజువైనాయి. "డి,యన్.ఎ మరియు పురావస్తు ఆధారాలను బట్టి మనకు తెలిసేదేమంటే దక్షిణ లేదా మధ్య జాగ్రోస్ ప్రాంతం నుండి ప్రాచీన ఎలామైట్ లేదా సంబంధిత భాష మాట్లాడే పశువుల కాపరులు క్రీస్తు పూర్వం 10 వేల తరువాత దక్షిణ ఆసియయాకు వలస వచ్చారు. వీళ్ళు తొలి భారతీయులతో కలిసిపోయారు. "జాగ్రోసియన్ జనాభా అయిన ఇరాన్ రైతులు, మందల కాపరుల తూర్పుగా విస్తరించి ఉప ఖండంలోని మొదటి భారతీయులతో కనీసం క్రీ.పూ 5,400 నుంచి 3,700 మధ్య కలిసినట్లు జెనిటిక్ అధ్యయనం తెలియజేస్తుంది" (ఆంగ్ల మూలం ఎ షార్ట్ క్రానాలజి). "..ఈ మిశ్రమ జనాభా భారత ఉప ఖండంలోని వాయువ్య ప్రాంతంలో వ్యవసాయ విప్లవానికి దారితీసింది. ఆ తరువాత కొన్ని సహస్రాబ్దాలలో హరప్పా నాగరికతను సృష్టించింది" (పుటలు 141, 142). ఈ విషయం డి.యన్.ఎ విశ్లేషణతోపాటు పురావస్తు శాస్త్రం మరియు భాషా శాస్త్రాల సమీకృత అవగాహన నుంచి ఏర్పడుతుంది. అలాగే హరప్పా నాగరికత ప్రజలలో స్టెప్పీల యొక్క జెనిటిక్ ఆనవాళ్ళు లేవని కూడా తేలింది. ఒక్క మాటలో చెప్పాలంటే 65వేల సంవత్సరాల క్రితం వాయవ్య భారత ఉపఖండంలో స్థిరపడినవారు మరియు సుమారు క్రీ.పూ 7 వేల సంవత్సరాల ముందు ఇరాన్ ప్రాంతం నుండి వలస వచ్చిన వారు హరప్పా నాగరికత నిర్మించారని చెప్పవచ్చు. అయితే అప్పుడు ఇరాన్ లేదు, ఇండియా లేదు. ఆనాడు ఉండేవి ఈజిప్ట్ నుండి భారత ఉపఖండం మీదుగా చైనావరకు పురాతన నాగరికతలు మాత్రమే. మెహర్‌ఘడ్‌కు ఇరాన్ జాగ్రోసియన్ పర్వత ప్రాంతం నుండి మేకల పెంపకందారులు వచ్చారా లేక వ్యవసాయం తెలిసిన వ్యవసాయదారులు వచ్చారా అనే చర్చకూడా వచ్చింది. ముందు వచ్చిన వారు మేకల మందల వారే అని అప్పటికే మెహర్‌ఘడ్‌లో ఒక స్థాయి వ్యవసాయం ఉండిందని, ఈ ఉమ్మడి జనాభా మొదట మెహర్‌ఘడ్‌లో, తరువాత హరప్పా నాగరికతలో వ్యవసాయాభివృద్ధికి తమ వంతు పాత్ర పోషించిందని రచయిత వివరిస్తాడు. 'భారతదేశానికి వచ్చిన ఇరానియన్లు ఎవరైతే అప్పటి భారత వాసులతో కలసి వ్యవసాయ నాగరికత నిర్మించారో వారు ఇరాన్ నుండి అభివృద్ధిచెందిన వ్యవసాయ పద్ధతులను తీసుకురాలేదు' (పుట 97). తొలి ఇరానియన్లు వాయవ్య భారతదేశానికి వచ్చిన తరువాత మాత్రమే ఇరాన్‌లో వ్యవసాయ అభివృద్ధి జరిగింది. అయితే పశ్చిమాసియా నాగరికతలతో మెహర్‌ఘడ్‌కు, హరప్పా నాగరకతకు

చాలా విశాలమైన సంబంధాలు కొనసాగాయి. అవి పరస్పర అభివృద్ధికి దోహదం చేసాయి.

ప్రస్తుత పాకిస్తాన్‌లో సింధ్ మరియు బెలూచిస్తాన్ రాష్ట్రాలలో ఉన్న బ్రాహుయీ భాష ఒక ద్రవిడ భాష అని చాలా కాలంగా తెలుసు. 2013లో వెలువడిన ఒక పరిశోధనా పత్రంలో "పాత ఎలామైట్ ప్రాచీన ద్రవిడ భాషను పోలి ఉంటుంది, క్రొత్త ఎలామైట్ బ్రాహుయిని పోలి ఉంటుంది (పుట 143)" అని సూత్రీకరించబడింది. ఈ ఆధారాలను బట్టి ఇరాన్‌లో ఎలామైట్ భాష మాట్లాడే జాగ్రోసియన్ పర్వత ప్రాంతం, భారత్ ఉపఖండ వాయవ్య ప్రాంతంలో మెహర్‌ఘడ్, హరప్పా నాగరికత, దక్షిణ భారతదేశం, కొంకణ్ ఇతర ప్రాంతాలలోని ద్రావిడ భాషలు ఒకే కుదురుకు చెందిన భాషలు అని తెలుస్తుంది. హరప్పా నాగరికత విచ్ఛిన్నమైన తరువాత అక్కడ ఆనాడు ఉన్న పెద్ద జనాభాలో అధిక శాతం ఉపఖండం పశ్చిమ తీరాన్ని అనుకుని దక్షిణం వైపు విస్తరిస్తూ దక్షిణ భారత ప్రాంతానికి వచ్చారని ఈ రచనలో అనేక పరిశోధనాపరమైన ఋజువులు చూపబడ్డాయి. దక్షిణాదిని ఆనుకుని ఉన్న ఒడిషా, జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్, మహారాష్ట్రలలోనూ ఇంకా పాకిస్తాన్‌ను ఆనుకుని ఉన్న ఆఫ్ఘనిస్తాన్, తజకిస్తాన్‌లలోనూ ఈ కుదురుకు చెందిన భాషాసమూహాలు ఉన్న విషయం గమనార్హం. అస్సాంలో కూడా ఈ భాషా కుటుంబానికి చెందిన ఒక తెగ ఉంది. ఈ తెగ అక్కడకు ఎలా చేరింది అన్న విషయమై ఈ రచనలో ఎటువంటి వివరాలు లేవు. అయితే, ఈ రచన సాధికారికంగా ఆది ద్రవిడ భాషలు ఉపఖండం వాయవ్య ప్రాంతంనుంచి (మెహర్ ఘడ్, హరప్పా నాగరికతల నుండి) దక్షిణాదికి దిగబడ్డాయని రూఢి పరచింది. నిజానికి '1981లో మెక్ అల్పిన్ రాసిన ప్రోటో - ఎలామో - ద్రవిడియన్: ది ఎవిడెన్స్ అండ్ ఇట్స్ ఇంప్లికేషన్స్" ఈ విషయాలపై చాలా లోతైన పరిశోధనా పత్రం. అయితే ఆ కాలంలో చాలా మంది భాషా శాస్త్రవేత్తలు అట్టి ప్రతిపాదనను ఆమోదించలేదు' (పుట 144). ఈ ప్రోటో - ఎలామో - ద్రవిడియన్ భాష మాట్లాడే హరప్పా నాగరికత ప్రజలకు వారు దక్షిణాదికి వచ్చేసరికి వ్యవసాయం తెలుసు. కాని అప్పటికే దక్షిణాదిలో కూడా వివిధ ప్రాంతాలలో వ్యవసాయం వివిధ స్థాయిలలో ఉంది. ఈ కలయిక వ్యవసాయ నాగరికత విస్తరించడానికి మరింత ఉపయోగకరం అయింది. హరప్పా నాగరికతలో ఉండిన అనేక సాంస్కృతిక అంశాలు భాషతో పాటు దక్షిణ దేశానికి కూడా వచ్చినాయి. "హరప్పా నాగరికత యొక్క ద్రవిడ స్వభావానికి మద్దతు యిచ్చే గణనీయమైన పురావస్తు మరియు భాషా అధారాలను మహాదేవన్ వివరించారు. గేదె కొమ్ము గల మగ దేవుడు, తల్లి దేవతలు, రావి చెట్టు, పాము, స్త్రీ పురుషుల గోప్యాంగాలను ఆరాధించమని సూచించే ముద్రలు ఉపరితల గోడలపై చిత్రాలు ఋజువులుగా చూపవచ్చు. ఇవన్నీ తొలి వేదాల నుండి కాకుండా ఆర్యన్ పూర్వ జనాభా నుంచి లభించాయి. (పుట 113)" దక్షిణ భారతదేశంలో 30వేల సంవత్సరాల క్రితం ఈ భూభాగానికి చేరిన తొలి మానవులు, హరప్పా నాగరికత పతనానంతరం అంటే క్రీ.పూ 1900 సంవత్సరాల తరువాత ఈ ప్రాంతానికి క్రొత్తగా వలస వచ్చిన ప్రోటో - ఎలామో - ద్రవిడియన్ భాష మాట్లాడే ప్రజలు కలవడం వలన ఇక్కడ జనాభా ఏర్పడిందని ఈ విశ్లేషణ తీర్మానంగా ప్రకటించింది. అంతేకాదు, హరప్పా నాగరికత విచ్ఛిన్నం కాకముందు కూడా జాగ్రోసియన్ మేకల కాపరుల గుంపులు దక్షిణ భారతదేశానికి తమ భాషతో పాటు వచ్చారని ఆ కారణంగా హరప్పా నాగరికత ప్రజలు దక్షిణానికి వచ్చేసరికే ఇక్కడ ప్రోటో ఎలామైట్‌కు దగ్గరగా ఉన్న ప్రోటో ద్రావిడ భాషలు ఉన్నాయని వివరిస్తున్నారు.

హరప్పా నాగరికత ప్రజలు ఉత్తరాదిలో కూడా విస్తరించారు. ఉత్తరాదిలో స్థానిక జనసమూహాలతో కలిసిపోవడమేగాక వారితో సాంస్కృతిక రంగంలో ఇచ్చిపుచ్చుకోవడాలు కూడా జరిగి ఉంటాయి. అయితే వారి తరువాత ఆ ప్రాంతాలకు వలస వచ్చిన 'ఆర్యులు' తమ జంతుబలి సంప్రదాయాలను, సంస్కృత భాషను వారిపై రుద్దడం వలన ఉత్తరాదిలో హరప్పా నాగరికత ప్రజా సమూహాల భాష మరియు సంస్కృతి ముందుకు రాలేకపోయాయి. అయితే వాటికి అధికార గుర్తింపు లేకపోయినప్పటికి జన సామాన్యంలో కొంత ప్రాచుర్యాన్ని పొందాయని రచయిత వివరిస్తాడు. ఇంకా, కాలం గడుస్తున్న కొద్దీ, తూర్పుకు విస్తరిస్తున్న కొద్దీ 'ఆర్య సంస్కృతి' బలహీనపడి స్థానిక సంస్కృతులలో భాగంగా హరప్పా సంస్కృతికూడా బయల్పడడం కనిపిస్తుంది. రచయిత అనేక ఇతర విషయాలతో పాటు ఒకప్పుడు (ఋగ్వేదంలో) వారు తీవ్రంగా వ్యతిరేకించిన లింగారాధన కూడా తరువాత కాలంలో ఆర్య సంస్కృతిలో భాగం కావడాన్ని ఉదాహరణగా చూపిస్తాడు. 65 -30 వేల సంవత్సరాల ముందు ఆఫ్రికా నుంచి వలన వచ్చిన తొలిమానవులతో భారత్ నిండి ఉంటే, వారితో హరప్పా ప్రజలతో కలగలసి మరియు నేరుగానూ వచ్చిన ఇరానియన్ జాగ్రోస్ ప్రజలు తరతమ వ్యత్యాసాలతో దేశమంతా విస్తరించారు. తరువాత సెంట్రల్ ఆసియానుండి వచ్చిన 'ఆర్యులు' మొదట్లో ప్రధానంగా ఉత్తరాదిన విస్తరించారు.

నిజానికి వింధ్యా పర్వతాల పైభాగాన్ని మనం ఉత్తర భారతం అని పిలుస్తాం. ఇంతకు ముందు చెప్పుకున్నట్లు తొలి మానవులు ఉత్తరాదికి కూడా 30 వేల సంవత్సరాలకు పూర్వం చేరి విస్తరించారు. ఆ తరువాత సుమారు 29వేల నుంచి 14వేల సంవత్సరాల క్రితం వరకు మానవ వలసలకు అనుకూలమైన పరిస్థితులు లేవని చెప్పుకున్నాం. ఇక, 11,700 సంవత్సరాల క్రితం ప్రారంభమయి నిరంతరాయంగా కొనసాగుతున్న ప్రస్తుత వెచ్చటి తడి హెూలోసీన్ అని పిలువబడే వాతావరణం దశలో జరిగిన వలసల వలననే ఉత్తరాదిలో ప్రధానంగా మిశ్రమ జనాభా ఏర్పడింది. 'ఆర్యులను జెనిటికల్‌గా ఒక స్వచ్ఛమైన గ్రూపుగా భావించకూడదు. నిజానికి వీరు అనేక జాతుల మిశ్రమ సంతతి' (పుట 9). సింధూ లోయకు వచ్చే సరికి హరప్పా నాగరికత కరవు వలన క్షీణించింది. దానిని ఆర్యులు విధ్వంసం చేశారనే వాదనను ఇప్పుడు ఎవరూ అంగీకరించడం లేదు. హరప్పా నాగరికత క్రీ.పూ 1900 నుండే క్షీణించడం ప్రారంభించింది. ఆర్యులు ఈ ప్రాంతానికి క్రీ.పూ 1500 సంవత్సరాల తరువాత వచ్చారు. వారు ఎక్కువగా ఉత్తరాదిలో విస్తరించారు. అయితే ఉత్తరాదికి క్రొత్తగా వలస వచ్చిన వారు ఆర్యులు మాత్రమే కాదు. ప్రధానంగా ముండారీలు, సంతాలులు, హెూహెూలు, ఇంకా ఖాసీలు వంటి ఆస్ట్రోయాసియన్ భాషలు మాట్లాడేవారు కూడా వలస వచ్చారు. "భారతదేశంలో ఆగ్నేయాసియా భాషలు మాట్లాడేవారు చైనా నుంచి ఉద్భవించిన వ్యవసాయ వలసలలో భాగంగా క్రీ.పూ 2వేల కాలంలో లేదా తరువాత ఆగ్నేయాసియా నుండి వచ్చారు. (పుట 122)". అలాగే, టిబెట్-బర్మా భాషలు మాట్లాడే జన సమూహాల కూడా భారతదేశానికి వచ్చారు. ఈ ప్రజలు ముందువెనుకలుగా ప్రస్తుత భారత భూభాగంలోనికి ఈశాన్య

ప్రాంతాల నుంచి వచ్చారు. వీరు లడక్, ఉత్తరాఖండ్, సిక్కం, అస్సాం, అరుణాచల్ ప్రదేశ్ ఇతర ఈశాన్య రాష్ట్రాలలో ప్రధానంగా బోర్డర్ ప్రాంతాలలో విస్తరించారు. ఆర్యులు వీరందరితో కలగలసి ఉత్తరాది జనాభాను ఏర్పాటు చేసారు. అయితే ఉత్తర, దక్షిణ భారతదేశాల మధ్య ఉన్న వింధ్య పర్వతాలు దుర్గమమైనవి కావు. కావున ఆనాటి కాలంలో కూడా రెండు ప్రాంతాల మధ్య జనాభాల పరస్పర మార్పిడి ఉండగలదని భావించవచ్చు. రవాణా మరియు సమాచార సౌకర్యాలు పెరుగుతున్న కొద్దీ జనాభాల విలీనం మరింతగా పెరుగుతూ ఉంది. క్రీ.శ మొదటి శతాబ్దం వరకు కుల వ్యవస్థ బలపడలేదు. ఈ విషయం కూడా జెనిటిక్స్ అధ్యయనాల ద్వారా తెలిసింది. ఆ కారణంగా వైవాహిక సంబంధాలకు ఎక్కువ స్వేచ్ఛ ఉండింది. ఆ కాలంలో జెనిటిక్ మిశ్రమం బాగా జరిగింది. ఉత్తరాదినే తీసుకుంటే తొలి మానవులు, హరప్పానాగరికత పడిపోయిన తరువాత గంగా మైదానం వైపు విస్తరించిన ఇరానియన్ జీన్స్ గలవారు, తూర్పునుంచి, ఈశాన్యం నుంచి వచ్చినవారు. వీరందరూ సుమారు 16వందల సంవత్సరాల పాటు కులగీతలు లేకుండా కలగలసిపోయారు. మౌర్య సామ్రాజ్యం పతనం అయిన తరువాత, సుంగ వంశం కాలంలో బౌద్ధం అణచివేయబడిన తరువాత, తదనంతరం బ్రాహ్మణ భావజాలం బలపడి కుల వ్యవస్థ ఒక అధిగమింపరానిదిగా తయారయ్యింది. క్రీ.శ 3వ శతాబ్దంలో మనం మను ధర్మశాస్త్రాన్ని చూస్తాం. అది పెరిగిన కుల విభజనను పటిష్టపరిచింది, 'ధర్మబద్ధం' చేసింది. ఇది భారత జాతిని బలహీనపరుస్తుంది.

ప్రపంచంలో ఏ ఇద్దరి వ్యక్తుల మధ్య అయినా జెనిటిక్ సామ్యం 99.9 శాతం ఉంటుంది. భారతదేశానికి కూడా అదే వర్తిస్తుంది. భారతదేశంలో వివిధ మతాలు, కులాలు, ప్రాంతాలు, భాషాజాతులు ఏవిధంగా తీసుకున్నా వీరి జీన్స్‌లో తొలిమానవుల జీన్స్ 50 నుంచి 65 శాతం వరకు ఉంటాయి. ఇరాన్ నుంచి నేరుగానూ, హరప్పా జనంతో కలగలసి వచ్చిన వారి జీన్స్ ఉన్నాయి. అలాగే సెంట్రల్ ఆసియా నుంచి ఇండో యూరోపియన్ భాషలు మాట్లాడుతూ తమను తాము ఆర్యులు అని పిలుచుకున్న వారి జీన్స్ కూడా ఉన్నాయి. ఇంకా తూర్పు ఆసియా నుంచి ఈశాన్య ప్రాంతాలనుంచి వచ్చిన వారి జీన్స్ కూడా ఉన్నాయి. ఆఫ్రికా తరువాత దక్షిణ ఆసియాలోనే జెనిటిక్ వైవిధ్యం ఎక్కువ అని రచయిత వివరిస్తాడు. ఇంకా ప్రధానమైన విషయం ఏమంటే మన తల్లుల జెనిటిక్ వారసత్వం చూస్తే 30వేల సంవత్సరాల క్రితం భారతదేశానికి వచ్చిన తొలి స్త్రీల సంతతి సుమారు 80 శాతం. మిగిలిన వారు గత పదివేల సంవత్సరాలలో వచ్చిన స్త్రీల వారసులు. ఇక తండ్రుల వారసత్వం తీసుకుంటే 30వేల సంవత్సరాల క్రితం భారతదేశానికి వచ్చిన తొలి పురుషుల వారసులు 25 శాతం మాత్రమే. మిగిలిన 75 శాతం పురుషుల తండ్రులు గత 10వేల సంవత్సరాలలో వచ్చినవారు. ఇప్పుడు ఇందులో మనవారు ఎవరు, బయటవారు ఎవరు. తండ్రుల జెనిటిక్ వారసత్వాన్ని తీసుకుంటే 75శాతం పురుషులను బయటకు పంపివేయాలి. తల్లుల వారసత్వాన్ని తీసుకుంటే అన్ని కులాలు, మతాలు, భాషలు, ప్రాంతాల నుంచి 20శాతం మనుషులను (స్త్రీలు, పురుషులు అందరిలో తల్లినుంచి వచ్చిన మైటోకాండ్రియా ఉంటుందికావున) పంపించివేయాలి. ఇది యోగీ ఆదిత్యనాథ్ చెప్పిన 80 : 20 కాదు. జెనిటిక్స్ చెప్పే నిష్పత్తి. మనవారు, బయటవారు అనే భావనే పూర్తిగా తప్పు. దక్షిణ ఆసియా మానవ నాగరికత అభివృద్ధికి ఎంతో అనుకూలమైనది. ఆఫ్రికా తరువాత అత్యధిక జెనిటిక్ వైవిధ్యం ఉన్నది దక్షిణ ఆశియాలోనే. అందరం బయటవాళ్ళమే, అందరం వలసదారులమే. అయితే ఇది భారత దేశానికి మాత్రమే కాదు. ఆఫ్రికా ఖండం బయట అన్నిదేశాలలో ప్రజలు వలస దారులే. పశ్చిమ యూరోపు, అమెరికా, ఆస్ట్రేలియా అన్ని ప్రాంతాలలో ప్రజలు కూడా అలలు అలలుగా వచ్చిన వలసదారులతో ఏర్పడినవే. ఇప్పుడు భారతదేశంలో ఇండో-యూరోపియన్ భాష మాట్లాడేవారు 75శాతం, ద్రవిడియన్ భాష మాట్లాడేవారు 20శాతం ఉన్నారు. మిగినిన వారు ఆస్ట్రోయాసియన్ భాషలు మరియు టిబెటో - బర్మా భాషలు మాట్లాడుతారు. వైవిధ్యభరితమైన సుసంపన్నమైన మన దేశ వారసత్వ సంపదయే మనకు గర్వకారణం. మన సంస్కృతి వారసత్వంలో ఉన్న చీకటి కోణాలను నిర్జిస్తూ, వెలుగురేఖలను ఏరుకుందాం! అలా చేసిన దేశాలే అభివృద్ధిచెందాయి. టోనీ జోసెఫ్ రచన తప్పకా చదవండి.

**పి.యస్:** 1. ఇరానియన్ రైతులు, 'మెహర్‌ఘడ్‌కు వచ్చారు', 'హరప్పా నాగరికత ప్రాంతానికి వచ్చారు', చివరికి 'దక్షిణ భారత దేశానికి' వచ్చారు వంటి వ్యక్తీకరణలు ఈ రచనలో తిరిగి తిరిగి కనిపిస్తాయి. అయితే ఇరాన్ జాగ్రోస్ పర్వత పంక్తులనుంచి మొదటి కాలంలో మెహర్‌ఘడ్‌కు వచ్చినవారు రైతులు కాదని, వారు మేకల కాపరులని, వారు వచ్చేసరికే మెహర్‌ఘడ్‌లో వ్యవసాయంపై ప్రయోగాలు జరుగుతున్నాయని కూడా రచయిత నిరూపణపూర్వకంగా ఒకదగ్గర రాస్తాడు. ఈ వ్యాస ప్రధాన పాఠంలో ఆ విషయం పేర్కొన్నాను. తరువాత కాలంలో మెహర్‌ఘడ్ మరియు హరప్పా నాగరికతలు పశ్చిమాసియా నాగరికతలతో విస్తృతమైన సంబంధాలు కలిగి ఉండడం గురించి కూడా ఆధారాలు ఉన్నాయి. అయితే ఎవరిదగ్గర ఎవరు వ్యవసాయం నేర్చుకున్నది ఎటువంటి ఋజువులు చూపబడలేదు. మెహర్‌ఘడ్‌లో, అలాగే హరప్పా నాగరికతలో వ్యవసాయం స్వతంత్రంగా అభివృద్ధిచెంది ఉండకపోతే అది పశ్చిమాసియా నుండి వచ్చిందని మాత్రం రచయిత బలమైన వాదనలు చేస్తాడు, ఋజువులు చూపిస్తాడు. అయితే, మెహర్‌ఘడ్‌లో అలాగే హరప్పా నాగరికతలో వ్యవసాయం స్వతంత్రంగా అభివృద్ధిచెందలేదని చూపించడానికి ఆధారాలు లేవుకావున ఇరాన్ నుండి జాగ్రోసియన్ రైతులు ఈ నాగరికతలకు వచ్చారని చెప్పడం సరియైనదిగా నాకు కనిపించలేదు. ఇక ఇరాన్ నుండి క్రీ.పూ 8వేల సంవత్సరాల క్రితం తరువాత మనుషులు మెహర్‌ఘడ్‌కు, హరప్పా నాగరికత ప్రాంతానికి, హరప్పా నాగరికత విచ్ఛిన్నం కావడానికి ముందు, హరప్పా మనుషులతో కలసి ఉత్తర దక్షిణ భారతాలకు వచ్చారన్నదానికి పూర్తి ఋజువులు రచయిత చూపిస్తాడు. ఇరాన్ రైతులు అని కాకుండా ఇరానియన్ మనుషులు అని వ్రాసి ఉంటే సరిపోయేది.

2. పాఠకులు 1970లో మొదటిసారిగా ప్రచురితమైన 'బ్రాహ్మనిజం, బుద్ధిజం, అండ్ హిందూయిజం' అనే లాల్ మణి జోషి రచన కూడ చదవడం మంచిది. ఆ రచన 50 సంత్సరాల క్రితం నాటిది అయినా ఇప్పటికీ ప్రామణికంగానే ఉంది. కొత్త పరిశోధనలు, ప్రధానంగా ఎర్లీ ఇండియన్స్‌లో పేర్కొన్న జెనిటిక్ పరిశోధనలు దానిని పూర్వ పక్షం చేయడం లేదు సరికదా మరింత బలపరుస్తున్నాయి. పాఠకుడు ఆ రచనను చదవడం కూడా చాలా మంచిది. ఈ రెండు రచనలు చదివితే మన జెనిటిక్ మూలాలు, మన సంస్కృతి మూలాలు - రెండూ తెలుస్తాయి.



## వాడి కమలం నిన్ను కరవకముందే

### దొంతం చరణ్

ఊపిరిని రద్దు చేస్తున్నాడు
ఇక్కడ ఎవ్వరూ ఉరితాడును గెలిపించకండి

చెట్టుని రద్దు చేస్తున్నాడు
ఈ భూమిని చెరసాలలోకి నెట్టనివ్వకండి

నక్షత్రాలను విరిచేసి, నేలపై పారబోస్తున్నాడు
గాలికీ నేలకీ మధ్య
స్మశానాన్ని కట్టనివ్వకండి

నెలవంకల మాంసం ముద్దలను

యాగంలో బూడిదగా చేయడం
వాడికి పైశాచిక ఆనందం

ఇసుక పారుతున్న ఎడారి తీగల్లాంటి
ఆకలి పేగులను
లక్ష కిలోల నెయ్యిని కాపాడండి

అర్థచంద్రాకారంలో వున్న చందమామను
ఆవిరిచేసి, ఆ పొగలో
నామాలు కలవాడు నాట్యమాడుతాడు

హిజబ్ కలవారు జాగ్రత్త పడండి
అంటరానివాళ్లంతా ఆలోచనలో పడండి
వాడి నాట్యాన్ని చీల్చండి
జీయర్ల పియ్యిని జెండాలుగా ఎగురవేస్తున్న కాలమిది
కాషాయాన్ని చీల్చివేయండి
కమలాన్ని తెగనరకండి

ఇప్పుడంటే ఇప్పుడే
నోటి కాడి అన్నం మెతుకులపై
నీ శ్వాసలు రాలిపడకముందే

వాడి జంధ్యంతో అల్లిన ఉరితాడును
వాడు చేసే యాగంలోనే తగలబెడుదాం
ఇప్పుడంటే ఇప్పుడే
వాడి కమలం నిన్ను కరవకముందే!

## అల్లాహెూ అక్బర్

### వడ్డెబోయిన శ్రీనివాస్

అందానికి
అలవాటు పడ్డ కళ్ళు కదా!

నా కురులు కనిపిస్తే
మీ కళ్ళల్లోంచి మత్తిల్లిన తుమ్మెదలు దుంకుతాయి
నా కురులు చూపించను
అల్లాహెూ అక్బర్! అల్లాహెూ అక్బర్!!

నా మొఖం చూస్తే
మీ నోట్లోంచి చంద్రుడు సొల్లై కార్తాడు
నా మొఖం కనిపించనీయను

అల్లాహెూ అక్బర్! అల్లాహెూ అక్బర్!!

నా హృదయం మీద
మీ చూపులు గుచ్చి గుచ్చి
నా మనసు నెత్తురోడ్తున్నా
వికృతానందమత్తులో దొర్లుతారు
నా హృదయం చూపించను

అల్లాహెూ అక్బర్! అల్లాహెూ అక్బర్!!

నా వీపు మీద
మీచూపులు కుప్పకూలి మురుగు వాసనేస్తాయి
నా వీపుకు వెల్తురు రాయను

అల్లాహెూ అక్బర్! అల్లాహెూ అక్బర్!!

నా నడుము మీద
మీ కళ్ళు చేసే నెత్తురు చిప్పిల్లని గాయల్లెన్నెన్నో
నా నడుము చూపించను

అల్లాహెూ అక్బర్! అల్లాహెూ అక్బర్!!

ఇంకా
ఇసుక తిన్నెల ఊహాగానాలు రానీయను
అరటిబోదేల ఆలోచనలు మీకివ్వను
లైంగికాంక్షల లాంతరువెలుగునై
మీ చీకటి ఆలోచనల ఆవరణలో సంచరించలేను
అల్లాహెూ అక్బర్! అల్లాహెూ అక్బర్!!

ఉన్మాదవీర్య ప్రవాహ వీరత్వ కాలంలో
మీ బానిస సీతనై
జైశ్రీరామ్ బుల్లిబాయిలారా!
మీ అగ్ని ప్రాజెక్టులో దూకలేను
ఐనా
అందానికి అలవాటు పడిన కళ్ళు కదా!
అంధకారాన్ని జీర్ణించుకోలేవేమో!?

## వాళ్లుంటే

### ఋర్ర తిరుపతి

వాళ్లు ఉంటే బాగుండేది
మరి వాళ్లు లేనిదెప్పుడు
చెట్టుకు పుట్టకు ధిక్కార స్వరం నేర్పిన వాళ్ళు
వాళ్ళకు నిష్క్రమణ ఉంటుందా

నేల ఉన్నంతవరకు
మట్టివాసన ఉన్నంతవరకు
వాళ్లు విస్తరిస్తూనే ఉంటారు

మైదానంలో నిప్పురాజేసి
దండకారణ్యంలో దరువు వేస్తున్నది
వాళ్లేకదా
ప్రాణహిత వెంట పరుగు తీస్తూ
ఇంద్రావతి గోదావరిల వెంట విత్తనాలు
నాటుతున్నది వాళ్లేకదా
లాల్‌గడ్ మొదలు దేశవ్యాప్త లడాయికి కొర్రాయి వాళ్లేకదా..
బాంచెన్ దొర నుండి బతుకు తేగాయింపును నేర్పింది వాళ్లేకదా

మనం కట్టుకున్న ఆవాసాల కింద
పునాదిరాళ్ళు వాళ్లేకదా
మీ తెగాయింపు మాటున ఉన్న
ధిక్కారస్వరాలు వాళ్ళే కదా
రాజ్యానికి ఉలుకెక్కువ అయ్యేకదా
ఎరవాడ జైలు గేటుకు పని కల్పించింది
వీళ్లంతా వాళ్ళేననికదా భయమంతా
తెగింపు స్వరాన్ని ఇస్తున్న వివి అయితేనేమి
చావును ముద్దాడిన భూమయ్య అయితేనేమి
వీళ్లంతా వాళ్ళే అనికదా భయం

అగ్గిరాజేస్తున్న పిల్లలంతా
అడవిలో ఉంటెనేమి జైల్లో ఉంటెనేమి
మనలో ఉంటెనేమి
మైదానంలో ఉంటేనేమి
ఢిల్లీ లొల్లిలో ఉంటెనేమి
గల్లీ గడపల కింద ఉంటెనేమి
అవి నిశ్శబ్ద రాగాల్లా
పేలుతూనే ఉంటున్నాయి కదా

అప్పుడు గల్లీకే పరిమితమయినోల్లు
ఇప్పుడు ఢిల్లీ దాటింద్రు కదా
ఇప్పుడు గాలితో మమేకం అయినోల్లు వాళ్లు..
సూర్యున్ని  పలకరిస్తూనే
చంద్రునిలా పులకరిస్తూ ఉన్నారు
వీళ్లంతా వాళ్ళేకదా

## మౌనానికి సెలవంటూ...

**ఇక్బాల్**

మిత్రమా కామ్రేడ్
మేడం
పాపా బాబూ
పెద్దలందరూ
బావున్నారా..

వేవ్‌లన్నీ ముగిసినట్లేనా..
అక్కడ మీ
అందరి ఆరోగ్యాలు
కుదుటపడ్డాయా..
ఇక్కడ
మేమూ ఓకే..

ఇక
మాట్లాడుకుందామా..

కొండెత్తు కెమెరా
కళ్ళై మురిసే రాజ్యం
రామానుజమౌతున్న వేళ..

దిన దిన యుద్ధంలో
నెత్తుటి నదులను
ఎదురీదుతూ కూడా..

జంగల్ మహల్లకు
జవసత్వాలద్దుతున్న..
తునికి పొదలూ
వెదురు వనాలూ..

దట్టించే త్యాగాలతో
దడ పుట్టించే వేళ..
మితంగానే
అయినా..

సన్నిహితులంగా
మాట్లాడుకుందామా..

మౌనానికి సెలవంటూ..
మాటవ్వుదామా...

మనిషిని మనిషికి దూరంచేసి
స్మశానాలను పరివ్యాప్తం చేస్తానని

కలగంటున్న
జైళ్లను కంటున్న
ఫాసిష్టుల ఎదజీల్చే..

జన విజయాలను
గానం చేసే
పాటవ్వుదామా..



# లైంగిక వైవిధ్యాలను అర్థం చేసుకుందాం: మూడో భాగం

**-బిట్టు కెఆర్**



## ట్రాన్స్‌జెండర్ పిల్లల అనుభవాలు ఎలా ఉంటాయి?

ఇప్పటి దాక మనం ట్రాన్స్‌జెండర్‌కు ఉన్న జీవ సంబంధమైన మూలాల గురించి, అలాగే ట్రాన్స్‌జెండర్‌కు, ఇంటర్‌సెక్స్‌కు మధ్య పోలికలు, తేడాల గురించి మాట్లాడుకున్నాం. ఇప్పుడు మనం ట్రాన్స్‌జెండర్ సామాజిక, వ్యక్తిగత శారీరక అనుభవం బాల్యం నుండి మొదలుపెట్టి ఎలా ఉంటుందో చూద్దాం.

చాలా మందికి వారి క్రోమోజోమ్‌లపరమైన, జన్యుపరమైన, అంగపరమైన, హార్మోన్లపరమైన, బుద్ధిపరమైన సెక్స్‌ల మధ్య బైటికి కనిపించని తేడాలు ఉంటాయి. అయితే ఒక సామాజిక అనుభవంగా ఇంటర్‌సెక్స్ చాలా భిన్నమైనది. ఆడ, మగ శరీరాల పట్ల వైద్యుల అంచనాలను, సామాజిక అంచనాలను వారు అతిక్రమించి ఉండడం వల్ల తమను, తమ శరీరాలను జెండర్ నియమ నిబంధనల చట్రంలోపల ఒదిగేలా మార్చుకొమ్మని సామాజిక ఒత్తిళ్లను ఎదుర్కొంటారు. ఇంటర్‌సెక్స్ పిల్లల తల్లిదండ్రులకు వైద్యులు తరచుగా తాము నిర్దేశించిన ఒక జెండర్‌కు పిల్లలు ఫిక్స్ అయ్యేలా ఒత్తిడి చేయమని సలహా ఇస్తారు. ఇంకా అధ్వాన్నంగా, ఈ పిల్లల శరీరాలకు బాధాకరమైన శస్త్రచికిత్సలను సిఫార్సు చేస్తారు. ఇవి చెరిగిపోని భయానక గుర్తులను మిగిలించి, జీవితాలనే అతలాకుతలం చేసేవి. ఇటీవల ముంబైలో ఒక ఇంటర్‌సెక్స్ చిన్నారికి తన తల్లిదండ్రులు అటువంటి సర్జరీలు చేయిస్తున్నారని వార్తాపత్రికల్లో వచ్చింది. దానిని ఇంటర్‌సెక్స్ వయోజనులు తీవ్రంగా నిరసించారు. వారు చిన్నతనంలో అటువంటి శస్త్రచికిత్సలకు గురికావడానికి ఎంతమాత్రం ఇష్టపడరని స్పష్టంగా ప్రకటించారు. దాని బదులు తాము ఇంటర్‌సెక్స్‌గా జన్మించడం గురించి తమ తల్లిదండ్రులు నిజం చెప్పాలని కోరుకున్నారు. దాని వల్ల తమ శరీరాలను, మనసులను అర్థం చేసుకోవడానికి, వేరే జెండర్ పిల్లలతో సమానంగానో లేదా భిన్నంగానో భావించుకోడానికి మార్గం దొరుకుతుందని అంటున్నారు. ఒక చిన్నారి, తను పెరిగే క్రమంలో ఏ లింగ గుర్తింపును ఇష్టపడుతుందో ముందుగా చెప్పలేము.

అందువల్ల, ఇంటర్‌సెక్స్ పిల్లల తల్లిదండ్రులకు, వైద్యులకు, మా ప్రధాన సందేశం ఏమిటంటే, వారు తమ పిల్లల జెండర్ అస్తిత్వాన్ని అంచనా వేయగలం అనుకొని, ఒక తప్పుడు సమాచారం ఆధారంగా, ఇంటర్‌సెక్స్ వైవిధ్యాలున్న పిల్లలకు జననాంగ శస్త్రచికిత్సలు చేయడానికి తొందరపడకూడదని. మీ ఇంటర్‌సెక్స్ పిల్లలను ఇతర పిల్లల మాదిరిగానే అంగీకరించండి, ప్రేమించండి. వారు ఎదిగే క్రమంలో ఏ లింగ గుర్తింపును కోరుకుంటారో వేచి చూడండి. యుక్తవయస్సులోకి వచ్చే వరకు వారి శరీరాలను మార్చుకోడానికి ఏదైనా వైద్య సహాయం కావాలా వద్దా అనే దాని గురించి వారు స్వంత నిర్ణయాలు తీసుకునేదాకా వేచి ఉండండి.

మగ లేదా ఆడ పిల్లల శరీరం ఎలా ఉంటుందో అటువంటి అంచనాలకు సరిగ్గా సరిపోని శరీరాలు లేదా ప్రత్యేక జననాంగాలతో జన్మించిన చాలా మంది ఇంటర్‌సెక్స్ పిల్లలను తల్లిదండ్రులు వదిలేస్తారు. బెంగళూరులో కేవలం రెండు నెలల క్రితం అలాంటి చిన్నారిని దత్తతకు ఇచ్చేశారు. ఇది అత్యంత విషాదకరం. చాలా మంది ఇంటర్‌సెక్స్ పిల్లలకు తమ మనుగడ కోసం పెనుగులాట, వివక్షకు వ్యతిరేకంగా తమ పోరాటం పుట్టుకతోనే ప్రారంభమవుతుంది.

ఇంటర్‌సెక్స్ పిల్లలకు సాధారణంగా వైద్యులు మగ లేదా ఆడ లింగాన్ని పుట్టుకతోనే కేటాయిస్తారు. నిజానికి ఇంటర్‌సెక్స్ పిల్లలు వారి లింగ వైవిధ్యానికి మూలం ఏదైతే ఉందో, ఎదిగే క్రమంలో ఆ లింగ గుర్తింపును కలిగి ఉండకపోవచ్చని వైద్యశాస్త్రం చెప్తుంది. ఆ ఇంటర్‌సెక్స్ పిల్లలు తమకు కేటాయించిన లింగంతో సౌకర్యంగా పెరిగితే, వారు ట్రాన్స్‌జెండర్ గుర్తింపులో ఉండరు. బదులుగా వారు సిస్‌జెండర్ అవుతారు -వారి జెండర్ వారికి కేటాయించిన జెండర్‌తో సరిపోలుతుంది. ఒకవేళ ఇంటర్‌సెక్స్ పిల్లలు తమకు కేటాయించిన జెండర్‌తో సౌకర్యంగా ఉండకుండా పెరిగితే, వారు ట్రాన్స్‌జెండర్ గుర్తింపుతో ఉంటారు. కాబట్టి ఇంటర్‌సెక్స్, ట్రాన్స్‌జెండర్ అనేవి రెండు వేర్వేరు వర్గాలు. వాటికి వాటి ప్రత్యేక అర్థాలు, సామాజిక ప్రయాణాలు ఉంటాయి. అయితే కొంతమంది వ్యక్తులు ఇంటర్‌సెక్స్; ట్రాన్స్‌జెండర్ -రెండూ కావచ్చు.

ట్రాన్స్‌జెండర్ పిల్లల అనుభవాలు ఎలా ఉంటాయి? కొంతమంది ట్రాన్స్‌జెండర్ పిల్లలు 3 సంవత్సరాల వయస్సులోనే వారికి కేటాయించిన దానికంటే భిన్నమైన లింగంతో గుర్తిస్తారు. మరికొందరు

యుక్తవయస్సు వచ్చిన సమయంలో లేదా ఆ తర్వాత ఈ విధంగా గుర్తిస్తారు. మరికొందరు ట్రాన్స్‌జెండర్ వ్యక్తులు వారి జీవితంలో చాలా కాలం తర్వాత వారికి కేటాయించబడిన లింగానికి భిన్నంగా గుర్తిస్తారు. ఊహించండి, తల్లిదండ్రులు అబ్బాయిగా భావించే ఒక ట్రాన్స్‌జెండర్ చిన్నారి ఏడుస్తూ తల్లిదండ్రులు తన పురుషాంగాన్ని వదిలించగలరా అని అడగడం! లేదా తల్లిదండ్రులు అమ్మాయిగా నిర్ధారించిన ఒక ట్రాన్స్‌జెండర్ పిల్లవాడు, మరుసటి రోజు మగపిల్లవాడిలా నిద్రలేవాలని తల్లిదండ్రులను ఏడుస్తూ అడిగడం!

ఇది తల్లిదండ్రులకు చాలా గందరగోళంగా ఉంటుంది. సాధారణంగా ఇది ఒక దశ అని, "జెండర్ ఐడెంటిటీ డిస్ఫోరియా" అని పిలువబడే పిల్లల అసంతృప్తి తొందరగా తొలగిపోతుందని వారు ఆశిస్తారు. పిల్లలకు తమ భావాలను బహిరంగంగా పంచుకునే వాతావరణం కనిపించకపోతే వారి భావాలను అణచివేయడం నేర్చుకుంటారు. మరికొంతమంది పిల్లలు దీని గురించి మాట్లాడటం మానేస్తారు. బలమైన డిస్ఫోరియా ఉన్న పిల్లలు కొన్నిసార్లు వారు గుర్తించిన జెండర్ పిల్లల వలె కనిపించేలా చాలా బలంగా ప్రవర్తిస్తారు, కొంత మంది తల్లిదండ్రులు కాలక్రమేణా తమ బిడ్డ ఎవరో తెలుసుకుని దానికి అలవాటు పడతారు. కొంతమంది తమ బిడ్డతో చాలా ప్రతికూలంగా, కొన్నిసార్లు హింసాత్మకంగా ప్రతిస్పందిస్తారు.

ఒక ట్రాన్స్‌జెండర్ చిన్నారి యుక్తవయస్సులోకి వెళ్లడాన్ని ఎలా అనుభూతి చెందుతుంది అన్నదాని గురించి ఆలోచించడానికి, మనం ఈ డిస్ఫోరియాను మరింత దగ్గరగా అర్థం చేసుకోవాలి. మరీ ముఖ్యంగా యుక్తవయస్సులో అది ఎలా తీవ్రమవుతుంది అర్థం చేసుకోవాలి. డిస్ఫోరియా, లేదా ఒక వ్యక్తికి కేటాయించబడిన జెండర్ చుట్టూ అసంతృప్తి లేదా తెగదెంపుల భావం అనేక రూపాలను తీసుకుంటుంది. ట్రాన్స్‌జెండర్ ప్రత్యక్ష అనుభవాన్ని ఇదే నడిపిస్తుంది. అయితే సమాజం ఆ అసంతృప్తిని తగ్గించడంలో సహాయపడగలదు. కానీ సాధారణంగా అందుకు బదులుగా సమాజం ఆ అసంతృప్తిని ఘోరంగా పెంచుతుంది. ట్రాన్స్‌జెండర్ వ్యక్తులకు సమస్యలు సృష్టించి జీవితాన్ని అతలాకుతలం చేసే బదులు, ఆ సమూహానికి సమాజం ఎలా ఓదార్పునివ్వగలదో మనం మరింత ఆలోచించాలి.

* * *

ఒకసారి మీ కళ్ళు మూసుకోండి. అదే సమయంలో మీ చేతిని పైకి ఎత్తండి. మీరేం చేస్తున్నారో మీరు చూడలేనప్పటికీ, మీ చేయి పైకెత్తిన భావన, మీ శరీరానికి అనుసంధానంగా మీ చేయి గాలిలో ఎక్కడ ఉందో మీకు అర్థం అవుతూనే ఉంటుంది. ఎందుకంటే మన మెదడు, మన శరీర భాగాల నుండి అంతర్గత స్పర్శ గ్రాహకాలు ఒకదానికొకటి సాపేక్షంగా ఎక్కడ ఉన్నాయో అర్థం చేసుకోగలవు.

అక్సిడెంట్‌లో చేయి కోల్పోయిన వాళ్ళు తరచుగా వాళ్ల చేయి ఇంకా ఉందని అనుభూతి చెందుతూ ఉంటారు. చెయ్యి లేదని వారు చూసుకోగలిగినప్పటికీ ఆ అనుభూతి ఉంటుంది. అవయవంతోపాటు నరాలు తెగిపోయినప్పటికీ, దాన్నుండి మెదడుకు అందే సమాచారం ఆగిపోయినప్పటికీ, చేతి నరాల నుండి అంతకు ముందు మెదడు తీసుకున్న సమాచారం అలాగే ఉంటుంది. శరీరంపై లేని అవయవం గురించి శరీరం అనుభూతిని ఎలా ఆశించవచ్చునేదానికి ఇది ఒక ఉదాహరణ.

ఆడ, మగ శరీరాలు చాలావరకు ఒకేలా ఉంటాయి -కాళ్లూ, చేతులూ మొదలైనవి ఇద్దరికీ సమానంగా ఉంటాయి. జననాగం, ఛాతీ ప్రాంతాలలో కొన్ని శరీర భాగాలు మాత్రం భిన్నంగా ఉంటాయి. ట్రాన్స్‌జెండర్ అనుభవాన్ని గురించి ఆలోచించడానికి ఒక మార్గం ఏమిటంటే, మన మెదడు మనకున్న శరీరానికి భిన్నమైన శరీరం నుండి ఇంద్రియ అనుభూతిని ఆశించొచ్చు. ఆ రకంగా ట్రాన్స్‌జెండర్ మహిళలు తరచుగా తమకు రొమ్ములు ఉన్నాయని భావిస్తారు. శరీరంపై అటువంటి అవయవం ఉన్నట్లు వారి మెదడుకు తెలియనప్పుడు వారి జననాంగాలను చూసి వారు అయోమయానికి గురవుతారు. అలాగే ట్రాన్స్‌జెండర్ పురుషులు తరచుగా భారమైన ఛాతీని అనుభూతి చెందడం వల్ల వారు దిక్కుతోచనట్లు ఫీలవుతారు. ఎందుకంటే మెదడు ఆశించేది అది కాదు. చాలా మంది ట్రాన్స్‌జెండర్ పురుషులు తమకు పురుషాంగాలు ఉన్నట్లు అనుభూతి చెందుతారు. శరీరం ఉన్న స్థితికి, శరీరం గురించి మెదడు ఊహించే స్థితికి మధ్య ఈ అసమతుల్యతను డిస్ఫోరియా అంటారు. జన్యు వైవిధ్యం, తల్లి గర్భంలోని వాతావరణం వల్ల శరీరం, ఆ శరీర అనుభూతికి సంబంధించిన మెదడు సాధారణ పద్ధతికి కొద్దిగా భిన్నమైన మార్గాల్లో అభివృద్ధి చెందితే ఈ అసమతుల్యత రావచ్చు.

దీన్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం. రేపు ఉదయం మీరు నిద్ర లేవగానే మీ భుజం నుండి ఇంకో చేయి మొలిచి ఉండడం ఊహించండి. మీ మెదడు, మనస్సు మాత్రం నిన్నటివే. ఈ అదనపు చేయి సాంకేతికంగా మీ దారికి అడ్డంరాని విధంగా ఉండి ఉండొచ్చు. అయినా మీ శరీరంపై "కూడనిది" ఏదో బాధించే విషయం ఉందని మీకనిపిస్తుంది. మీ దైనందిన జీవితంలో ఈ శరీర భాగం ఎంతవరకు అడ్డుపడుతుందనే దానిపై ఆధారపడి, ఇది మీ మునుపటి శారీరక శ్రమను ఎలా కష్టతరం చేస్తుందనే దానితో శారీరక అసౌకర్యం ఏర్పడవచ్చు. దీనికి తోడు, జనం దీన్ని వింతగా చూసి ఆశ్చర్యంగా ప్రతిస్పందిస్తే, మీరు కలిసే ప్రతి ఒక్కరూ మీ భుజం నుండి అదనపు చేయి ఎందుకు అంటుకొని వస్తున్నదని అడిగితే, మీరు ఏ బస్సులోనో, రైల్లోనో ప్రయాణిస్తుంటే, వందలాది మంది మిమ్మల్ని వింతగా చూస్తూ మీ శరీరం గురించి ఒకరితో ఒకరు మాట్లాడుకుంటుంటే, మిమ్మల్ని ఎగతాళి చేస్తుంటే, ఏమి జరుగుతోందని మిమ్మల్ని అడుగుతుంటే, ట్రాన్స్‌జెండర్ అనుభవం ఎలా ఉంటుందో మీరు చూడగలుగుతారు – ఇది చాలా మంది వైకల్యాలున్న వ్యక్తులు పంచుకున్న అనుభవంలాగా ఉంటుంది.

ఇప్పుడు మరింత నిర్దిష్టంగా చెప్పాలంటే, మీరు నిద్రలేవగానే మీ శరీరం వేరే లింగానికి చెందిన శరీరంలా కనిపించడం ఊహించుకోండి. వ్యక్తులతో రోజువారీ కలయికల్లో ఒకరి జెండర్ ఎంత తరచుగా అంచనా వేయబడుతుంది? మీరు ఎంత తరచుగా నవ్వులను, అనుచితమైన ప్రశ్నలను ఎదుర్కొంటారు? మీ గుర్తింపు మునుపటిలాగే ఉండి, జీవితమంతా మీకు నిర్దేశించిన విధంగానే దుస్తులు ధరిస్తూ, ఆ విధంగానే ప్రవర్తిస్తూ ఉంటారు. మీ శరీరం మాత్రం మారిపోతుంది! ఎలా ఉంటుందో ఊహించుకోండి!

చిట్టచివరి అభ్యాసం: కళ్లు మూసుకొని ఒక వ్యక్తిని ఊహించుకోండి. ఉదాహరణకు ఒక డాక్టర్ మీతో మాట్లాడుతున్నట్లు

(మిగిలాది 24వ పేజీలో...)

# కుమారస్వామి 'పూలపరిమళం'

మా సత్యం



వాల్టర్ పేటర్ సాహిత్యంలో రెండు ఫార్ములను పేర్కొంటాడు. ఒకటి ఇమేజినేటివ్ ఫార్మ్, రెండు అన్ఇమేజినేటివ్ ఫార్మ్. కవి భావనాశక్తితో చేసిన దర్శనాన్ని అందంగా వ్యక్తీకరించే కవితాకృతి లేదా కళాకృతి ఇమేజినేటివ్ ఫార్మ్. వాస్తవ వస్తువును వాస్తవంగా చిత్రించే అనుకరణ కళాకృతి అన్ఇమేజినేటివ్ ఫార్మ్. ఈ రెండింటినీ సమన్వయం చేశారు కుమారస్వామి.

కవిత్వంలో కొత్తదనాన్ని అన్వేషిస్తూ భాషలో, శిల్పంలో, పదప్రయోగంలో, రూపంలో నవ్యతను అభిలషించే లక్షణంతో కదం తొక్కుతూ వస్తున్న యువకవి. కుమారస్వామి వృత్తిరీత్యా అధ్యాపకుడు. అధ్యాపనంలో ఉన్న కవి. కవితా సంపుటి శీర్షిక 'పూలపరిమళాలు' లోతైన తాత్వికతతో నిర్మితమైంది. కవి దృక్పథాన్ని ప్రతీకాత్మకంగా వ్యక్తం చేస్తున్నది. "రాజకీయ స్పష్టత ఉంటే కవిత్వం తన రూపం తాను సంతరించుకుంటుంది". అంటారు చెరబండరాజు. కుమారస్వామి కావ్య వస్తువు చైతన్యవంతమైన ప్రజాఉద్యమాలకు సంబంధించినదే. ఆ చైతన్యానికి స్పందించి వెలువడిందే ఆయన కవిత్వం. తన కవిత్వపు శైలి సామాన్య ప్రజల సంభాషణ స్థాయికి రావాలనే లక్ష్యం కనపడుతుంది. ఆయన కవిత్వం ఉద్రేక ఉత్తేజాలకంటే ఉద్యమకర్తవ్యాల పట్ల ప్రాధాన్యతను అంతర్లీనంగా తెలియజేస్తుంది.

వారిలోని భావావేశం, భావన (ఎమోషన్- ఇమేజినేషన్) కొత్త సృష్టికి తపనపడే తత్వంతో సమకాలీన వస్తువుకి ఊపిరిపోసింది. ఇతరులను అనుసరించకుండా తనదైన శైలిలో ప్రతిపాదించే ప్రయత్నం, తనకంటూ ఒక వినూత్న శైలిని ఏర్పరుచుకోవాలనే తపన కవిలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

లోతైన వాడైన ఆలోచనలతో రాజ్యహింసను ప్రతీకలతో సూచిస్తూ జనం గుండెలను తాకే సంకేతాలు వారి కవితలు. కవితలోని ఇతివృత్త యదార్థత పాఠకుడిని అత్యంత ఉత్సాహంతో చదవడానికి ప్రేరేపించడం అభినందనీయం. కవిత్వంలో ఎక్కడ అయోమయత్వం కనిపించదు. నిష్కర్షగా చెప్పగల ధైర్యం, స్పష్టత, సూటిదనం, నిర్భీతి, నిజాయితీ వ్యక్తమవుతుంది.

'పూలపరిమళం'లో మొత్తం 49 కవితలు. తన జీవితసమరంలో ఏమేరకు క్రియాశీలకంగా ప్రజా ఉద్యమాల్లో మమేకమయ్యారో కవిత్వంలో దర్శించవచ్చు. ప్రకృతి నుంచి స్వీకరించిన ప్రతీకలు కవిత్వానికి సామర్థ్యాన్ని కలిగించాయి. ఆధునిక కవితారీతులు ఎల్లప్పుడూ మారుతూ ఉన్నప్పటికీ కుమార స్వామి విప్లవకవిగా రూపొందిన తర్వాత పీడితుల భాషలో కవిత్వాన్ని పలికించకపోవడం లోపం.

సాహిత్యం జీవితానికి ప్రతీక కాబట్టి వివిధ కోణాలలో జీవితంలోని అర్థాన్ని తను నమ్మిన విశ్వాసాలతో, తనలోని ఇన్నర్ స్పిరిట్‌తో ప్రతీకాత్మకంగా అక్కడక్కడ కనిపిస్తారు.

రెండు కవితలను మాత్రమే సమీక్షిస్తాను. మొత్తం కవితలను సమీక్షించడం సమంజసం కాదు. పాఠకులు కొని చదివి కవి యొక్క ఉద్యమ నేపథ్యాన్ని, నిబద్ధతని తెలుసుకోవాలి.

'పూల పరిమళం'లో కవి యొక్క సబ్‌కాన్షస్ ఆలోచనలు వర్గ చైతన్యముతో కవిత్వంతో క్రియాశీలకమై పీడిత ప్రజల ప్రయోజనాలను ఆకాంక్షిస్తాయి. పాలకుల అన్యాయాన్ని నిరసిస్తూ, చారిత్రక మార్పును సృష్టించడానికి వర్గపోరాటం అవసరమని అంతర్లీనంగా వ్యక్తం చేస్తాయి. ప్రజా పోరాటాల ప్రతిబింబమే ఈ 'పూలపరిమళాలు'

కవితా చరణాలలోని తాత్వికత ప్రతీకాత్మకంగా వ్యక్తమవుతుంది.

తిరగబడ్డ పొద్దు
మీద మొగ్గతొడుగుతున్న ఆశ
రాలినపూలను వీడని
త్యాగపరిమళం
పిడికిట విశ్వాసమై

పోరుగాలి పయనం
కన్నీళ్లను శ్వాసిస్తూ కలల అలల్ని ప్రేమిస్తూ
ఆశయాలదారుల్లో నడవాల్సింది విశ్వాసపు అడుగులే!"

విప్లవ ప్రజాయుద్ధ పంథానుంచి మధ్యలోనే బయటికి వచ్చిన వారిని, బలహీనతలను అధిగమించని వాళ్లని, అత్యంత సున్నితంగా హెచ్చరిస్తాడు. రాజ్యహింసను ప్రతిఘటిస్తూ దృఢ సంకల్పముతో విప్లవ ఐక్య కార్యాచరణ ప్రాముఖ్యతను, ఆవశ్యకతను అంతర్లీనంగా తెలియజేస్తాడు.

కుమారస్వామి విప్లవ కాల్పనిక భాషా ప్రయోగంతో విస్తృతార్థంలో రాజ్య నిర్బంధాన్ని ప్రతిఘటిస్తూ, తన కవిత్వం ద్వారా నిరసన తెలియజేశాడు. నిరర్థక పదప్రయోగం చేయకుండా కల్పనా చమత్కృతితో స్వభావసిద్ధంగా ఏర్పడిన ప్రకృతి ప్రతీకల్ని స్వీకరించాడు.

'నెమలికన్ను' కవితాంశం చేనేత. ఇతివృత్తం, ప్రయోజనం రెండింటిలోనూ ఉద్రిక్తతతో కూడిన కవిత. మగ్గాల ధ్వనుల్ని పసిగట్టి చేనేత వృత్తివారి కష్టసుఖాలన్నీ కళ్ళకు కట్టించాడు. కవితలో చేనేత కార్మికుల అస్తవ్యస్త స్థితిగతులను, సమాజంలోని యదార్థ జీవన స్థితిగతుల వెనకనున్న కారణాలను గతితార్కిక చారిత్రక దృష్టితో ఎంతో నిష్ఠతో ప్రతిఫలింపచేశాడు.

వ్యవసాయం తర్వాత మరో ముఖ్యమైన వృత్తి చేనేత. ప్రాచీన కవులు కూడా చేనేత వృత్తికి సంబంధించిన విశేషాలు వర్ణించారు. ప్రాచీన కవి నారాయణస్వామి 'హంస వింశతి'లో దారాన్ని కండెలుగా చుట్టే విధానాన్ని, ఈ వృత్తికి సంబంధించిన సాధనాలను పేర్కొన్నారు. ఆయన పడుచు వారి మెరిసే చూపులు తప్ప వారి కన్నీటి గాథలను ఎక్కడా వర్ణించలేదు. చెరబండరాజు 'కొండలు పగలేసినం' గేయంలో 'మగ్గాలను నేసినం పోగు పోగు వడికినం/ మా నరాలే దారాలుగా గుడ్డలేన్నో నేసినం/ వడుకు ఎవడిదిరో/ వనుకు ఎవడిదిరో' అంటూ ఆ కష్టాల విముక్తికై పోరాటమే మార్గమని పిలుపునిచ్చారు.

'నెమలికన్ను'లోని కవిత చరణాలు చూడండి..
"చిక్కుబడ్డ బతుకు పోగులను
సుతారంగా సక్కపెడుతది
పాడుకాలం తెంపిన పోగుపేగు
బంధాలను గుండెతడిలో అద్ది
పడుగుపేకలను
సింగారస్తది."
"ఆకలిదూపకు
గంజి అమృతమై
బొందిలో ప్రాణము నిలుపుకొని
రేపటి సరికొత్త చీర పొద్దుకు
అద్దమ రాత్రి ఆమె అందమైన
కలగంటది."

బహుశా కవి ప్రతీకాత్మకంగా సమసమాజాన్ని కలగా చూపిస్తున్నారు. కవితలో చేనేత పనివారి ఇంటిని సహజ సుందరంగా వర్ణించినాడు. గ్రామీణ జీవన విధానాలకూ, గ్రామీణ ప్రకృతి సౌందర్యానికి సంబంధించిన అంశాలు కవితల్లో తటస్థించినప్పుడు, కవికి పరిచితమైన ప్రకృతిని, ఆ ప్రకృతిలోని ప్రతీకలను, తెలంగాణ మాండలిక పదాలను సందర్భోచితంగా వాడారు. చేనేత వృత్తి పదాలను కవితలో ప్రయోగించారు. మాండలికాలు భాషకు సజీవ చిహ్నాలు. నేటికీ మాండలికంలోని చాలాపదాలు నిఘంటువులోకి ఎక్కలేదు.

"సాహిత్యానికి మూలకందం మానవాళిపై ప్రేమ" అన్నారు మావో. 90 శాతంగా ఉన్న పీడిత ప్రజల పట్ల ప్రేమతో కుమారస్వామి విప్లవ కవిగా నడుస్తున్న పోరాటంలో సమాజాన్ని ఒక అడుగు ముందుకు వేయించడానికి తన వంతు పాత్రను నిర్వహిస్తున్నాడు. కొత్త కొత్త పదచిత్రాలతో విప్లవ ప్రతీకలతో విప్లవ కవులు అపారమైన విప్లవ సాహిత్యం సృష్టిస్తున్నారు. వారందరికీ ఉద్యమాభివందనాలు.



---

(22వ పేజీ తరువాయి..)

ఊహించుకోండి. మీరు ఊహించుకున్న డాక్టర్‌గారి జండర్ గుర్తుందా? అడా, మగా లేక రెండూ కాదా? మనం ఒక వ్యక్తిని ఊహించుకున్నప్పుడు, వెంటనే వారి జెండర్ గురించి అనుకునేది, పుట్టుకతో వారిలో కనిపించే లక్షణాలను బట్టి ఆపాదించినదాన్నే. మన భాషల కూర్పు అటువంటిది. వ్యక్తుల్ని ప్రస్తావిస్తున్నప్పుడు వారి నిర్దిష్టమైన జెండర్‌ను సూచించే సర్వనామాలు చాలా భాషల్లో ఉంటాయి (బెంగాలీ తప్ప). కాబట్టి ఒక వ్యక్తిని ఊహించుకుంటున్నప్పుడు లేదా ఒక వ్యక్తితో సంభాషించేటప్పుడు, వారి గురించి ఎలా ఆలోచిస్తాము, వారినెలా వర్ణిస్తాము అనేదానికి వారి వర్గం, కులం, మతం మొదలైన వాటి కన్నా చాలా తరచుగా వారి లింగం ప్రాథమికమవుతుంది. మీరు ఎవరినైనా కలిశారనుకోండి. వారి గురించి చెప్పేటప్పుడు ఏ పదాలు ఉపయోగించాలో ఆలోచిస్తున్నపుడు వారి జెండర్‌ను అంచనా వేయడానికి ప్రయత్నిస్తారు. మన సామాజిక వర్గాలకు అనుగుణంగా పురుషుడు లేదా స్త్రీలా కనిపించకుండా భిన్నంగా ఉండే ఏ వ్యక్తులకైనా ఇది తీవ్రమైన సమస్యగా మారుతుంది. చాలా తరచుగా, కళ్లతోనే స్కానింగ్ చేసే వ్యక్తులు ఎదుటివారి బట్టలు, వెంట్రుకలు మొదలైన వాటి కింద ఏ విధమైన శరీరం ఉందో తెలుసుకోవడానికి మరింత పరీక్షగా చూస్తారు. దీని వల్ల ట్రాన్స్‌జెండర్ వ్యక్తులు తమ శరీరాలతో ఉండే అసౌకర్యాన్ని మరింత తీవ్రంగా అనుభవిస్తారు. ఒక వక్తి తనను తాను గుర్తించుకునే జెండర్‌తో కాక తన శరీరం సూచించే జెండర్‌తో గుర్తించబడతారని అనుకున్నప్పుడు, అది ట్రాన్స్‌జెండర్ వ్యక్తులకు తీవ్రమైన అసౌకర్యాన్ని, నిరాశను ఉత్పత్తి చేయగలదు. ఇది డిస్ఫోరియాలోని సామాజిక అంశం.

సామాజిక డిస్ఫోరియాను బాగా తగ్గించగల అవకాశం సమాజానికే ఉంది. మనం జెండర్‌ను చూసే విధానం మారాలి. అప్పుడు ట్రాన్స్‌జెండర్ వ్యక్తులు, చాలా మంది సిస్‌జెండర్ వ్యక్తులు (పుట్టుకతో గుర్తించబడిన లింగంతోనే ఉండేవాళ్లు) కూడా సమాజిక లింగ అంచనాలకు తగ్గట్టు లేకపోవడం వల్ల సామాజిక అపహాస్యం లేదా పరీక్షలు ఎదుర్కోకుండా ఈ ప్రపంచంలో మరింత స్వేచ్ఛగా పయనిస్తారు.



# 2022-23 బడ్జెట్ మాటల గారడీ

అరుణ్

సాధారణంగా ఎన్నికలముందు ప్రభుత్వాలు ప్రవేశపెట్టే బడ్జెట్ ప్రజారంజకంగా ఉంటుందని ఆశించిన వారికి కేంద్రబడ్జెట్ 2022-23 నిరాశే మిగిలించింది. ఎప్పుడూ 'అంకెల గారడీ' గా వుండే బడ్జెట్ ఈసారి 'మాటల గారడీ'గా మారడం చూస్తె కమలనాథులకు వారిపై వారికిగల స్వీయ విశ్వాసాన్ని తెలియజేస్తుంది. ఎన్నికలు గెలవడానికి విధానాల ప్రజారంజకత్వం తమకవసరం లేదని, కేవలం ప్రజల్ని మత, కులాలపరంగా చీల్చడం ద్వారా 5 రాష్ట్రాలలో రాబోయే ఎన్నికలలో తాము విజయం సాధించగలమనే ధీమా కేంద్రబడ్జెట్ 2022-23 ద్వారా వ్యక్తమయ్యింది.

ప్రజల ఓట్లు పొందేందుకు ఏయే రంగాలకు ఎక్కువ ప్రాతినిధ్యం ఇవ్వాలి, తమకందే లబ్ధి ఏ రంగాల ద్వారా ప్రజలకు స్పష్టంగా తెలుస్తుందనే విషయం పాలకులు గమనంలోకి తీసుకున్నారనే విషయము ప్రభుత్వం బడ్జెట్‌లో వివిధరంగాలకు కేటాయించిన నిధుల నిశితంగా పరిశీలించిన వారికి స్పష్టమవుతుంది. గతంలోలాగానే, జలశక్తి మంత్రిత్వశాఖకు ఈ బడ్జెట్‌లోనూ నిధుల కేటాయింపులో భారీ పెరుగుదల కన్పించడం గమనార్హం. ఒకవైపు విద్యా, ఆరోగ్యరంగాలను నిర్లక్ష్యంజేస్తూ, ప్రతి ఇంటికి శుభ్రమైన తాగునీరందించే పథకానికి ప్రాముఖ్యత ఇవ్వడంలోనే కమలనాథుల చాతుర్యం ఉందంటుంది 'ది వైర్'. జలశక్తి మంత్రిత్వశాఖకు కేటాయించిన రూ.86,189 కోట్లలో, తాగునీరు మరియు పరిసరాల పరిశుభ్రతకు రూ.67,221కోట్లు కేటాయించడం జరిగింది. తద్వారా మోది ప్రభుత్వం ప్రజలకు ఆరోగ్యం, విద్యా లాంటి 'పరోక్ష అవసరాల'కన్నా, తాగునీరు లాంటి 'ప్రత్యక్షంగా కన్పడే అవసరాలకు' ప్రాధాన్యమిచ్చిందని చెప్పవచ్చు. అదేవిధంగా 80 లక్షల గృహనిర్మాణాలకై రూ 48 వేల కోట్లను కేటాయించారు. ఆ ప్రాధాన్యతలను ఎవరమూ కాదనలేముగానీ, అదే సమయంలో విద్యా, వైద్య రంగాలను నిర్లక్ష్యం చేయడంలోగల ఆంతర్యాన్ని గ్రహించవలసి వుంటుంది.

ఇక మిగతా అభివృద్ధి కార్యక్రమాలంటారా 'అమృత్ కాల్' (మరో 25సం.) కోసం వేచి చూడాల్సిందే.

**వ్యవసాయ రంగం-రైతాంగం:**

మొదటగా, నేడు దేశంలోని వ్యవసాయరంగ పరిస్థితిని చూద్దాం. దేశంలోని వ్యవసాయదారులలో 60% కేవలం వర్షాధారిత వ్యవసాయమే చేస్తున్నారు. మొత్తం సాగులో 55% వర్షాధారమే. ఆహార ఉత్పత్తిలో దాని వాటా 40%. అంతేగాక, దేశంలోని 40% పంటపొలాలు మెట్టపొలాలే. అందులో వ్యవసాయదారులలో 85% మంది చిన్న, సన్నకారు రైతులే. అందువల్ల వారు ఎదుర్కొనే సమస్యల పరిష్కారానికి ప్రథమ ప్రాధాన్యత ఇవ్వాల్సివుంది. పోతే, సూక్ష్మ సాగునీటి పథకాలకు 2020-21 మరియు 2021-22 సంవత్సరాలలో PMKSY-PDMC పథకం ద్వారా 36 లక్షల హెక్టార్లకు నీరందించాల్సి వుండగా, కేవలం 11.44 లక్షల హెక్టార్లకే నీరందించడం జరిగింది. 2022 కంతా రైతుల నెలసరి ఆదాయం రెండింతలు చేస్తాననే హామీ ఊసు బడ్జెట్‌లో ఎక్కడా లేదు. 2015-16 నాడు రూ.8,059 వున్న ఆదాయం, ద్రవ్యోల్బణాన్ని పరిగణలోకి తీసుకుంటే, నేడు అది రూ.21,146/-గా వుండాలి. కానీ, జాతీయ నమూనా సర్వే ప్రకారం నేడది కేవలం రూ.12,955/- గా వుంది. హామీలకూ, అమలుకూ హస్తిమశకాంతర తేడా వుండటంలో ఆశ్చర్యమేముంది

వ్యవసాయం మరియు రైతు సంక్షేమ శాఖకు కేటాయించిన నిధులు మొత్తం బడ్జెట్‌లో కేవలం 3.36% మాత్రమే. గత బడ్జెట్‌లో అది 3.78% వుందని, పెరిగిన ద్రవ్యోల్బణాన్ని, అవసరాలను పరిగణలోనికి తీసుకుంటే, కేటాయించిన నిధులు వ్యవసాయరంగానికి ఏమాత్రం చాలవని స్పష్టమవుతుంది. అంతేకాదు, వ్యవసాయం మరియు అనుబంధ శాఖల (మత్స్య, పశు, పాల లాంటి) కేటాయింపులను కూడ పరిగణలోనికి తీసుకుంటే, వ్యవసాయం మరియు రైతు సంక్షేమ శాఖకు కేటాయించిన నిధులు మొత్తం బడ్జెట్‌లో 3.87% మాత్రమే.

విత్తమంత్రి గారు వారి గోధుమల సేకరణ వల్ల లబ్ధిపొందిన రైతుల సంఖ్య పెరిగిందని చెబితే, వాస్తవంగా భారతదేశ ఆహారసంస్థ గణాంకాల ప్రకారం ఆ సంఖ్య తగ్గింది. ప్రభుత్వం కనీసమద్దతు ధరతో 2020-21 కొనుగోలుజేసిన గోధుమ విలువ రూ.2.48 లక్ష కోట్లు కాగా, గత 2021-22 సంవత్సరం ఆ విలువ రూ.2.37 లక్ష కోట్లు మాత్రమే.

అదేవిధంగా, కనీసమద్దతు ధరతో కొనుగోలుజేసే విధానానికి సహాయకారిగా వుండే ఆశా పథకాలకు బడ్జెట్ కేటాయింపులు ఊహించనంతగా (2021-22 సంవత్సరం రూ 400కోట్లు నుండి రూ.1 కోటి) తగ్గించారు. అదేవిధంగా మార్కెట్‌లో జోక్యం చేసుకొనే పథకం (Market Intervention Scheme) మరియు ధర మద్దతు పథకం (Price Support Scheme)లకు కేటాయింపులు రూ.3596 కోట్ల (2021-22 RE) నుండి ఈ బడ్జెట్‌లో రూ.1500 కోట్లకు తగ్గించారంటే

| పథకం | 2018-19(A) | 2019-20(A) | 2020-21(A) | 2021-22(BE) | 2021-22(RE) | 2020-23(BE) |
|---|---|---|---|---|---|---|
| 1. భూసారం, నేల ఆరోగ్య జాతీయ ప్రాజెక్ట్ | 313.6 | 159.2 | 200.2 | 315 | 100 | ---- |
| 2. PM కృషి సించాయి యోజన | 2918.4 | 2700 | 2562.2 | 4000 | 2000 | ---- |
| 3. వ్యవసాయ యాంత్రీకరణ సబ్‌మిషన్ | 1100.8 | 964.8 | 999.7 | 1050 | 850 | ---- |
| 4. పంట అవశేషాల నిర్వహణ | 584.3 | 594.2 | 570.7 | 700 | 700 | ---- |
| 5. వర్షాధారిత ప్రాంత అభివృద్ధి మరియు వాతావరణ మార్పు | 216.2 | 186.7 | 128.5 | 180 | 110 | ---- |
| 6. PKV యోజన | 328.7 | 283.7 | 381.1 | 450 | 100 | ---- |
| 7. రాష్ట్రీయ కృషి వికాస్ యోజన | 3370.4 | 3085.4 | 2561.3 | 3712.4 | 2000 | ---- |
| 8. పునరుద్ధరించబడ్డ రాష్ట్రీయ కృషి వికాస్ యోజన | 8832.4 | 7974.3 | 7403.6 | 10407.4 | 5860 | 10433 |

పునరుద్ధరించబడిన రాష్ట్రీయ కృషి వికాస్ యోజన (కోట్ల రూపాయలు)

ఈ ప్రభుత్వ ఉద్దేశం అర్థంజేసుకోవచ్చు. రైతులను బహిరంగ మార్కెట్లకు ప్రోత్సహించే వుద్దేశం ఉందనిపిస్తోంది.

మే 2020లో ఆత్మనిర్భర్ భారత్ పథకంలో భాగంగా, కేంద్రప్రభుత్వం ఒక లక్ష కోట్ల రూపాయలతో 4 సంవత్సరాలలో వ్యవసాయ మౌలిక సదుపాయ కల్పన చేస్తానని ప్రకటించింది. తర్వాత, దాన్ని 6 సంవత్సరాలు పొడిగించిందనుకోండి. అయితే ఇప్పటికీ మంజూరైన ప్రాజెక్టుల ఖర్చు కేవలం రూ.6627 కోట్లు కాగా, వాస్తవంగా ఖర్చుపెట్టినది రూ.2654 కోట్లు మాత్రమే. అంటే, ప్రకటించుకున్న లక్ష్యంలో 2.6% మాత్రమే.

వ్యవసాయ ఉత్పత్తిదారుల సంస్థ పథకంకై 2021-22 బడ్జెట్లో రూ.700కోట్లు కేటాయించినా, సవరించిన బడ్జెట్ (RE) ప్రకారం ఖర్చు చేసింది కేవలం రూ.250కోట్లు మాత్రమె. ఇక, అందరూ కోరుతున్న ప్రకృతి మరియు సేంద్రీయ వ్యవసాయం తామెంతో చేస్తామని గొప్పలు చెప్పుకున్న కేంద్రం దానికి సంబందించిన పథకాలకై కేటాయించిన నిధులను చూస్తె కేంద్రప్రభుత్వ మాటలు కోటలు దాటాయి గానీ, చేతలు గడప దాటలేదనేది విదితమవుతుంది. పరంపరాగత్ కృషి వికాష్ యోజన (PKVY) 2021-22 బడ్జెట్‌లో కేవలం రూ. 450కోట్లు కాగా సవరించిన అంచనా ప్రకారం ఆ మొత్తం రూ. 100కోట్లకు దిగజారింది. ఇక మరో పథకం రాష్ట్రీయ కృషి వికాష్ యోజన(RKVY) 2021-22 బడ్జెట్ అంచనా రూ.3,712 కోట్లు కాగా సవరించిన అంచనా రూ.2000కోట్లు. అంటే కేటాయించినదే తక్కువ, అందులో ఖర్చుబెట్టింది మరీ తక్కువ. అంతేగాక, అక్టోబర్ 31, 2021 నాటికి తెలంగాణా, ఆంధ్రప్రదేశ్, ఝార్ఖండ్, కర్నాటక, గుజరాత్ రాష్ట్రాలు వాటి వాటాలో ఒక్క రూపాయ కూడా పొందలేదు. ఇవండీ కమనాథుల మాటల కోటలు.

**మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి పథకం:**

ఇక, ప్రభుత్వ సంక్షేమ పథకాలలో గుండెకాయ లాంటి మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి పథకపు కేటాయింపుల చూద్దాం. గ్రామీణపేదలకు, సన్నకారు రైతులకు ఉపాదికల్పించే ఈ పథకం ఎన్నో ప్రజా ఉద్యమాల ఫలితమని మరవరాదు. 2021-22 లో దానిపై ఖర్చు రూ.111,169కోట్లు కాగా సవరించిన అంచనా రూ.98,000కోట్లు. నేడు 2022-23 కేటాయింపులు రూ.73,000 కోట్లు మాత్రమే. ఇది గత సంవత్సరం కేటాయింపులో 34% తక్కువ. అంతేగాక, గత సంవత్సరం బకాయీలు దాదాపు 20 వేల కోట్లు ఉండనే ఉన్నాయి. 2020-21 బడ్జెట్‌లో 11కోట్ల మందికి ఉపా. కల్పించేందుకై ఈ పథకానికి రూ.1.11 లక్షల కోట్లు కేటాయించారు. 21-22లో దాన్ని 34% తగ్గిస్తూ కేటాయింపులు జరిగాయి. అయితే ఆ నిధులు చాలవని ప్రభుత్వం మరల నిధుల కేటాయింపు చేయక తప్పలేదు. ప్రభుత్వం గత అనుభవం ద్వారా కూడా నేర్చుకోలేదనడానికి తార్కాణమిది. ఉపాధి పథక సంఘర్ష్ మోర్చా అంచనాలో అర్హులందరికీ ఉపాధి కల్పిస్తే, ఈ బడ్జెట్ నిధులు కేవలం 16 రోజుల ఉపాధికి మాత్రమె సరిపోతాయి. విత్తమంత్రి అలా కేటాయించడానికి కారణం పనికి డిమాండ్ లేకపోవడమేనని చెప్పారు. అయితే పత్రికల ద్వారా అందుతున్న సమాచారం బిన్నంగా వుంది. ఇందులో గత సంవత్సరం బకాయీలు పోగా, ఈ సంవత్సర కాలానికి పేదల ఉపాధికి కేంద్రం కేటాయించినదెంత? గ్రామీణ ఉపాధి పథక సంఘర్ష్ మోర్చా అంచనా ప్రకారం దేశంలోని ప్రతి ఉపాధి పథక అర్హునికి (9.94కోట్ల ప్రజలకు) రోజు కూలి రూ.334 ప్రకారం 100 రోజులు పని కల్పించాలంటే రూ.3.34 లక్షల కోట్లు అవసరమవుతుంది. ఇక ప్రధాన మంత్రి గరీబ్ కళ్యాణ్ యోజన పథకాన్ని చూద్దాం. పేద ప్రజలందరికీ నెలకు 5 కిలోల ఆహారధాన్యాలు ఉచితంగా సరఫరాజేయడమే దాని లక్ష్యం. ఈ పథకం మార్చి 31కి ముగుస్తుంది. ఈ తేది దగ్గరలోవున్న 5 రాష్ట్రాల ఎన్నికలు ముగియక ముందే వుండటం గమనార్హం. అంతేకాదు ఈ బడ్జెట్‌లో ఆహార సబ్సిడీ కేటాయింపు రూ.2.1 లక్షల కోట్లు కాగా, ఈ మొత్తం గత సంవత్సరం సవరించిన అంచనా రూ.2.9 లక్షల కోట్ల కన్నా తగ్గడమూ చూడవచ్చు. ఎన్నికల ముందు ఏ రాజకీయ పార్టీ ఇలాంటి నిర్ణయం తీసుకోదు. కానీ, కొందరి విశ్లేషకుల అభిప్రాయంలో పై ముగింపు తేది పొడిగించి ప్రజల్ని ఆకట్టుకొనే ప్రయత్నం జేయవచ్చు. పోతే, ముందుగా తెలిపినట్టుగా కమలనాథుల ఎన్నికల అంబులపొదిలో రామబాణం మత విద్వేషాలు రెచ్చగొట్టడం, విష్ణుచక్రం పాకిస్తాన్ చైనాలతో మినీ యుద్ధం జరపడంలాంటివి వున్నాయిగా.

**ఆరోగ్య, విద్యారంగాలు:**

ఈసారి, విద్యాశాఖకు, ఆరోగ్య కుటుంబ సంక్షేమ మంత్రిత్వశాఖకు నిజధరలలో గత సంవత్సరం సవరించిన అంచనా కన్నా తక్కువగా వుంది. ఇక విద్యారంగంలో పాఠశాలల్లో మౌలిక

సదూపాయల కల్పనా, తగినంతమంది ఉపాధ్యాయుల నియామకాలను విస్మరించి విద్యార్థులను టెలివిజన్‌లపై ఆధారపడమనడం ఆయా కార్పోరేట్ల లబ్ధి కొరకు గాక మరెవరి కోసం? అందుకే కాబోలు ఆ రంగాలకు కేటాయింపులు తగ్గించారు. ఒకవైపు కోవిడ్ నుండి దేశప్రజలు ఇంకా కోలుకొనే లేదు. కోవిడ్ లాక్‌డౌన్ వల్ల ప్రజల ఉపాధి, ఉద్యోగాలు కోల్పోయి కొనుగోలు శక్తి పూర్తిగా క్షీణించిన కాలంలో, 2021-22 సవరించిన అంచనా రూ.82,921 కోట్ల కన్నా నేటి బడ్జెట్‌లో రూ.83000 కోట్లు కేటాయించారు.

అంగన్వాడి సేవలు మరియు పోషణ్ అభియాన్ పథకాలతో కూడిన సాక్ష్యం అంగన్వాడి కేటాయింపులు 2021-22 బడ్జెట్ అంచనాలు రూ.20,105 కోట్లు ఉండగా, ఈ సంవత్సర బడ్జెట్ కేటాయింపు రూ.20,263 కోట్లు మాత్రమే. అంతేకాదు, ఏప్రిల్-డిసెంబర్ 2021 మధ్యకాలంలో మధ్యాహ్న భోజనానికి కేటాయించిన నిధులలో కేవలం 48% నిధులు మాత్రమే విడుదల జేశారు. ఇక, సమీకృత బాలల అభివృద్ధి (ICDS) పథకానికి కేటాయించిన నిధులలో విడుదలజేసింది 52% మాత్రమే. దీన్ని మనం జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే (NFHS) 2015-2020 మధ్య కాలంలో పిల్లల ఎదుగుదల చాలా నిరాశాజనకంగా వుందని, రక్తహీనత ఎక్కువుగా ఉందనే నివేదిక నేపథ్యంలో చూస్తే, బాలల ఆరోగ్యం, పోషణ పట్ల కేంద్రప్రభుత్వానికున్న భాధ్యతరాహిత్యాన్ని తెలియజేస్తుంది. అంతేగాక, ఈ రంగాలలో మంజూరయిన పోస్టులలో చాలా ఖాళీలున్నాయి. గ్రామీణ ఆరోగ్య గణాంకాల (2019-20) ప్రకారం గ్రామీణ ప్రాంతాలలోని కమ్యూనిటి ఆరోగ్య కేంద్రాలలో మంజూరయిన పోస్టులలో 63.3%, పట్టణ ప్రాంతాలలో 38.2% ఖాళీలున్నాయి. అందువల్ల 2022-23 బడ్జెట్‌లో ఆరోగ్య మరియు మెడికల్ విద్యకు బడ్జెట్ రూ.7,500 కోట్లు కేటాయించినా ఇప్పటి కొరతకు, కొత్త అవసరాలకు తగినంతగా లేవనేది స్పష్టం. దాదాపు 14 లక్షల అంగన్వాడి, 10 లక్షల ఆశావర్కర్ల సేవలను క్రమబద్ధీకరించి, వారికి తగిన వేతనాలివ్వాలనే డిమాండ్ చాలా కాలం నుండి వున్నా పట్టించుకున్నవారేవ్వరూ లేక వారు వెట్టిచాకిరీ చేస్తున్నారు. ఇదేవిధంగా 25 లక్షల మధ్యాహ్నభోజన పథక వంటవారు, వారి సహాయకులు నెలకు కేవలం వెయ్యి రూపాయల జీతంతో ఎళ్ళ కెడుస్తున్నారు. బడ్జెట్‌లో వారి ఊసేలేదు.

ఆరోగ్యరంగంలో మొదటి ప్రాధాన్యతనివ్వాల్సింది ప్రాథమిక ఆరోగ్యసేవలకని, మొత్తం ఆరోగ్యరంగ కేటాయింపులలో ప్రాథమిక ఆరోగ్యసేవలకు 67% కేటాయించాలని 15వ ఆర్థిక కమీషన్ సిఫారసు చేసింది. అందుకు భిన్నంగా ఆ రంగ వాటా 2021-22 బడ్జెట్‌లో 48% వుండగా 2022-23 బడ్జెట్‌లో 42% కేటాయించింది.

**విద్యారంగం-బడుగు, బలహీన వర్గాలు:**

మొత్తం విద్యారంగానికి 2021-22 బడ్జెట్ (రూ.93,224 కోట్లు) కన్నా, రూ.11,054 కోట్ల పెంపుతో ఈ బడ్జెట్‌లో రూ.1,04,278 కోట్లు కేటాయింపు జరిగింది. అయితే ఈ కేటాయింపులు మొత్తం డిజిటల్ విద్యకై వుండటంతో సామాన్య విద్యార్థులకు ఎంతవరకు ఉపయోగపడుతుంది నేడు ప్రశ్నార్థకమే.

పాఠశాల విద్యకు గత సంవత్సరం సవరించిన అంచనాతో పోలిస్తే ఈ బడ్జెట్‌లో 22% పెంపుతో రూ.63,449 కోట్లు కేటాయించారు. అయితే, ద్రవ్యోల్బణంను పరిగణిస్తే చాలా తక్కువ. కేంద్ర విద్యాసంస్థలలో 14 వేల పోస్టులు ఖాళీగా వున్నాయి. ఇక్కడ మరీ ముఖ్యంగా పరిగణించాల్సింది షెడ్యూల్డ్ తరగతుల, కులాల బాలిక విద్య ప్రోత్సాహక పథకానికి ఈ ప్రభుత్వం ఇచ్చిన ప్రాధాన్యత. పాటశాలల్లో షెడ్యూల్డ్ తరగతుల, కులాల బాలిక బడి మానడాన్ని నిరోధించడానికై యూపీఏ ప్రభుత్వం షెడ్యూల్డ్ తరగతుల, కులాల బాలిక విద్యప్రోత్సాహక పథకాన్ని ప్రవేశపెట్టింది. కానీ నరేంద్రమోడి ప్రభుత్వం దాన్ని నీరుగార్చే ప్రయత్నం చేస్తున్నది. గత బడ్జెట్‌తో పోలిస్తే, షెడ్యూల్డ్ తరగతుల, కులాల మరియు ఇతర వెనుకబడిన కులాల విద్యార్థుల ఉపకారవేతనాల (scholarship) కేటాయింపులు ఈ బడ్జెట్‌లో 30% తగ్గడం దుర్మార్గం. ఒకవైపు ద్రవ్యోల్బాణాన్ని, మరొకవైపు చదవగోరే పిల్లల సంఖ్య పెరుగుదలను ఏమాత్రం పరిగణించక బడ్జెట్‌ను తగ్గించడం NDA ప్రభుత్వానికి బడుగు, బలహీన వర్గాల పిల్లలపట్ల గల వ్యతిరేకత తెలియజేస్తుంది. షెడ్యూల్డ్ తరగతుల, కులాల మరియు ఇతర వెనుకబడిన కులాల బాలికల విద్యయు ప్రోత్సహించే పథకం మే 2008లో ప్రారంభించారు. అది 2006-07లో కేంద్రప్రభుత్వ పథకం కస్తూర్బా బాలిక విద్యాలయ పథకపు కొనసాగింపే. ఆ పథకం కింద షెడ్యూల్డ్ తరగతుల, కులాల మరియు ఇతర వెనుకబడిన కులాల బాలికలకై మొత్తం 1000 నివాస పాటశాలలు నెలకొల్పారు. 8వ తరగతి పూర్తిజేసిన ప్రతి బాలికను పైచదువులకు ప్రోత్సహించాలనే లక్ష్యంతో ప్రతి బాలిక పేరిట రూ.3000/- డిపాజిట్ జేసి, దాన్ని ఆమె 18 ఏండ్ల వయసు రాగానే తీసుకొనే వసతి ఆనాటి ప్రభుత్వం కల్పించింది. ఆ పథకాన్ని రద్దుచేయడానికి ప్రభుత్వం గత మూడేళ్ళుగా ప్రయత్నిస్తూనే వుంది. కాని, అనేక వైపులనుండి వచ్చిన ఒత్తిడులు, రాజకీయ అవసరాల దృష్ట్యా ఆ పని చేయలేకపోయింది. అయితే, తానునుకున్న పని పరోక్షంగా మొదలెట్టింది. గత 4 సంవత్సరాలలో ఆ పథకానికి కేటాయింపులు రూ.320 కోట్ల నుండి రూ.1కోటికి తగ్గింది. అదేవిధంగా, సామాజిక న్యాయం మరియు సాధికారిత శాఖకు గత సంవత్సరం రూ.725కోట్లు కేటాయించగా, ఈ బడ్జెట్ కేటాయింపు రూ.500 కోట్లు మాత్రమే. ఈ మొత్తం రెండు పథకాలకై 1)షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు 2) 'అశుభ్ర మరియు ప్రమాదకర వృత్తుల' పనివారల పిల్లలకు కేటాయించబడ్డాయి. మరీ ముఖ్యంగా, ప్రాథమిక మరియు సెకండరీ స్థాయిలో విద్యార్థులు డ్రాప్ఔట్స్ లేకుండా చూసే లక్ష్యంతో ఆ పథకానికి ఆ కేటాయింపులు చేయాలి. కానీ, ఆ పథకానికి జరిగిన కేటాయింపుల జూస్తే, మోడీ సాబ్ 'బేటీ బచావో, బేటీ పడావో' నినాదం అర్థమేమిటో?

**ముస్లింల విద్య:**

ముస్లిం మహిళలపై అపారమైన ప్రేమని పదేపదే ప్రకటిస్తున్న మోడీ ఈ బడ్జెట్‌లో ముస్లిమ్ విద్యాభివృద్ధికి తీసుకున్న చర్యలేమిటో చూద్దాం. మదరసాల మరియు మైనారిటీల విద్యా పథకం (ESMMS)కు గత సంవత్సరం రూ.174 కోట్లు కేటాయించగా, ఈ బడ్జెట్‌లో కేటాయించింది రూ.160 కోట్లు మాత్రమే. ఈ పథకం ద్వారా మదరసాలలో ఆధునిక పాఠ్యాంశాల బోధన, ఉపాధ్యాయ శిక్షణ, మౌలిక సదుపాయాలు కలిగించాలి. మరో పథకం నయా మంజిల్ (మైనారిటీలకు చెందిన యువతకు సాధారణ విద్య 8, 9 తరగతులలతో పాటు వృత్తినైపుణ్యాలను అందించడం) పథకానికి 2021-22లో రూ.87 కోట్లు కేటాయించగా ఈ బడ్జెట్‌లో కేటాయించింది రూ.46 కోట్లు. మౌలానా ఆజాద్ ఎడ్యుకేషన్ ఫౌండేషన్‌కు కేటాయింపు 99% తగ్గిస్తూ రూ.90 కోట్ల నుండి రూ.0.01కోట్లు చేశారు.

**సామాజిక సంక్షేమ రంగాలు:**

మొత్తమ్మీద సామాజిక సేవారంగాల (విద్యా, ఆరోగ్య రంగాల, కోవిడ్ -19)పై కేంద్రఖర్చు స్థూల జాతీయోత్పత్తిలో 9%కన్నా తక్కువే. ఇక ప్రభుత్వ మొత్తం వ్యయంలో పై రంగాలకు ఖర్చు చేసింది దాదాపు

26.6% మాత్రమే (విద్యారంగానికి 9.7% కాగా ఆరోగ్యానికి 6.6%).

బాలలకు సంబందించిన శాఖల కేటాయింపులు కూడా క్రమంగా 2020-21 నుండి తగ్గడం గమనార్హం. మహిళా మరియు బాలల అభివృద్ధి శాఖకు కేటాయింపులు రూ.30,007 కోట్ల నుండి రూ.24,435 కోట్లకు, విద్య,అక్షరాస్యత శాఖకు రూ.599,370 కోట్ల నుండి రూ.53,600 కోట్లు తగ్గింది. అంతేగాక, పిల్లల సంరక్షణ కేటాయింపులు 40% తగ్గింపుతో రూ.1,500 కోట్ల నుండి రూ.900కోట్లకు తగ్గాయి. అవి చాలవన్నట్లు ఇప్పుడిస్తున్న సబ్సిడీలను కూడా తగ్గించింది ప్రభుత్వం.

| సబ్సిడీ | 2021-22 (కోట్ల రూ.) | 2022-23 (కోట్ల రూ.) |
|---|---|---|
| పెట్రోలియం | 6,517 | 5,183 |
| ఎరువులు | 1,40,000 | 1,05,000 |
| ఆహారం | 2,86,219 | 2,06,481 |
| మధ్యాహ్నభోజనపథకం | 11,500 | 10,233 |
| పంటల భీమ | 15,989 | 15,500 |
| జాతీయ ఉపాధిహామీపథకం | 98,000 | 73,300 |
| ఆరోగ్యం | 85,915 | 86,606 |

మొత్తం సబ్సిడీ కేటాయింపులు గత సంవత్సరంతో పోలిస్తే 27% తగ్గాయి. ఒకవైపు పేదలకు, రైతాంగానికి కొంతమేరకైనా ఊరటనిచ్చే రంగాలకు సబ్సిడీలు తగ్గించడమే గాక, పెట్రోలియంపై సబ్సిడీ తగ్గించడం ద్వారా రవాణా రెట్లు పెరగడం, దాంతో అన్ని నిత్యావసరాల ధరలు పెరిగి పేద, మధ్యతరగతి ప్రజల నడ్డి విరుస్తుందీ బడ్జెట్.

**మూలధన వ్యయం:**

ప్రభుత్వం నేడు గర్వంగా చెప్పుకొనే మూలధన వ్యయం గురించి విశ్లేషిద్దాం. 2022-23 బడ్జెట్ అంచనా ప్రకారం మూలధన వ్యయం రూ.7,50,246 కోట్లు. అయితే ఇందులో తానే అనుమతిస్తూ రాష్ట్ర ప్రభుత్వాలు మూలధనవ్యయానికి చేసే అదనపు రుణాల రూ.1లక్ష కోట్లనూ కేంద్రం·తన మూలధన వ్యయపు ఖాతాలో జేర్చడం గమనార్హం. దాన్ని మినహాయిస్తే, ఈ బడ్జెట్ కేటాయింపులు గత సంవత్సరం సవరించిన అంచనాకంటే కేవలం రూ.1లక్ష కోట్లు మాత్రమే అధికం. అందులో దాదాపు 20% రూ.1.52 లక్షలకోట్లు రక్షణ శాఖకు కేటాయించారు. ఈ రంగంలో ఉద్యోగావకాశాలు తక్కువని చెప్పాల్సినవసరం లేదు. అంతేగాక, రైల్వేలకు రూ.137 లక్షలకోట్లు (దాదాపు 18%) కేటాయించగా, రోడ్డు రవాణ మరియు హైవేస్‌కు రూ.1.88 లక్షలకోట్లు (దాదాపు 25%) కేటాయించారు. సాధారణంగా మూలధన వ్యయం అనేది దేశాభివృద్ధికి దోహదం చేస్తుంది. ప్రజలకు ఉద్యోగకల్పనకు దారితీస్తుంది. అయితే, ఈ మదుపులో ప్రైవేట్ పెట్టుబడులను ప్రభుత్వం ఎక్కువగా ఆశిస్తుంది. ఇప్పటి పరిస్థులలో ప్రైవేట్ పెట్టుబడులు ఎక్కువగా ఆశించలేమని ఆర్థికవేత్తల అభిప్రాయం. అంతేగాక, జాతీయ నగదీకరణ పథకం కింద రోడ్ల నిర్మాణాన్ని ప్రైవేట్ వ్యక్తులకు అప్పగించే ప్రతిపాదన వుంది. ఒకవైపు ఇప్పటికే వున్న రోడ్లను విస్తరించడానికి ప్రభుత్వం దగ్గర నిధులు లేవంటూ, వాటి నిర్వహణను ప్రైవేట్‌వారికి అప్పగిస్తూ మరోవైపు కొత్త రోడ్లను నిర్మించడానికి పూనుకోవడం విచిత్రంగా వుంది.

రైల్వేల విషయం మరింత విచిత్రంగా వుంది. జాతీయ మౌలిక సదుపాయాల పథకం (NIP) కింద రైల్వేలకు 6 సంవత్సరాలకు గాను రూ.13.69 లక్షలకోట్లు కేటాయించబడింది. దానిలో రూ.11.90 లక్షలకోట్లు బడ్జెట్ కేటాయింపులు కాగా, మోడీ ప్రభుత్వం ఈ సంవత్సరం తాను నిర్దేశించుకున్న లక్ష్యం మేరకు ఖర్చు చేయలేదు. 2020-21లో కేటాయింపులు రూ.1.09 లక్షలకోట్లు (నిర్దేశించుకున్నది రూ.2.28 లక్షలకోట్లు). 2021-22లో నిర్దేశించుకున్న లక్ష్యం రూ.2.68 లక్షలకోట్లు కాగా, సవరించిన అంచనాల ప్రకారం అది రూ.1.17 లక్షలకోట్లు. ఇక 2022-23 నిర్దేశించుకున్న లక్ష్యం రూ.2.38 లక్షలకోట్లు. కాగా, కేటాయింపులు కేవలం రూ. 1.37 లక్షలకోట్లు. రైల్వే రంగంలో మంజూరయిన పోస్టుల్లో దాదాపు 1.4 లక్షలు భర్తీ చేయనివి వున్నాయి. రైల్వేల మౌలిక సదుపాయాల పట్ల మోడీ ప్రభుత్వపు నిర్లక్ష్యవైఖరికి ఇంతకన్నా పెద్ద ఉదాహరణలు అవసరం లేదనుకుంటా.

**నిరుద్యోగం:**

కోవిడ్ మహమ్మారి కారణంగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కుదేలయింది. పేదలు మరింత పేదరికంలోకి దిగాజారితే, సంపన్నులు మరింత సంపన్నులయ్యారు. 2020లో ప్రపంచ ఆర్థికం 3.1% కుదించుకపోతే, మనదేశ ఆర్థికం 7.3% కుదించుకపోయింది. కానీ, ఈ గణాంకాలు జిడిపిలో 30%, ఎగుమతులలో 40% మరియు ఉద్యోగాలలో 90% వున్న అసంఘటిత రంగాన్ని పరిగణలోనికి తీసుకోలేదు. 2019-20నాటికే దేశంలో నిరుద్యోగిత గత 40 సంవత్సరాలలో ఎన్నడూ లేనంతగా వుందని ప్రభుత్వ గణాంకాలే చెబుతున్నాయి. కోవిడ్ మూలంగా 60లక్షల సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమలు మూలనబడ్డాయి. ఇప్పటి నిరుద్యోగ రేటు పట్లణాలలో 8% గ్రామాలలో 6%గా వుంది. నిర్మల సీతారామన్ గారు ఈ సంవత్సరం మూలధన పెట్టుబడిని స్థూల జాతీయోత్పత్తిలో 2.9%కు పెంచడం ఆశావహమైన నిర్ణయమనిపిస్తుంది. అంతేగాక, వచ్చే ఐదేళ్లలో 60 లక్షల ఉద్యోగకల్పన హామీ ఇచ్చింది. (సంవత్సరానికి 2 కోట్ల ఉద్యోగకల్పన అని మోదీ హామీ గురించి అడగకండి). పోతే, కేంద్రంపై కేటాయింపులలో వాస్తవ పరిస్థితులను గమనంలోకి తీసుకున్నట్టు లేదు. దేశంలో, ప్రతి సంవత్సరం దాదాపు 5 మిలియన్ల యువత, వీరిలో ఎక్కువగా విద్యావంతులు, కొత్తగా ఉద్యోగార్థులవుతున్నారు. ఇప్పటికే, 2019నాటికి 30 మిలియన్ల నిరుద్యోగులు ఉండనే వున్నారు. కోవిడ్-19 ప్రభావం వల్ల మరో 10 మిలియన్ నిరుద్యోగులుపై సంఖ్యకు జతయ్యారు. అది చాలదన్నట్టుగా 2019-20లో 32 మిలియన్ల అర్ధప్రావీణ్య(semi-skilled), ప్రావీణ్యతలేని (unskilled) కార్మికులూ వున్నారు. గ్రామీణ కార్మికుల పని డిమాండ్‌లో 2021 ఏప్రిల్ లో 33% మరియు సెప్టెంబర్లో 31%కు ఉపాధి కల్పించలేకపోయారు. ఇక 2022 ఫిబ్రవరి 1 నాటికి, ఉపాధి పనులు కోరిన దాదాపు 77లక్షల కుటుంబాలకు ఉపాధి కల్పించలేదు. ఇలాంటి పరిస్థితులలో కేంద్రం మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి పథకానికి తగినన్ని కేటాయించలేదు.

ఇక, ఉద్యోగకల్పనకై ప్రభుత్వం సూక్ష్మ, చిన్న, మధ్యతరహా వ్యాపార (MSME) మంత్రిత్వశాఖకు అత్యవసర రుణ హామీ పథకం (EMERGENCY CREDIT LINE GUARANTEE) కింద 50,000 కోట్లను కేటాయించారు. కానీ, ఈ రుణాలు తీసుకునేదుకు సంబంధిత సంస్థలు ముందుకు వచ్చే అవకాశం లేదు. తమ ఉత్పత్తుల పెంచుకొనడం, ఇప్పుడున్న పరిస్థితులలో డిమాండ్ లేమి వల్ల లబ్ధి చేకూరదని వారికి తెలియనిదేమీ కాదు. అయితే, ఆర్థిక సంవత్సరం 2022-23 మధ్యకాలంలో తలసరి ప్రైవేట్ వినియోగ ఖర్చు వాస్తవ ధరలో 5% తగ్గిందనే ముఖ్యమైన అంశాన్నిప్రభుత్వం గుర్తించ నిరాకరిస్తున్నది .

**డిజిటల్ పెట్టుబడి జపం:**

నిర్మల సీతారామన్ గారి ప్రసంగంలో మనకు పదే,పదే వినపడే పదాలు 'డ్రోన్' 'డిజిటల్'. మొత్తం ఆర్థిక, వైద్య, విద్యా, రవాణాలతోపాటు అన్ని రంగాలను 'డిజిటల్' చేయడం ద్వారా దేశం అభివృద్ధి పథంలో దూసుకపోతుందని ప్రభుత్వం వక్కాణించి చెబుతుంది. దేశ ప్రజల, ముఖ్యంగా పేద, గ్రామీణ ప్రాంత ప్రజల ఆర్థిక, సామాజిక స్థితిగతులను పట్టించుకోకుండా అమలుపరిచే ఈ డిజిటలైజేషన్ ఎద్దులబండిని రాకెట్ ఇంజన్‌తో నడిపే ప్రయత్నంగా చెప్పవచ్చు.

ఈ బడ్జెట్ దేశప్రజల దాహం తీర్చడానికి తాను తవ్వబోయే బావి లేక నిర్మించబోయే ఆనకట్టల కోసం వేచిచూడమంతుంది. తమ మహోన్నత గతాన్ని నేమరవేస్తూ రాబోయే 'అమృతకాలం' కోసం వేచి చూడమంటుంది. అంటే ఇండియా@100, 2047 ఆగస్టు నాటికి మోడీ ప్రభుత్వం ప్రజలకు తాగునీటి బదులు అమృతాన్ని అందిస్తుంది. ప్రజలు దేనికొరకు ఇండ్లనుండి బయటికి వెళ్ళాల్సిన అవసరం వుండదు. విద్యా, వైద్యం, వ్యవసాయం, సేవారంగం -అన్నీ డిజిటల్ సేవలే. ఇక, కొసమెరుపు ఏమిటంటే, దీనికంతా ప్రభుత్వ పెట్టుబడి అక్కర్లేదు. అదానీ, అంబానీలు ఉండనే వున్నారు.

పై కేటాయింపులన్నీ, ప్రభుత్వం ఘనంగా ప్రకటించుకున్న 'నూతన భారతదేశం@75' వెలుగులో ఒకసారి పరిశీలిద్దాం.

'నూతన భారతదేశం@75' ప్రధాన నిర్దేశిత లక్ష్యం తలసరి ఆదాయం $ 1900(2017-18) నుండి 2022-23 కు $ 3000 కు చేరుకోవాలి. తద్వారా పేదరికం, నిరక్ష్యరాస్యత, అవినీతి, పోషకాహారలేమి లాంటి వాటి నుండి దేశాన్ని బయటపడవేయవచ్చని ప్రభుత్వ అభిప్రాయం. కానీ, 2021-22 నాటికి ప్రభుత్వ గణాంకాల ప్రకారమే దేశప్రజల తలసరి ఆఆయం కేవలం $ 1258 మాత్రమే. ఇది 2017-18 నాటి తలసరి ఆదాయం కన్నా తక్కువే.

'నూతన భారతదేశం@75' లక్ష్యం చేరడానికి మరో ముఖ్య సూచిక దేశ స్థూల ఉత్పత్తిని మార్చి 31, 2023 నాటికి $4 ట్రిలియన్లకు పెంచడం. కానీ, 2021 ఆర్థిక సంవత్సరం చివరకు అది $2.5 ట్రిలియన్లుగా వుంది. అంతేకాదు దేశంలో పేదరికం పెరిగిందని నీతిఆయోగ్ (ఆరోగ్యం, విద్య, జీవనప్రమాణాల సూచికల ద్వారా) తెలుపుతున్నది. దాని అంచనాలో 25.01% ప్రజలు బహుప్రమాణాలలో (MULTIDIMENSIONAL) పేదరికంలో వున్నారు. PEW పరిశోధన సంస్థ అధ్యయనం ప్రకారం పేదరికం ($2/- లేక తక్కువ దినసరి ఆదాయం పొందేవారు) గత ఒక సంవత్సరంలో రెండింతలు -60 మిలియన్ల నుండి 130 మిలియన్లకు పెరిగారు. అంటే 45 సంవత్సరాల తర్వాతా ఇండియా 'సామూహిక పేదరికపు దేశాల' జాబితాలో చేరింది.

అంతేగాక, నూతన భారతదేశం@75 లక్ష్యం చేరడానికి నిరుద్యోగుల సంఖ్య తగ్గించడమేగాక, 2022-23 నాటికి శ్రామికులలో మహిళల సంఖ్య 30% పెరగడమూ మరో ముఖ్యసూచికగా ప్రభుత్వం నిర్దేశించుకుంది. ఈ విషయంలోనూ ప్రభుత్వం సాధించిన ప్రగతి శూన్యమే అని గణాంకాలు తెలియజేస్తున్నాయి. ప్రభుత్వ గణాంకాల ప్రకారం 2021 జనవరి-మార్చి మధ్యకాలంలో కార్మికులలో మహిళలు కేవలం 16.9% మాత్రమే ఉండాగా, సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ (CMIE) అధ్యయనంలో 2021 డిసెంబర్ 31 నాటికి ఉద్యోగాలకి వేచివున్న నిరుద్యోగులు 35 మిలియన్లు వుండగా, అందులో 23% మహిళలే.

పై లక్ష్యంలో మరో ముఖ్యమైన అంశం, 2022 నాటికి రైతుల ఆదాయాన్ని రెండింతలు చేయడం. జాతీయ నమూనా సర్వే77 ప్రకారం వ్యవసాయ కుటుంబ నెలసరి ఆదాయం 2012-13 నుండి నేటికి 59% పెరిగింది. అంటే సంవత్సరానికి 7.8% అన్నమాట. ద్రవ్యోల్బానాన్ని పరిగణిస్తే ఆ పెరుగుదల కేవలం 2.5% మాత్రమే. ఇందులో మరో లోగుట్టు ఏమంటే రైతు కుటుంబాల ఆదాయంలో వ్యవసాయాదాయం కేవలం 38%. 2013లో అది 48%గా వుండేది.

ప్రైవాటితోపాటు, 2030 సుస్థిర అభివృద్ధి లక్ష్యాలు (SDG) చేరాల్సి ఉంది. అయితే SDG సూచిక మరియు డాష్ బోర్డ్ 2021 ప్రకారం ఆ సూచికలలో ప్రపంచంలోని 192 దేశాలలో మన దేశం 120 స్థానంలో వుంది. మరీ ముఖ్యంగా, 11 సుస్థిర అభివృద్ధి సూచికలలో రెండవ(ఆకలి లేనితనం), మూడవ(మంచి ఆరోగ్యం, మానవ శ్రేయస్సు), ఐదవ(లింగ సమానత్వం), పదకొండవ(సుస్థిర నగరాలు మరియు కమ్యూనిటీలు) వాటిలో చాల వెనుకబడిందని పై నివేదిక తెల్పుతుంది. ప్రపంచ ఆకలి సూచికలో మొత్తం సర్వేజేసిన 111 దేశాలలో మన స్థానం 101లో వున్నది. మన నీతి ఆయోగ్ సంస్థ నివేదిక కూడా పై వివరాలతో అంగీకరిస్తుంది. 2020లో 4.6 కోట్ల భారతీయులు అతితీవ్రమైన పేదరికంలోకి దిగజారగా, దేశ బిలియనీర్ల సంఖ్య 102 నుండి 142కు పెరగడమే గాక, వారి సంపద మార్చి 2020 నుండి నవంబర్ 2021 నాటికి రూ.23.14 లక్షలకోట్ల నుండి రూ.53.16 లక్షలకోట్లకు పెరగడం గమనార్హం.

దేశ ప్రజల పరిస్థితి ఇంత దయనీయంగా వుంటే ప్రభుత్వాలు మాత్రం సంపన్నులపై పన్నులు వేసేందుకు సిద్ధంగా లేవు. మరోవైపు పరోక్షపన్నుల ద్వారా ప్రజల నడ్డి విరుస్తున్నాయి. కార్పోరేట్లకు పన్నుల రాయితీ కల్పిస్తూ, దానివల్ల అభివృద్ధి జరుగుతుందని బుకాయిస్తున్నాయి. 2015లో సంపదపన్ను రాద్దు చేసింది. 2019లో కార్పోరేట్ పన్నులను 30% నుండి 22% తగ్గించింది. దానివల్ల ప్రభుత్వ ఖజానాకు 150 వేలకోట్ల రూపాయల గండి పడిందని అంచనా. అంతేకాదు, 92 మంది బిలియనీర్లపై కేవలం 1% సంపద పన్ను వేస్తే వచ్చే ఆదాయంతో ఆయుష్మాన్ భారత్ పథకానికి 7 సంవత్సరాలు నిధులు సమకూరుతాయి. ఇదీ మోడీ ప్రభుత్వం సాహించిన ఘన విజయం. ఒకవైపు ప్రపంచ కుబేరులే తమపై సంపద పన్ను వెయమని కోరుతుంటే (మన దేశస్తులు కాదనుకోండి), ప్రభుత్వాలు ససేమిరా అనడం అవెవరికొరకు పనిజేస్తున్నాయో చెప్పాలా?

దేశ సామాజిక ఆర్థిక పరిస్థితులు, వాటిపట్ల కేంద్ర వైఖరి ప్రజా ఉద్యమాలకు అనుకూలంగా వుంది. పాతే మెజారిటీ రాజకీయ పార్టీలు కమలనాథులు నిర్దేశిస్తున్న ఆవరణలోనే ప్రజల్ని బిజెపికి వ్యతిరేకంగా సంఘటితం జేయాలనుకోవడం వల్ల ప్రతిపక్షాలకు ఓటమే సంభవిస్తుంది. బిజెపి ప్రజల్ని మౌలిక సమస్యలైన పేదరికం,పెరుగుతున్న ఆర్థిక అసమానత, నిత్యావసర ధరల పెరుగుదల, దళితుల, మహిళల, ఆదివాసుల, మైనారిటీలపై దాడులు, నిరుద్యోగం లాంటి వాటి నుండి దృష్టి మరల్చి కుల, ఉపకుల, మత ఘర్షణలు ప్రోత్సహిస్తూ 'విభజించు-పాలించు' విధానాన్ని అమలుజేస్తుంది. అన్ని రాజకీయ పార్టీలు అదే పంథాలో నడుస్తున్నాయి. ప్రజలకు దగ్గరవ్వాలంటే వామపక్ష, ప్రగతిశీల శక్తులకు ఇది మంచి తరుణం. ప్రజల మౌలిక సమస్యలపై వారిని చైతన్యపరిచి, ప్రభుత్వ బూటక విధానాల గుట్టు విప్పి ఎక్కడికక్కడ సమస్యలపై ప్రజల్ని సంఘటిత ఉద్యమాలకు సిద్ధం చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది. దానికవసరమైన ఓపిక, సహనం దీర్ఘకాలిక వ్యూహం, ఎత్తుగడలు ప్రజాశక్తులు సంతరించుకుంటాయని ఆశిద్దాం.



# వరవరరావుకు తుమకూరు అక్రమ కేసులో అక్రమ వారెంట్

కర్ణాటక రాష్ట్రంలోని పావగడ అక్రమ కేసులో వరవరరావు గైర్హాజరీ అని ఆరోపిస్తూ ఆయనను అరెస్టు చేయాలని ఈ నెల 11న మధుగిరి కోర్టు వారంట్ ఇచ్చి, రూ. 25 వేల జరిమానా విధించడాన్ని విరసం ఖండిస్తోంది. ఈ కేసు 2005 ఫిబ్రవరిలో నమోదైంది. ఇందులో వరవరరావును నిందితుడిగా చేర్చారు. ఇలాంటి కేసు ఒకటి ఉన్నట్లు భీమా కొరేగావ్ కేసులో అరెస్టయి పూనా జైల్లో ఉండగా 2019లో ఆయనకు తెలిసింది. అనారోగ్య కారణాల మీద భీమా కొరేగావ్ కేసులో వరవరరావుకు బొంబాయి హైకోర్టు షరతులతో 2021 మార్చి నెలలో ఆరునెలల మెడికల్ బెయిల్ ఇవ్వడానికి ముందే మధుగిరి కోర్టులో ఈ కేసులో బెయిల్ తీసుకున్నారు. ఆ తర్వాత కోవిడ్ కారణాల వల్ల కోర్టులు ఆన్‌లైన్ పద్ధతిలో నడిచాయి. అట్లా వరవరరావు మధుగిరి కోర్టుకు మూడు నాలుగు సార్లు వీడియో కాన్ఫరెన్స్‌లో హాజరయ్యారు. 2021 అక్టోబర్‌లో వీడియో కాన్ఫరెన్స్‌లో రెండు గంటలపాటు ఉన్నప్పటికీ జడ్జి పట్టించుకోకుండా గైర్హాజరీ అని రాసి వారెంట్ ఇచ్చారు.

ఈ వారంట్ మీద నవంబర్‌లో తుమకూరు పోలీసులు బొంబాయి వచ్చి వరవరరావు ఆస్పత్రిలో ఉండగా ఫోటోలు తీసుకొని వెళ్లారు. నిందితుడు భీమా కొరేగావ్ కేసులో కండీషన్స్‌తో కూడిన మెడికల్ బెయిలు తీసుకొని ఆస్పత్రిలో ఉన్నారని, కాబట్టి ఈ వారంట్ రద్దు చేయాలని మధుగిరి కోర్టులో వరవరరావు తరపు లాయర్ వాదనలు వినిపించారు. అసలు ఈ కేసే అక్రమమని, సహ నిందితుల మీద కేసు కొట్టివేశారు కాబట్టి ఆయన మీద కేసు డిస్చార్జి చేయాలని బెంగుళూరు హైకోర్టులో మరో పిటీషన్ విచారణలో ఉంది.

మధుగిరి కోర్టు ఇవేవీ పరిగణలోకి తీసుకోకుండా ఫిబ్రవరి 11న మళ్లీ గైర్హాజరీ అని వారంట్ ఇచ్చి, మార్చి 19 నాటికి అరెస్టు చేయాలని ఆదేశించింది. దీనికితోడు రూ. 25,000 జరిమానా విధించింది. పోలీసుల అక్రమ కేసులకు తోడు కోర్టు అక్రమంగా, హేతురహితంగా వారంట్లు ఇవ్వడం న్యాయ ప్రక్రియలోని డొల్లతనాన్ని, రాజకీయ దురుద్దేశాలను తెలియజేస్తోంది.

అసలు ఈ పావగడ కేసే నిరాధారం. కుట్రపూరితం. కేవలం వరవరరావును నిర్బంధించడానికే ఇందులో ఆయనను చేర్చారు.

2005 ఫిబ్రవరి 10న తుమకూరు జిల్లా తిరుమని పోలీస్ స్టేషన్ పరిధిలోని వెంకటమ్మనహల్లి గ్రామంలో పాఠశాలలో ఉండిన కర్నాటక స్పెషల్ పోలీస్ క్యాంపుపై నక్సలైట్లు దాడి చేసిన సంఘటనకు సంబంధించిన కేసు ఇది. ఆరోజు సాయుధ నక్సలైట్లు ఆ క్యాంపు మీద దాడి చేసి ఒక ఎస్ఐని, ఏడుగురు పోలీసులను, ఒక పౌరుడిని చంపారని పోలీసులు ఇందులో ఆరోపించారు. ఆ ఘటన జరిగిన వెంటనే పోలీసులు తుమకూరు, పొరుగున ఉన్న అనంతపురం జిల్లాల గ్రామాల మీద ప్రతీకార దాడులు చేశారు. వందకు పైగా వ్యక్తులను నిర్బంధించి, చిత్ర హింసల పాలు చేశారు. చివరికి అరవై ఐదు మందిని నిందితులుగా కేసు తయారు చేశారు.

ఈ జాబితాలో ఉద్దేశపూర్వకంగా, కుట్రపూరితంగా వరవరరావు, గద్దర్‌ల పేర్లు చేర్చారు. 2004 అక్టోబర్‌లో ప్రభుత్వానికీ విప్లవపార్టీలకూ మధ్య మొదలైన చర్చలు అప్పటికి విఫలమయ్యాయి. 2005 ఆగస్టులో విప్లవ పార్టీ మీద, ప్రజాసంఘాల మీద నిషేధాన్ని పునరుద్ధరించి, విరసం మీద కూడ ప్రభుత్వం నిషేధం విధించి ఉన్నది. ఆ సమయంలో శాంతి చర్చల ప్రతినిధులను ప్రతి కేసులోనూ నిందితులుగా చూపారు. అట్లా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో కనీసం ఎనిమిది కేసులలో వరవరరావును నిందితుడిగా చూపించారు. పావగడ కేసు కూడ అటువంటిదే.

వెంకటమ్మనహల్లి దాడి జరగడానికి సరిగ్గా నాలుగు రోజుల ముందు 2005 ఫిబ్రవరి 6న కర్నాటకలోని చిక్కమంగళూరు జిల్లా పశ్చిమ కనుమల అడవుల్లో మావోయిస్టు పార్టీ నాయకుడు, కర్నాటక చరిత్రకారుడు సాకేత్ రాజన్‌ను పోలీసులు హత్య చేశారు. ఆ సందర్భంలో వరవరరావు, గద్దర్ బెంగళూరు వెళ్లి, ఆ ఎన్‌కౌంటర్ బూటకమైనదని ఆందోళన చేశారు. సాకేత్ రాజన్ అంత్యక్రియల్లో పాల్గొన్నారు. వెంకటమ్మనహల్లి దాడి సాకేత్ రాజన్ ఎన్‌కౌంటర్‌కు ప్రతీకారంగా జరిగిందని భావించిన పోలీసులు అందువల్ల ఆ కేసులో వీళ్లిద్దరి పేర్లూ కూడ చేర్చారు.

కాని వాళ్లిద్దరికీ 2005 నుంచి 2011 వరకూ కూడ సమన్లు ఇవ్వలేదు. అరెస్టు చేయలేదు. ఆ కాలంలో జరిగిన కేసు విచారణలో వారిద్దరినీ పరారీలో ఉన్నట్టుగా (అబ్‌స్కాండింగ్) చూపారు. నిజానికి ఆ కేసు విచారణ జరిగినప్పుడు 2005 ఆగస్టు నుంచి 2006 ఏప్రిల్ వరకూ వరవరరావు జైలులోనే ఉన్నారు. ఆ తర్వాత పదమూడు సంవత్సరాలు బహిరంగ జీవితంలో ఉన్నారు. అయినా పరారీలో ఉన్నట్టు చూపి మిగిలిన 19 మంది మీద విచారణ జరిపారు. దాదాపు 150 మంది సాక్షులను విచారించారు. ఆరు సంవత్సరాల విచారణ తర్వాత తుమకూరు అదనపు జిల్లా సెషన్స్ జడ్జి బి బాలకృష్ణ ఆ 19 మంది మీద 2011 అక్టోబర్ 29న కేసు కొట్టేశారు.

ఆ తీర్పు మీద పోలీసులు హైకోర్టులో అప్పీల్‌కు వెళ్లారు. ఆ అప్పీల్‌ను బెంగళూరు హైకోర్టు డివిజన్ బెంచి న్యాయమూర్తులు పరిశీలించి తుమకూరు అదనపు సెషన్స్ కోర్టు ఇచ్చిన తీర్పు చట్టబద్ధమైనదా కాదా మాత్రమే పరిశీలించవలసి ఉంది. ఇందులో భాగంగా మిగిలిన నిందితులను ఎందుకు విచారించలేదని ప్రశ్నించారు. వారిని విచారించి, తీర్పు వెలువరించిన తర్వాతనే ఈ పాత తీర్పు మీద అప్పీల్‌ను వింటామన్నారు.

ఇది న్యాయ ప్రక్రియలో కనీవినీ ఎరగని వ్యవహారం. ఎప్పుడూ ఎక్కడా ఇలా జరిగి ఉండదు. బెంగళూరు హైకోర్టు డివిజన్ బెంచి ఇచ్చిన ఇలాంటి అసాధారణమైన ఆదేశాల పర్యవసానంగా భీమాకొరేగావ్ కేసులో జైలులో ఉన్న వరవరరావును అరెస్టు చేసి పావగడ కోర్టులో హాజరు పరిచారు.

అసలు 'నేరం'లో పాల్గొన్నారని ఆరోపణలు ఎదుర్కొన్న వారి మీదనే కేసు కొట్టివేసినప్పుడు, ఆ 'నేరం' జరగడానికి 'కుట్ర' చేశారనే ఆరోపణ ఉన్నవారి మీద కేసు ఉండడానికే వీల్లేదు. అయినా కేసును అలాగే ఉంచారు. విచారణ జరిపారు. ఎట్టకేలకు వివికి బెయిలు ఇచ్చారు. ఆ తర్వాతనే ఆయనకు భీమాకొరేగావ్ కేసులో అనేక కండీషన్లతో గృహ నిర్బంధంవంటి మెడికల్ బెయిల్ వచ్చింది. ఆ తర్వాత అక్టోబర్ దాకా వీడియో కాన్ఫరెన్స్‌లో మధుగిరి కోర్టుకు హాజరవుతునే ఉన్నారు. కానీ ఇప్పుడు గైర్హాజరీ అని అరెస్టు చేయమని కోర్టు వారంట్ ఇచ్చింది. అబ్‌స్కాండింగ్, ఆబ్సెన్సీ అనే మాటలు పోలీసుల, న్యాయమూర్తుల ఉమ్మడి పరిభాషలో భాగమైనట్లుంది. అక్రమ ఆరోపణలతో కేసులు నమోదు చేయడం, అరెస్టు చేయడానికి తోడు న్యాయ ప్రక్రియ అన్యాయ ప్రక్రియగా మారడాన్ని విప్లవ రచయితల సంఘం ఖండిస్తోంది.

అరసవిల్లి క్రిష్ణ (అధ్యక్షుడు),
రివేరా (కార్యదర్శి)
**15.02.2022**



# కొండ చిలువ 2

పాపినేని శివశంకర్



'మహా పాదయాత్ర – నువ్వు తప్పకుండా రావాల. అందులో కలవాల' అని బావమరిది శీను ఫోను. వసంత్ ఆఫీసు పనులన్నీ సర్దుకొని పది రోజులు ముందే ఊళ్లోకి వచ్చి వాలాడు. ఉద్యోగం ఢిల్లీనుంచి హైదరాబాదుకు మారటాన ప్రయాణం తేలికైంది. భార్య కుసుమ కూడా వస్తాననటంతో ఇద్దరూ చిన్న కొడుకుతో బయల్దేరారు. అమ్మను కూడా చూసినట్టు ఉంటుంది. ఈసారైనా తమతో తీసికెళ్లాలి అనుకొన్నాడు. ఒంటరిగా ఊళ్లో ఎంత కాలం ఉంటుంది?

నాన్న పోయినాక కొన్నాళ్లు అమ్మ తన దగ్గరే ఉంది. నగర వాతావరణం నచ్చలేదు. ఊళ్లో ఉంటానికే మొగ్గింది. బాగోగులు చూట్టానికి బావమరిది ఉంటాన తనూ అడ్డు చెప్పలేదు. మధ్య మధ్య భార్య పిల్లలతో సెలవుల్లో వచ్చి చూసిపోవటమే.

కొడుకుతో పాటు కోడల్ని కూడా చూడటంతో శారదమ్మ మొహం చాటంత అయ్యింది. వాళ్ల వెనకే వచ్చి మనవడు రవి నాయనమ్మని వాటేసుకొన్నాడు. వాడిని ముద్దు చేసి, 'ఎంతకాలం అయ్యిందే తల్లీ మిమ్ముల్ని జూసి? మరి పెద్దాడేడీ?' అడిగింది.

'ఎక్కడత్తయ్యా! వాడికి పరీక్షలాయె. వీలు కాలా.' చెప్పింది కుసుమ.

'పద్ద పద్దాక ఏం పరీక్షలో పాడో' అంటూ కాళ్లకి నీళ్లిచ్చి, వాళ్ల బ్యాగులు పటమటింటిలో సర్ది, పొయ్యిమీద ఇడ్లీ పాత్ర పెట్టింది శారదమ్మ.

తెల్లారి శీనుతో పడమటి పొలాలకేసి వెళ్దొద్దామన్నాడు వసంత్. రాజధాని కోసం తామిచ్చిన రెండెకరాలకి పన్నెండు వందల గజాల చొప్పున రెండు ప్లాట్లు వచ్చాయి. పొలం పోయినా వాటి ధరలు పెరిగితే పిల్ల చదువులకి ఉపయోగపడతాయనుకున్నాడు. రాజధాని అభివృద్ధి అయ్యేకొద్ది భూములు పోయినా తమకి వచ్చిన రిటర్నబుల్ ప్లాట్లకి ధర పెరిగి బాగుపడతామనుకున్నారు రైతులు. ప్రభుత్వం మారి ఒక రాజధాని పోయి, మూడు రాజధానుల ముచ్చట వచ్చేపాటికి అవన్నీ మూలన బడ్డాయి.

ఇద్దరూ ఊరికి పడమట ఉన్న పొలం కేసి వెళ్లారు. ఒక దారి లేదు, డొంకా లేదు. తమకిచ్చిన ప్లాట్ల నెంబర్లు నోట్ చేసుకొని ఉన్నాడు వసంత్. 1. 14-124-548-1940-5- D 8; 2. 14-125-549-1998-7- D 8. కానీ ఎక్కడా ప్లాట్ల జాడే లేదు. నెంబర్ రాళు ఎటు పొయ్యాయో. అంతా పిచ్చి చెట్లతో చిట్టడవిలాగా ఉంది.

'నే ముందే చెప్పలా? ఎవుడు ప్లాటు ఎక్కడో ఎవుడికీ తెలీదు. సూస్తే నీకే అర్ధమవుద్దని తీసుకొచ్చా. ఈటిని అబిరుద్ది జేసి యియ్యాల్సిన బాద్దెత పెబుత్వానిది. అది చేతులు జాడిచ్చి కూకుంది. ఎమ్మెల్లేలు, మంత్రులు ఇటేపు కన్నెత్తి సూడరు. ఎవురికి జెప్పుకోవాల?' అన్నాడు శీను.

ఆ సాయంత్రం శీనువాళ్లింట్లో భోజనాలు. ఈశ్వరి వడ్డిస్తుంటే చేతివంక చూశాడు వసంత్.

'చెయ్యిమీద ఆ వాత ఏంటే? శీను ఏమన్నా చెయ్యి చేసుకున్నాడా యేంటి?' నవ్వుతూ అడిగాడు.

'కాదులే అన్నాయ్! రాజధాని ఎత్తేస్తన్నారని ఆసెంబ్లీ ముట్టడిద్దామని అన్ని ఊళ్లవాళ్లం, ఆడా మగా బయలెల్లాం గందా?

రోడ్లమీద ఎక్కడికక్కడ బారికేడ్లు పెట్టి ఆపేశారు. అయినా పక్క దారుల గుండా పొలాలగుండా పొలోమని తోసుకెళ్లాం. పోలీసులు వెంటబడి తరిమారు. లాఠీలతో బాదారు. జాకీట్లు చించారు. ఆడవాళ్ళం అని గూడా చూడకుండా...ఎందుకులే ఆన్నాయ్! ఆ అవమానాలు చెప్పుకున్నేవి గాదు. అప్పుడు తగిలింది' అని చెయ్యివంక చూస్తూ చెప్పింది ఈశ్వరి.

'నాకూ కాసిని వడ్డించార్లే' నవ్వుతూ చెప్పాడు శీను.

ఆ నవ్వు వెనక బాధ అర్థమైంది వసంత్‌కి. అసెంబ్లీ ముట్టడి నేరం. మరి అసెంబ్లీ సాక్షిగా అమరావతి రాజధాని అని ఒప్పుకొని మడమ తిప్పటం ఏమవుతుంది?

* * *

'రాక రాక వచ్చాం. అనంతారం కొండకి వెళ్లి దేవుణ్ణి దర్శించుకుందామండీ' అని అడిగింది కుసుమ.

'అంతకంటేనా?' అన్నాడు వసంత్ సంతోషంగా.

చిన్నతనం గుర్తొచ్చింది అతనికి. డాబా ఎక్కి చూస్తే ఉత్తరంగా మైలున్నర దూరాన అనంతారం కొండ. ఏనుగుమీద విభూతి చారిక లాగా మెట్ల దారి కనపడుతుంది. దానితో తెలియని అనుబంధం. బుల్లి ప్రభ కట్టుకొని సావాసగాళ్లతో కొండ దగ్గరికి వెళ్లటం, ఒక్క ఊపున 367 మెట్లూ ఎక్కటం, వాలు దొనలో వెలిసిన వెంకటేశ్వరుడికి చదువు బాగా రావాలని మొక్కటం, పొంగలి, ప్రసాదం మెక్కటం, కుడిచేతి వైపు తుప్పల్లో బడి నడిచి కోనేట్లో నీళ్లు తాగటం, ఆడుకుంటూ పాడుకుంటూ మాపటేలకి ఊరు చేరటం అన్నీ గుర్తుకొచ్చాయి. ఆ ఆటపాటలు ఈ తరానికి బోధపడతాయా? ఏమో.

గట్టెక్కలేను, రానంది శారదమ్మ. భర్త చనిపోయినాక దేనిమీదా అంత ఆసక్తి లేదు తనకి. శీను తన దూరపు చుట్టాలబ్బాయినడిగితే అతనే తన కారు తెచ్చాడు. ప్రయాణంలో తన గోడు వెళ్లబోసుకున్నాడు. 'ఉద్యోగం లేదుగా. రాజధాని పెరిగితే బాడిగలు బాగుంటాయని లచ్చలు పోసి కారు కొన్నా. రాజధాని పనులేమో ఆగిపాయె. లచ్చమంది పనోళ్లతో ఈ ప్రాంతమంతా ఎంత సందడిగా ఉండేది? వచ్చేవాళ్లు, పొయ్యే వాళ్లు, ఏ రోజూ తీరికుండేది గాదు. ఇప్పుడు కారుకు ముసుగు తీసి రొండు నెల్లవుతుంది.'

'పనులన్నీ ఆగిపొయ్యాయి సగం సగంలో. పెద్ద పెద్ద రోడ్లేంది, వంతెనలేంది, భవనాలేంది – అన్నీ మూలన బడ్డాయి. కాంట్రాక్టర్లు దివాలా తీశారు. ఇదేందో ఒరగబెట్టిద్దని ఇక్కడ ప్లాట్లు కొన్నోళ్లు, పెద్ద పెద్ద భవంతులు గట్టినోళ్లూ ఆరిపొయ్యారు. ఈ రొండు మూడేళ్లు పోతే గవర్మెంటు ఇచ్చే కౌలు రాదు. ప్లాట్లు అమ్ముకుందామంటే అడిగే నాథుడు లేడు. అసలు అయ్యెక్కడున్నాయో ఎవుడికి తెలుసు? 29 ఊళ్లూ ఉట్టికీ స్వర్గానికీ గాకుండా ఆరిపొయ్యినియ్' అన్నాడు శీను.

'ఇదంతా సొశానం అంటన్నారుగా అన్నాయ్!' అన్నాడతను.

శారదమ్మ అందుకొంది. 'అళ్ల దినం జెయ్య! ఇదంతా వల్లకాడైతే అళ్లు వల్లకాట్లో పెబుత్తం జేస్తన్నారా? మట్టి గొట్టుకు పోతారు' అని శాపనార్థాలు పెట్టింది.

జనంలో ఎంత ఆవేదన దాగుందో అర్థం అవుతుంది వసంత్‌కి. ప్రభుత్వాలకి ఆట. జనానికి జీవన్మరణ సమస్య.

నలుగురూ కారులో అనంతారం కొండ చేరుకొన్నారు. వసంత దృష్టిలో తన బాల్యానుభూతులతో పెనవేసుకొన్న అనంతారం కొండ సజీవం. నిత్యనూతనం. జడ పదార్థం కాదు. చైతన్యశీలం.

*ఎప్పటికైనా ఇక్కడ*
*మనిషిలాంటి కొండను చూసినట్టే*
*కొండలాంటి మనిషిని చూడగలనా?'*

–అంటూ తన డైరీలో కవితగా రాసుకొన్నాడు ఎప్పుడో.

'పువ్వు మెట్లు ఎక్కలేవు. నేను ఎత్తుకుంటాలే' అన్నాడు శీను రవితో. 'ఎక్కుతా' అన్నాడు రవి హుషారుగా. ఒక్క ఊపున వేగంగా మెట్లెక్కాడు. కుసుమ వెనక పడింది. '366 మెట్లు. లెక్క పెట్టా.' అని చెప్పాడు రవి తండ్రితో. 'నా లెక్క ప్రకారం 367' రావాలే' అన్నాడు వసంత్. 'ఏం గాదు. నేనే కరెక్ట్' అన్నాడు రవి, అమ్మా నాన్నల నవ్వు చూస్తూ.

చిన్నప్పుడు బుల్లి బుల్లి ప్రభలు కట్టుకొని సావాసగాళ్లతో గట్టు దగ్గరికి రావటం గుర్తొచ్చింది. భక్తి అంటే తెలీదు. అదొక సరదా.

పైన సుమారు 50 గజాల ఆవరణ ఉంది. ఎవరో తొలిచినట్టుగా, కొండకి గాటు పెట్టినట్టు చిన్న గుహలాంటి ప్రదేశం. ఆ సందులో ఏటవాలు రాతిమీద తూర్పు మొగంగా వెంకటేశ్వరుడు వెలసి ఉన్నాడు. ఇరు పక్కల శ్రీదేవి, భూదేవి. దక్షిణాన కొండరాతి మీద వరసగా పన్నిద్దరు ఆళ్వారుల బొమ్మలు చెక్కి ఉన్నాయి.

'స్వయంభూ వెంకటేశ్వరుడు అంటారు. వాలు దొన వెంకన్న అని పేరు.' వివరించాడు వసంత్ భార్యకి. ఏటవాలుగా దొన్నెలాగా ఉంది గదా ఈ చోటు? అందుకే ఆ పేరు వచ్చి ఉంటుంది.'

దర్శనం అయినాక శీను రవిని ఎత్తుకొని ఆ ప్రాంగణం, చుట్టు పక్కల చూపిస్తున్నాడు.

'మనం గట్టు (కొండ) నడి మధ్యలో ఉన్నాం. ఇక్కడికి తూర్పుగా కాలినడకన పోతే చిన్న కోనేరుకూడా ఉంటుంది. చూస్తావా?' అని అడిగాడు వసంత్.

'అన్నీ తుప్పలు, పొదలు. వీడు నడవలేడులే వదిలెయ్యండి' అంది కుసుమ.

'అదుగో, దక్షిణంగా మన ఊరు నెక్కల్లు. పడమట కనపడేది కర్లపూడి' అని చెప్పాడు వసంత్.

'ఇదంతా పెద్ద ఫారెస్టా నానా?' అడిగాడు రవి. వాడికి ఎటు చూసినా కొండ చుట్టూ పెద్ద పెద్ద పిచ్చి చెట్ల అడవే కనపడుతుంది. శీను అందుకొన్నాడు.

'ఒకప్పుడు ఇక్కడనుంచి చూస్తే చుట్టూతా పచ్చపచ్చని పంటపొలాలు బిళ్లలు బిళ్లలుగా కనపడేవి. ఇప్పుడంతా పిచ్చిచెట్ల అడివే అయ్యింది. పట్టించుకొనే నాథుడు లేడు' అంటూ నిట్టూర్చాడు.

కొండ దిగినాక కారులో ఎక్కబోతూ వెనక్కి తిరిగి చూశాడు రవి. ఆశ్చర్యంతో 'నానా! పైథాన్! పైథాన్!' అన్నాడు పెద్దగా.

'అంటే ఏంది?' అడిగాడు శీను.

'కొండచిలువ' చెప్పాడు వసంత్. అనంతారం గట్టు వైపు తిరిగి చూశాడు. అదే కొండచిలవ, గట్టును చుట్టుకోని, వెరపిస్తూ. నిగనిగలాడతా భయంకరంగా ఉంది. పెద్దగా బుసలు వినపడుతున్నయ్. పూర్వం తనకి కన్పించిందే. కాకపోతే అప్పుడు పసుపు పచ్చ. ఇప్పుడు

నీలి రంగు.

శీను. అతనికేం కనపడలేదు. 'ఏందో. పదండి, పదండి. అన్నమేలయ్యింది' అని బయల్దేరదీశాడు. ఇంటికొచ్చినాక శారదమ్మకి చెప్పాడు రవి, 'నాయనమ్మా! అనంతారం కొండని చుట్టుకోని పెద్ద పైథాన్ కనపడింది.'

శారదమ్మకి అర్థం కాలేదు. 'అదే నాయనమ్మా! కొండచిలువ. బ్లూ కలర్‌లో ఉంది.'

శారదమ్మ నిట్టూర్చింది.

*    *    *

మాపటేళ వసంత్, శీను తూర్పు వీధినున్న వెంకట్రామయ్య యింటికి బయల్దేరారు. పెదనాన్న పెంకుటిల్లు మునుపటిలాగే ఉంది, పైన కొన్ని పెంకులు లేచిపోయి. ముందు పంచపాళీ. వేపచెట్టు. వెంకట్రామయ్యే మరీ ముసలివాడయ్యాడు.

'ఎవురూ?' అంటూ కల్లమీద చెయ్యి పెట్టుకొని చూశాడు. 'దా దా. కూకో' అని కుక్కి నులక మంచం చూపిచ్చాడు. 'ఏమేయ్! ఎవురొచ్చారో సూడు' అని పెళ్లాన్ని కేకేశాడు. లోపల్నుంచి రత్తమ్మ వచ్చి 'ఏయ్యా! బాగుండావా? అమ్మాయేమన్నా మళ్లీ నీళ్లు బోసుకుందా?' అని పలకరించింది. పలకరింపులైనాక తమ్ముడు సూరి గురించి అడిగాడు వసంత్.

'ఏవుంది? పువ్వులమ్మిన చోటే కట్టెలమ్ముతున్నాడు నీ తమ్ముడు' అన్నాడు వెంకట్రామయ్య నీరసంగా.

'అంతా మా కర్మ. ఈ వొయిసులో మమ్మల్నిట్టా జేశాడు దేవుడు' అని కన్నీళ్లొత్తుకుంది రత్తమ్మ.

'మద్దెలో దేవుడేం జేశాడత్తా? అంతా మదుసులే. పెబుత్వాలే. అటు పొలమూ లేదు. ఇటు రాజదానీ లేదు. పని పాటల్లేవు. అందర్నీ అర్పేశారు' అన్నాడు శీను.

మాటల్లోనే ఊడిపడ్డాడు సూరి. 'ఏన్నాయ్! శాన్నాల్లకి అవపడ్డావ్. వదిన, పిల్లలు బాగుండారా?' అని అడిగాడు.

'ఆ ఆ' నవ్వుతూ తలూపాడు వసంత్.

జుట్టు పెరిగి, గడ్డం మాసిపోయి, సగం చిక్కిపోయి, నవ్వినా కళ లేని మొహంతో ఏదోలా ఉన్నాడు. 'ఏం జేస్తున్నావ్?' అని అడిగాడు వసంత్.

'చేసేదేవుంది? అంతా అయిపోయింది' అన్నాడు సూరి. రాజధాని అనంగానే భూముల రేట్లు పెరిగినప్పుడు ఉన్న ముప్పాతిక ఎకరం అమ్మేశాడు. ఏదో వ్యాపారం అన్నాడు. ఏదీ కుదరలేదు. చేతినిండా డబ్బు. నాలుగు నెలలు తిరిగేపాటికి పేకాట, తాగుడులో మొత్తం తగలేశాడు. ఇప్పుడు రోజూ పెదపరిమి పొలాలకి కూలీగా వెళ్తున్నాడు.

ఈ ప్రాంతాల రైతుల పతనావస్థకి సూరి నిదర్శనమేమో అనుకున్నాడు వసంత్.

ఇంటికి తిరిగి వస్తుండగా ఇంతకు ముందు తమ పొలంలో పనిచేసిన కూలీ జోసెఫ్ ఎదురయ్యాడు. 'ఎప్పుడొచ్చారయ్యా! అంతా బాగుండారా?' అని పలకరించాడు. జవాబు చెప్పి ఇప్పుడేం చేస్తున్నావని అడిగాడు వసంత్.

'ఏముందయ్యా! అంతా మారిపోలా? ఊళ్లో పనుల్లేవాయె. బేల్దారు పనికి గుంటూరెల్తున్నానయ్యా! పల్లెలో అందరూ ఇంతే. ఎయ్యో దొరికిన పనులకి పోనుకెల్తొన్నారు.'

వసంత్ నిట్టూర్చాడు. ఇంటికెళ్లగానే మంగలి రంగారావు ఎదురు చూస్తున్నాడు. వాడు, తను చిన్నప్పుడు గోలీలాడుకున్నారు.

'వచ్చావని తెలిసిందన్నాయ్! పలకరిద్దామని. రేప్పొద్దున రమ్మంటావా గడ్డానికి? తల గూడా పెరిగిందిగా?' మొహంవంక చూస్తూ అడిగాడు.

'అక్కర్లేదులే గాని ఎట్లా ఉన్నావ్?' అని అడిగాడు వసంత్.

'నలుగురు కూతుళ్లుగా? అందరికీ పెళ్లిళ్లు జేశా. అరెకరం పొలం రాజధానికి దీసుకోని రొండు ప్లాట్లిచ్చారు. బాకీలుండయ్. ఒక ప్లాటన్నా అమ్ముదామంటే కొనే నాథుడు లేదు. వడ్డీలు పెరిగిపోతన్నయ్. ఏం జెయ్యాలో తోచటంలా.'

అందరికీ తల పని చేసే రంగారావు గడ్డం, తల పెరిగిపోయుంది. తిరుపతి వెంకన్నకి మొక్కు

వసంత్‌లో అలలు అలలుగా ఆలోచనలు. ఒక ప్రభుత్వం ఇదంతా రాజధాని అన్నది. మరో ప్రభుత్వం ఇదంతా అడవి అన్నది. ఆపైన శ్మశానం అన్నది. అన్ని కులాలూ ఉన్న ఈ ప్రాంతాన్ని ఒకే ఒక సామాజిక వర్గానికి చెందిందిగా ప్రచారం చేసింది. అంతా ఒక ధ్వంసరచన. దాని వెనక హింసరచన. ఏది బాధ్యత? ఎక్కడ అభివృద్ధి?

జనానీకం గుండెల్లో గాయపడింది. నమ్ముకున్న పొలం నయానో, భయానో జారిపోయింది. ఆశలన్నీ ఆవిరయ్యాయి. రైతులకు చేతిలో పనులు లేవు. ఇంకో వృత్తిలోకి వాళ్లు వెళ్లలేరు. రైతు కూలీల పొలం పనులు లేవు. ఎవరికీ ఏం జెయ్యాలో తోచటం లేదు. అనివార్యంగా శాంతియుత పోరాటానికి సిద్ధమయ్యారు. చూస్తుండగానే పోరాటం 700 రోజులు దాటింది. ప్రభుత్వంలో చలనం లేదు. మూడు రాజధానుల మూడు ముక్కలాట గడప దాటలేదు.

*    *    *

రోజూ అన్ని ఊళ్లల్లో రాజధాని పరిరక్షణ సమితి ఆధ్వర్యంలో ధర్నాలు జరుగుతున్నాయి. ఎన్నడూ గడప దాటని మహిళలు కూడా బయటికి వచ్చి ధర్నాలు, ఊరేగింపుల్లో పాల్గొంటున్నారు. ఊరి నడిబొడ్డున రామాలయం. దానికి ఉత్తరం వీధిలో ఖాళీస్థలంలో శిబిరం ఏర్పాటు చేశారు. వసంత్ కూడా కొడుకుతోపాటు వెళ్లి శిబిరంలో కూర్చున్నాడు. వాళ్లూ వీళ్లూ కుశలప్రశ్నలు వేశారు. ఊరి పెద్ద రామయ్య రవిని దగ్గరకి తీసుకొని ఏం చదువుతున్నావని అడిగాడు. వసంత్‌తో అన్నాడు.

'అబ్బాయ్! ఇక్కడి పరిస్థితులు మామూలుగా లెవ్వు. ఏడాది కిందట ఊళ్లల్లో 144 సెక్షన్ పెట్టరు. జనం కలవకుండా గ్రామానికి, గ్రామానికీ మద్దెన ఇనపకంచెలేశారు. బ్రిటిషోళ్ల కాలంలోనూ నేను జూడలా. మూడు వేలమంది పోలీసుల్ని దింపి మందడంలో పెరేడ్ జేశారు. శిబిరాలు పీకేశారు. ఆ మద్దెన (10 జనవరి 2020) వేలమంది ఆడపడుచులు బెజవాడ కనకదుర్గ అమ్మవారికి మన కష్టాలు నివేదించటానికి పొంగళ్లతో బయలెల్లితో ఎక్కడికక్కడ అడ్డుకొని చితకబాదారు. నీకూ వార్తలు అందుతున్నయ్యి గందా? నీలాంటి వాళ్లు కూడా ఈ ఉద్యమంలో పాల్గొంటే మనకింకా బలం వస్తది.'

'నిజమే మావయ్యా! అన్ని ఊళ్లల్లో ధర్నాలు జరుగుతున్నయ్యా?' అడిగాడు వసంత్.

'29 ఊళ్లల్లో శిబిరాలున్నయ్! ఆడా మగా అందరూ పాల్గొంటన్నారు. ఇయ్యాల మాపటేల కొవ్వొత్తుల ప్రదర్శన కూడా ఉంది.' చెప్పాడు రామయ్య. 'మహా పాదయాత్రలో పాల్గొంరాదా?' అడిగాడు మళ్లీ.

'తప్పకుండా పాల్గొంటా. అందుకేగా వచ్చింది? ఉద్యమానికి రాష్ట్రవ్యాప్తంగా ఇంకా ప్రచారం రావాలి.' అన్నాడు వసంత్. పక్కనే కూర్చున్న నరసయ్య అందుకున్నాడు.

'పెచారానికేం బాగ్గెం? పెబుత్తం మాబాగా జేసింది. కిష్టానదికి వరదొస్తే యిదంతా మునిగిపోద్దంట. గనక యిక్కడ రాజదానేంది అంటాడు ఒక దగుల్బాజీ మినిట్టరు.'

'అదేంటి? కృష్ణానదికి ఈ దక్షిణభాగమంతా బాగా మెరక గదా? ఎప్పుడన్నా ఈ ఊళ్లు మునిగాయా?' ఆశ్చర్యపడ్డాడు వసంత్.

రామయ్య చెప్పాడు. 'అబ్బాయ్! నేను పుట్టి ఎనభై ఏళ్లు. ఇంతవరకి ఈ ఊళ్లు మునిగిన వైనం నాకు దెలవదు. ఎప్పుడో నేను పుట్టక మునుపు కిష్టానదికి పెద్ద వరదలొచ్చి రాయపూడి దాటి తుళ్లూరుదాకా నీళ్లొచ్చినయ్యంట. నాగార్జునసాగర్ డ్యాం కట్టినాక కరకట్ట దాటి చుక్క నీళ్లు ఇవతలికి రాలా.'

'అది ఆ ఎదవనాయాళ్లకి తెలవకనా? ఏదో ఒక అబాండం యెయ్యాలి గందా? అందుకని' చెప్పాడు నరసయ్య.

ఇంకో రైతు అందుకొన్నాడు. 'మూడు రాజధానులంటగా? అదేమన్నా జరిగే పనేనా అని.'

'నువు బలేవోడివే బావా! ఒకదాన్నే ఏడవలేనోడు మూడిటిని ఏడుస్తాడా?' అన్నాడు నరసయ్య.

అందరూ నవ్వారు.

అంతలో రవి ఉండబట్టలేక అడిగాడు, 'తాతా! అనంతారం కొండను చుట్టుకోని పెద్ద పైథాన్- అదే కొండచిలువ కనపడింది. ఎందుకట్లా ఉంది?'

రామయ్య నిట్టూర్చాడు. 'మా కర్మ.'

రాత్రికి రచ్చబండ దగ్గర కుర్చీలు వేశారు. ఊళ్లో రైతులు, రైతు ఆడపడుచులు, పిల్లలు అక్కడ చేరారు. వసంత్, కుసుమ, రవి వచ్చారు. ఎవరో వచ్చి తలా ఒక కొవ్వొత్తి ఇచ్చారు. రవికి ఇవ్వకపోయినా అడిగి మరీ కొవ్వొత్తి తీసుకున్నాడు. అందరూ వెలిగించుకొని కుర్చీల్లో నిశ్శబ్దంగా కూర్చున్నారు. నిశ్శబ్ద నిరసన. ప్రగల్భ నిరసనే మొద్దుబారిన ప్రభుత్వానికి చేరనప్పుడు ఈ నిశ్శబ్దనిరసన చేరుతుందా? సందేహమే.

రాత్రంతా వసంత్ మనస్సులో ఆలోచనలు సుడిదిరుగుతున్నాయి. తండ్రి పెదకోటయ్య యాభైయేళ్లు వ్యవసాయం చేశాడు. ఏ యేటికా యేడు తవ్వటం, పూడ్చుకోవటమే. దమ్మిడీ మిగలకపోగా చివరాఖరికి లక్షన్నర బ్యాంకు బాకీ తేలింది. కాకపోతే కొడుకు చదువు, కూతురు పెళ్లి చెయ్యగలిగాడు. పంచుకున్న ఐదెకరాల్లో అమ్ముకోగా ఎకరన్నర మిగిలింది. తుళ్లూరు బ్యాంకులో గాని, పెదపరిమి సహకార బ్యాంకులో గాని అప్పు లేని రైతులు దాదాపుగా లేరు.తండ్రి మొదలు ఊళ్లోని రైతు కుటుంబాల్లో వ్యసనాలు తక్కువ. మరి ఇంత కాలం గొడ్డుచాకిరీ అంతా ఏమయ్యింది? పండిన పంటంతా, సంపదంతా ఎవరి గాదెల్లోకి, లాకర్లలోకి చేరింది చేరింది? పొగాకు, పత్తి దళారులు,పెట్టుబడిదారులే బాగుపడ్డారు గాని రైతులు అణగారిపొయ్యారు. కూలీల పరిస్థితీ అదే. మూల కారణం? ఏ ప్రభుత్వం బదులు పలుకుతుంది? కవి వాక్యం సత్యం.

*'సంపద సృష్టించినవాడు సంపన్నుడు కాకపోవటం*
*తరతరాల మోసం'*

కలత నిద్రలో కల. ....ఒకటే చీకటి. కళ్లు పొడుచుకున్నా కనపడని చీకటి ముసురు. దట్టంగా మబ్బులు. కాని వాన చినుకు లేదు. అంతలో బొయ్యిన ఒకటే వడగాలి. అదేదో మహాసర్పం ముక్కుల్లోనుంచి వీస్తున్నట్టుగా. ఇళ్ల కప్పులు లేచిపోతన్నయ్. చెట్లు కూలిపోతన్నయ్. రామాలయం ముందు ధ్వజస్తంభం గజగజలాడింది. గొడ్డూ గోదా ఒకటే మైన అరుస్తున్నయ్. కళ్లల్లో, ఒంటినిండా ఇసిక. తెరలు తెరలుగా ఇసిక. అంతా కటిక చీకటి. మనుషులు కొట్టుకుపోతన్నారు. తను ఊరమ్మటి తాడిచెట్టును కావిలించుకొని, కొట్టుకుపోకుండా ఆగాడు. అమ్మ ఏమై పోయింది? ఎటు కొట్టుకుపోయింది? ఎటు? అమ్మా! అం..మ్మా!....

ఉలిక్కిపడి లేచాడు వసంత్. చుట్టూ చూశాడు. ఎదురుగా గోడమీద నాన్న ఫొటో. పక్కన కాలెండర్. మరో వైపు గోడ గడియారం. పై కప్పు మూలన బూజు.

అదే కల. ఇంతకుముందు ఊరికి వచినప్పుడూ అదే కల. మేం ఏం కాబోతున్నాం? ఊరు ఏం కాబోతుంది? ఎక్కడో సన్నగా బుస వినపడుతుంది.

* * *

ఆ తెల్లారి వసంత్ శీనుతో నేలపాడు, దొండపాడు, రాయపూడి, లింగాయపాలెం మొదలు దాజధాని ఊళ్లన్నీ తిరిగాడు. రాజధాని భూసమీకరణకి పొలాలు ఇచ్చినాక రైతులకి పని పాటలు లేవు. కూలీలు కొంతమంది పనుల కోసం పట్టణాలకి వెళ్లొస్తున్నారు. ఎవరి మొహాల్లోనూ కళాకాంతులు లేవు. తర్వాత ఉద్దండ్రాయుని పాలెం వద్ద రాజధానికి ప్రధాని శంకుస్థాపన చేసిన ప్రదేశం చూశాడు వసంత్. ఉత్తరం కరకట్ట, పడమట లింగాయపాలెం, తూర్పున వెలగపూడి. ఇంతకు మునుపు ఈ తావంతా పచ్చటి అరిటితోటల్తో చల్లచల్లగా ఉండేది. రాజధాని అన్నాక ఇప్పుడు అదంతా పోయింది. మొత్తం ఇప్పుడు విషపూరితమైన ఒయ్యారిభామ (పార్థీనియం) మొక్కల పూలవనం! ఇంగ్లీష్ తుమ్మచెట్లు. అంతా గబ్బు గీయం. దూరంగా వెలగపూడి కవతల బహుళ అంతస్తుల భవనాలు.

'అయ్యన్నీ పోయిన పెబుత్వం కటిచ్చినయ్యే. ఆటినీ వాడుకోకుండా వొదిలేశారు. సగం సగం అయిన రోడ్లనీ పూర్తి జెయ్యటంలా. ఎవురెవురో రేత్తిరేల కంకర తవ్వుకోని పోతన్నా పట్టిచ్చుకునే దిక్కు లేదు. ఉచిత పథకాలు దప్ప పెబుత్వం జేస్తుంది గుండు సున్నా' చెప్పాడు శీను.

చివరగా తుళ్లూరులో రాజధాని పరిరక్షణ సమితి వాళ్లతో మాట్లాడాడు. పాదయాత్రలో పాల్గొనమని అడిగారు వాళ్లు. పాదయాత్రకి అంత తేలిగ్గా అనుమతి రాలేదు. లేనిపోని గొడవలు జరుగుతాయనే సాకుతో ప్రభుత్వం అడ్డు పెట్టింది. చివరికి ఉన్నత న్యాయస్థానం అనుమతితో తుళ్లూరులో యాత్ర మొదలైంది. ఆకుపచ్చ కండువాలతో నవంబర్ 1వ తేదీన 5000 మంది రైతులు, మహిళలు. తుళ్లూరునుంచి పెదపరిమిలో ఆగి భోంచేసి, మొదటిరోజు తాడికొండలో బస చేశారు. తెల్లారి అడ్డరోడ్డు దాటి లాం గ్రామం వద్ద భోజనాలు చేసి, గుంటూరు

దగ్గర బస చేశారు. మూడోరోజు గుంటూరులో పాదయాత్ర. వసంత్ కొడుకుతో, శీనుతో తుళ్లూరు పాదయాత్రలో కలిశాడు. ఆరోజు సాయంత్రం తిరిగి నెక్కలు వెళ్లి, మళ్లీ మూడోరోజు గుంటూరు పాదయాత్రలో కలిసి నడిచాడు. అలవాటు లేని నడకే అయినా అంతమంది జనంతో కలిసి పోతుంటే కాళ్లనెప్పులు ఎటు పొయ్యాయో. 'మూడు రాజధానులు వద్దు – అమరావతే ముద్దు, ఒకే రాష్ట్రం – ఒకే రాజధాని.' నినాదాలతో జనంలో ఉత్సాహం పెల్లుబికింది. ఎక్కడెక్కడి వాళ్లూ వచ్చి యాత్రలో కలిసి నడిచారు. ప్రతిచోటా యాత్రికులపైన పూలవాన కురిసింది. వసంత్‌కి రానురాను ఉత్సాహం పెరిగింది. చివరిదాకా నడవాలనుకున్నాడు. పోలీసులు ఇబ్బందులు పెట్టినా యాత్ర ఆగలేదు. చుట్టుపక్కల ఊళ్లనుంచి, తమిళనాడు నుంచి, విదేశాలనుంచి ఎంతోమంది కలిసి నడిచి తమ సంఘీభావం తెలిపారు. పరుచూరు, అద్దంకి ప్రాంతాలమీదుగా ప్రకాశం జిల్లా గడిచి, నెల్లూరు దాటి, చిత్తూరు జిల్లా చేరారు. దాదాపు 70 ప్రధాన గ్రామాలమీదుగా యాత్ర సాగింది. ఎండా లేదు. వానా లేదు. అలుపూ లేదు. సొలుపూ లేదు. 45వ రోజు తిరుమల చేరుకొని దైవదర్శనం చేశారు. ఆ పిమ్మట 17 డిసెంబర్ 2021న తిరుపతిలో బ్రహ్మాండమైన బహిరంగ సభ. అన్ని రాజకీయ పార్టీల వాళ్లూ పాల్గొన్నారు. వసంత్ కూడా నాలుగు మాటలు మాట్లాడే అవకాశం వచ్చింది. అందరికీ నమస్కరించి రెండే నిముషాలు మాట్లాడాడు.

'తమ బ్రతుకులతోపాటు దేశమంతా బాగుపడుతుందనే ఉద్దేశంతో అన్ని వర్గాల రైతులు తమ పంట భూములు రాజధానికోసం ఇచ్చారు. ఇప్పుడు ఉట్టికీ స్వర్గానికీ కాకుండా పోవటం పాలకుల నిర్లక్ష్యానికి నిదర్శనం. పార్టీలు వేరు. ప్రభుత్వం వేరు. ఒకసారి ప్రభుత్వం ఏర్పడినాక అది పార్టీకి అతీతంగా ప్రవర్తించాలి. అన్ని వర్గాలకీ ప్రాంతాలకీ బాధ్యత వహించాలి. ఆ బాధ్యత మరిచిన నాడు ప్రజలకే కాదు, క్రమంగా ప్రభుత్వానికీ కష్టాలు మొదలవుతాయి.'

పాదయాత్ర విజయవంతమైంది. ఈ క్రమంలో అమరావతే ఏకైక రాజధానిగా నిలుస్తుందా? ఏమో. అంతకు ముందే హైకోర్టులో ఎదురుదెబ్బ తగులుతుందనే ఉద్దేశంతో అవకతవకల మూడు రాజధానుల బిల్లును వెనక్కి తీసుకొంటున్నట్టు ప్రభుత్వం ప్రకటించింది.

ఇంటికి తిరిగి వచ్చినాక ఆ విశేషాలన్నీ చెప్పాడు వసంత్. రవి ఒళ్లో కూర్చున్నప్పుడు అడిగాడు, 'నానా! అనంతారం గట్టు చుట్టూ ఆ కొండచిలువ ఎందుకుంది?'

ఏం చెప్పాలో అర్థం కాలేదు. నిట్టూర్చాడు. 'ఈ అడవులు మాయమైతే కొండచిలువా మాయమౌతుంది' అన్నాడు. రవికి అర్థం కాలేదు. ఆ రాత్రి ఉద్వేగంలో డైరీలో ఒక కవిత రాసుకొన్నాడు.

ప్రకృతే కాదు ప్రభుత్వాలు కూడా
అప్పుడప్పుడు 'అడవుల్ని' నిర్మిస్తాయి!
మాయాటవీ సౌందర్యాన్ని ఆరాధిస్తాయి
'అడవుల్ని నిర్మించక' ముందు
అక్కడ పాలకంకులు చల్లగా నవ్వేవి
పాలపిట్టలు పికిలిపిట్టలు పిచ్చికలూ పాడేవి
వాగులూ వంకలూ ఋతుగానం చేసేవి
కొండలు తలలూపేవి
కుంట నీళ్ళు కలుపు తీసే కూలీల దప్పిక తీర్చేవి
నేలతల్లి రోజుకొక పచ్చచీర కట్టేది

అప్పుడొకడు వచ్చాడు
ఆకుపచ్చన కన్ను బూడిద రంగు మిన్ను అని
నమ్మించాడు
ఎదబెట్టిన చేలన్నీ పెను దోకుడుబారతో పరపరా
దోకేశాడు
గొర్రూ గుంటక నాగలి కొడవలి కాడీ మేడీ -
అన్నిటినీ కేంద్రానికి దిష్టి తీసి అవతల పడేశాడు
కళ్ళముందు అదృశ్య ఆకాశహర్మ్యాలు చూపిస్తూ
ప్రపంచస్థాయి కలలు నిర్మించాడు
అప్పుడు వానమబ్బులూ పైరగాలులూ
వలసపోయాయి
పాడిపంటల ద్వంద్వ సమాసంలో
ఒకదానినొకటి రద్దు చేసుకొన్నాయి
వేల కళ్ళల్లో లక్షల ఇంద్రధనుస్సులు మొలిచాయి

కొన్నాళ్ళు వాగుల్లో కోటిరూపాయల నోట్లు ప్రవహించాయి

అంతలో మరొకడు
వంక దండాల వైభవోపేతుడై
రంగు పూసుకొని రంగమెక్కాడు
నవ్వితే నవరత్నాలు రాలేను
ఎడమ చేత్తో ధనదానం కుడి చేత్తో భూగ్రహణం చేసేను
ఇటుకలూ సిమెంట్ ఎలర్జీగా బాధపడేను
ఆకాశ హర్మ్యాల్ని అవహేళన చేసి
ఇంద్రధనుస్సుల్ని ధ్వంసం చేసి
పొంగిపొర్లే ప్రేమతో అతడు
పల్లెల పక్కన రహదారుల పక్కన
కాకులు దూరని కారడవులు పెంచి
అక్కచెల్లెళ్ళకి అరణమిచ్చాడు

అందరి పైన ఇంకొకడు
మహోపన్యాస మహేంద్రజాలికుడు
కోరలూ కొమ్ములూ దాచిన మాయామశ్చీంద్రుడు
అందరివాడుగా అగుపిస్తూ

ఎవరికీ అందని ఎవరికీ చెందని వాడు
అంతిమంగా స్వీయకిరీటానికే బంధితుడు, విధ్వంస
వినోది
నిమ్మకు నీరెత్తినట్టు అన్నీ అలవోకగా గమనిస్తూ
మద మార్మిక దరహాసంతో అడవులు వర్ధిల్లుగాక అని
ఆశీర్వదిస్తూ అక్షింతలు చల్లాడు!

ఇప్పుడు జనం మనస్సుల్లో విస్తరిస్తూ
అడవులే అడవులు!



# దళిత ధిక్కార సౌందర్యం



ఆర్ద్ర వాక్యం. వాదనా శైలి. మానవీయ వ్యాఖ్య. అద్భుత ఊహ. సునిశిత మేథ. జాషువా ఒరవడి. దళిత సాహిత్యంలోని మాదిగ పరిమళం. చివరిదాకా విప్లవోద్యమ అభిమానం.. అన్నీ కలిస్తే ప్రొ. ఎండ్లూరి సుధాకర్.

ఆయన అర్థాంతర మరణం ఒక పెద్ద ఖాళీ. పీడిత కులాల విముక్తి పోరాటాలతోనే దాన్ని భర్తీ చేయగలం.

## నడుస్తున్న కవితా వాక్యం...

**అరసవిల్లి కృష్ణ**

ఎండ్లూరి సుధాకర్ పేరు లోనే విద్యుత్ తరంగమున్నది. మృత్యువు అతని దగ్గరకు చేరేవరకు ఏదో ఆలోచిస్తూ వుండి వుంటాడు.

ఆ ఆలోచనల్లో కవితా రచన వుండవచ్చు. ఇటీవలనే మరణించిన తన సహచరి పుట్ల హేమలత జ్ఞాపకాలు కావొచ్చు. లేదా తన అస్తిత్వ ఎరుక నుండి సామాజికావరణలో వ్యక్తులు నిర్వహించే సృజనాత్మక తలం కావొచ్చు.

వెళ్ళి పోవడం అతనిష్టమేనా? హఠాత్తుగా భూమిని ఖాళీ చేసి అర్ధాంతరంగా తరలి పోవడం అతనికి సంబంధించిన అంశమేనా? నాలుగు దశాబ్దాల సాహిత్య సృజన, అధ్యాప కత్వం మనుషులతో సంభాషణ. అతని రాగద్వేషాలు అతను అన్వేషించిన మానవీయ అంశాలు అతనికి సంబంధించిన వేనా! నడుస్తున్న కవితా వాక్యం చూస్తుండగానే కాగితం లోకి ఇంకి పోతుందా. లేదా కవితా వాక్యం ఎవరి నుండి ఎవరికి బదిలీ అవుతుంది. ఈ అనువర్తనం వెనుక ఎండ్లూరి సుధాకర్ ను నిలబెట్టిన గతి తార్కిక ఆలోచనల చలనం ఏమిటి?

మరణం విషాదం కాదు. తాత్కాలిక భావోద్వేగం వుండవచ్చు. కన్నీరు ఉబికి రావొచ్చు. మానవుని మరణం తర్వాత అతని గురించి నాలుగు మంచి మాటలు గుర్తుచేసుకుంటాం. అతను కళాకారుడయితే లేదా కవి అయితే అతను వ్యక్తికరించిన భావనలు ఉంటాయి. జీవిత కాలంలో అతను పడిన తపన వుంటుంది.

ఎండ్లూరి సుధాకర్ అస్తిత్వ వాద కవి అనే సూత్రీకరణ చేయను. కవిగా ఎండ్లూరి కి పరిమితులు లేవు. పుట్టుక కారణంగా తన అస్తిత్వ మూలాలలో తనని తాను వెతుక్కున్న కవి. ఆ వెతుకులాట , అతనికి మాత్రమే సంబంధించిన విషయం కాదు. అది నిచ్చెన

మెట్ల కులవ్యవస్థలో తన దిగువున ఉన్న మెట్టు ఏమిటి అనేది కవి అన్వేషణ.అది జీవిత కాలం కొనసాగింది. అన్వేషణ అందించిన ఫలితాల పట్ల అతనికి జీవితం చివరివరకూ అసంతృప్తి వున్నది.

కవిగా అతని దృష్టి ప్రగతి శీల, దళిత భావజాలానికి చెందినది కావొచ్చు.ఆ అలలపై అతని రచన కొనసాగవచ్చు. అతని గమనం ఇక్కడే కుంచించుకు పోలేదు. సృజనాత్మక అనుభవంలో తానొక ఎరుకను పొంది వున్నాడు.ఆ అవగాహన క్రమం తన అస్తిత్వ స్పృహ దగ్గరే ఆగకూడదు.దిగువకు ప్రవహించాలి.ఆ బిందువు దగ్గర తనది మాత్రమే చోటు కాదు.అణిచి వేత కులాల నుండి రచయితల సమూహం వుండాలని తపన పడిన కవి.కేవలం మాల,మాదిగ గొంతుకలు మాత్రమే కాదు, అనేక ఉప కులాల నుండి వారి అనుభవాలు నుండి మరింతగా సాహిత్యావరణ విశాలత్వం పొందాలని ఆశించాడు. తన మాటల్లో, ఆచరణలో వారికోసం తన సాహిత్య అన్వేషణ కొనసాగింది. అస్తిత్వ వాద, ప్రాంతీయ వాద నేపధ్యంలో గోసంగి, డక్కలి వారికి ఇంకా ఇలాంటి వారికి ఎలాంటి న్యాయం జరగాలి అనేది వర్తమాన సృజన కారుల ఉమ్మడి అంశం కావాలి.

ఎండ్లూరి సుధాకర్ వ్యక్తిగా తన అస్తిత్వ స్పృహ నుంచి మాట్లాడాడు.కవిగా విశాల ప్రపంచపు వేదనను ఆవిష్కరించాడు.విశాలత్వపు లోచూపు అతని కవిత్వంలో అంతర్లీనంగా వుంటాయి.అతని తీరని తపన గోసంగి వంటి దీర్ఘ కవితకు పునాది.

గోసంగి దీర్ఘ కవితకు పునాది.గోసంగి వర్తమాన కాలానికి సంబంధించిన వస్తువు కాదు.వందలాది సంవత్సరాల క్రితం గోసంగి ఒక వాస్తవం.ఆనాటి వాస్తవాన్ని వర్తమాన కాలానికి అనువర్తనం చేస్తూ లేదా అనుసంధానించి చెప్పడం , కుల ఆధిపత్య భావజాలం కాలం గడుస్తున్న కొలది ఎలా బలపడుతుంది, కవి గోసంగి గురించి మాట్లాడుతున్నా వర్తమానం గురించి చెప్పినట్టుగా వుంది.పదహారవ శతాబ్దపు చీకటి అధ్యాయానికి గోసంగి ప్రతిబింబం. ఇవాల్టి భారతీయ సమాజం ఆ కాలాన్ని దాటి రాలేదు.గడిచిన కాలంలో కుల రహిత సమాజం రూపొందడానికి , అసమానతలు లేని ప్రపంచం ఏర్పడ డానికి అనేక గొంతుకలు మాట్లాడి కాలంలో కలిసి పోయాయి.ఇవాళ గోసంగిని గానం చేసిన కవి అదృశ్యమైనాడు.

అయితే ఏనాటికైనా గోసంగి తన ప్రాసంగితను
కోల్పోతాడా, లేదా అనేది కవి వర్తమాన సమాజం ముందు ఒక ప్రశ్న వుంచాడు. దానికి సమాధానం వెతక వలసి వుంది.

అయిదు వందల సంవత్సరాలుగా
హైందవ లోక అవమానతున్ని
అనుమానితున్ని.

ఈ వ్యక్తీకరణకు ఆగ్రహం లేదా కవిత్వ పరిభాషపై పట్టు వుంటే చాలదు. అనేక పుస్తకాల అధ్యయన శీలత సరిపోదు.జీవితం వుండాలి. దానికి అనుభవం వుండాలి. సమాజపు అంచులలోకి నెట్టి వేసే ఆధిపత్యం పీడక స్వభావం కల సామాజిక చిత్రాన్ని ధ్వంసం చేయాలనే ఆచరణ హృదయంలో ఇంకి పోవాలి. దానికి చాలా జీవితాలు కావాలి. కుల వ్యవస్థను బలోపేతం చేసే రాజకీయ ముఖచిత్రం ఇవాళ నిస్సిగ్గుగా బహిర్గతమవుతున్నది. బహశా కవి ఈ కూడలి దగ్గర నిలబడ్డాడు.

నీళ్ళు మనల్ని
చూచి నవ్వుడల్లా
కన్నీళ్లు పెట్టుకునేవి.

నీటికి మతమున్న దేశంలో
మేము పుట్టడం
నేటికి గొప్ప విషాదం. కవి ఏకాల యవనికపై నిలబడి మాట్లాడుతున్నాడు అనేది, ఏ సందర్భంలో నుంచి గొంతు విప్పుతున్నాడు, ఆ కాలానికి సంబంధించిన వివక్ష తాగే నీటి దగ్గర కూడా రాను, రాను ఎలా వ్యక్తమవుతోంది. నిజానికి గలగలపాలే నదికి మతంతో, వర్గంతో పేచీలేదు. భూమిపై నడయాడు తున్న మానవుని తోనే పేచీ అంతా.

మా కన్నీటి గాధలు
అడగండి గోదావరిని
ఆరా తీయండి కావేరికి

చీకటి చరిత్ర పుటలు విప్పండి. చీకటి ముడులు విప్పడానికి కవి జీవన అనుభవం ముందు నిలబడ్డాడు. తరతరాలు పడిన దుఃఖాంతికి సమాధానాలు వెతుకుతున్నాడు. ఆదుఃఖం వెతుకులాట ఒక జాతికి సంబంధించినది.మానవ జీవితం లో భాగం కావాల్సిన నది ఆధిపత్య కులాల సంగమంగా మారడం మానవుడు చేసిన అతిపెద్ద కుట్ర.

నాకు తోలు చొక్కా లే గాని
పట్టు వస్త్రాలేవి.
చిరిగిన కొంగు లే కాని
చక్కని కోకలేవి
నూలు బట్టలేవి
బిళ్ళ గోచీ తప్ప
నా మానం కప్పుకోవడానికి

మా తాత తిన్న బొచ్చు లోనే
మా తరాలన్ని తిన్నాయి.
మా పూర్వీకుల గుడిసెల్లో నే
మా వంశాలన్నీ ఊపిరి పీల్చు కున్నాయి
కాదు నాది వైదిక సంస్కృతి
నాది గోసంగి రీతి.

ఎండ్లూరి సుధాకర్ కవితా రచనలో రెండు పార్శ్వాలుంటాయి. వర్గ, కుల ఆధిపత్య ధిక్కారముంటుంది. భారత సమాజంలో అంతరాలు లేని కాలాన్ని, ఆకాలం ఏర్పడడానికి కావాల్సిన ప్రాతిపదికను ఎండ్లూరి ఎంచుకున్నారు. ఇవాళ కవి భౌతికంగా లేరు. జీవించిన కాలమంతా అంతరాలు లేని సమాజం రావడానికి ఏం మాట్లాడాలో, మాట్లాడుతూ వెళ్లిపోయాడు.

ఇది గోసంగికి సంబంధించినది మాత్రమే కాదు. కులం యొక్క అస్తిత్వం విస్తృతి చెందుతున్న కాలంలో గోసంగి గురించి మాట్లాడటం ఒక సందర్భం మాత్రమే. కవి లేని ప్రపంచం, కవి జీవించిన కాలం కవి దర్శించే సమాజం. సాధ్యం కావడానికి మాదిగ ఉపకులాల నుంచి రచయితలు లేదా ఆలోచనాపరులు రావాలని ఆశించారు. ఒక జీవిత కాలపు వెతుకులాట. అదే సమయాన కులరహిత సమాజం కావాలని ఆకాంక్షించారు. ఒకే విలువ వున్న మనుషులతో ఏర్పడే ప్రపంచం కవి ఆకాంక్ష. ఎండ్లూరి భౌతిక నిష్క్రమణకు ముగింపు లేదు. అతని అన్వేషణ కొనసాగుతుంది.



# 'కొత్త గబ్బిలం' వొక నిర్దిష్ట రాజకీయ ప్రకటన

ఏకే ప్రభాకర్

నిన్నటి చరిత్ర బొటనవేళ్ళనే కోసింది
వర్తమానం ఐదువేళ్లనీ నరికేస్తుంది
... ... ...
మాకిప్పుడు కావలసింది నెత్తుటి రొక్కం కాదు
మాకేం కావాలో కోరుకునే నిర్భయగొంతుక
కొత్తరాజ్యాంగం కొత్తదేశం కొత్తభూమి కొత్తఆకాశం
(ఎండ్లూరి సుధాకర్)

'వర్తమాన' కవి ఎండ్లూరి సుధాకర్ తన కలల రాజ్యానికి కొత్త సూత్రం వెతుక్కునే క్రమంలోనే కొత్త గబ్బిలం ఆవిర్భవించింది. శీర్షిక ద్వారా 'దళిత వర్గ జ్వలన్మూర్తి' కవితాత్మను ఆవాహన చేసుకున్నప్పటికీ కొత్త గబ్బిలం జాషువాకి అనుకరణ కాదు అనుసరణ కాదు. దీని స్వరం వేరు, సరణి వేరు. ప్రక్రియ వేరు, ప్రతిక్రియ వేరు. పాత గబ్బిలం నుంచి స్ఫూర్తిని మాత్రమే అది స్వీకరించింది. రూప సారాల్లో పూర్తిగా భిన్నం. అవమానాల నిషిద్ధ భూమిలో మనుషులుగా (నూతన మానవులుగా) రూపొందే దళిత జాతికి అన్ని విధాలా కొత్త గబ్బిలం ఆధునిక ఆయుధం. అత్యాధునిక ప్రేరణ. ఈ దేశపు శ్వేతపత్రం మీద కుర్ర గబ్బిలం నల్ల సంతకం చేసింది. పోరాడే వాడికి పోయేదేమీ లేదని తిరుగులేని మానిఫెస్టో ఇచ్చింది.

జాషువా గబ్బిలం పాత కవి సమయాలపై నిరసన. ఎండ్లూరి సుధాకర్ కొత్త గబ్బిలం సమస్త ఆధిపత్యాలపై సంధించిన ధిక్కారం. అనేక సందర్భాల్లో అది అధిక్షేపాత్మకమైన వ్యంగ్యాస్త్రం కూడా. తలకిందులుగా వేలాడిన పాత గబ్బిలంలో కవి గొంతు ఆవేదనతో పలికితే కొత్త గబ్బిలంలోని ఆధునిక కవి గొంతు ఆగ్రహాన్ని ప్రతిధ్వనించి ఆత్మగౌరవ ప్రకటనగా రూపుదాల్చింది. జాషువా దేవుడికి ఆర్తితో ఆత్మ నివేదన చేసుకున్నాడు. సుధాకర్ ఉద్యమ స్వరానికి క్రోధోద్రిక్త నినాదం అందించాడు. 'ఆగ్రహం రాని అక్షరం జ్వలించదనీ ఆర్ద్రత లేని వాక్యం ఫలించదనీ అనుభవం నేర్పిన కవిత్వ పాఠాన్ని' అతను పునర్నిర్వచించాడు. జాషువా వొక సామాజిక దుఃఖాన్ని 'గబ్బిలం'గా మలిస్తే సుధాకర్ రాజకీయ ఉద్యమ చైతన్యాన్ని 'కొత్త గబ్బిలం'గా నిర్మించాడు. జాషువా ఎక్కడో తంజావూరుకు దక్షిణ భాగంనుంచి ఉత్తరాన వున్న కాశీకో కైలాసానికో సందేశం పంపితే సుధాకర్ తనకూ మనకూ తెలిసిన పరిసరాల గురించి మాట్లాడి స్థానికత పరిమళం అద్దాడు. తక్షణ దీర్ఘకాలిక ప్రజా పోరాటాల ఎజెండాను సమకూర్చాడు. దండోరా అందించిన ప్రతిఘటనాత్మక చైతన్యం యీ కావ్యానికి ఊపిరి. అక్షరాల ముట్టడి యీ దీర్ఘ కవిత. దళిత అస్తిత్వమే సుధాకర్ సాహిత్యానికి ప్రాణవాయువు అయినప్పటికీ కేవలం దళిత కవిగా అతణ్ణి కుదించలేం అనడానికి కొత్త గబ్బిలం కవిత మరో వుదాహరణ. జాషువాలాగానే అతను విశ్వ నరుడు. మతాతీత కులాతీత సమతా దేశం అతని స్వప్నం. మనిషి మనిషిగా బతికే సాంఘిక సమానత్వం అతని సందేశం.

కొత్త గబ్బిలం అనేక పొరల కావ్యం. దళిత అస్తిత్వ పోరాటం, దానిలోని ఉపకుల మాదిగ అస్తిత్వ చేతన, ప్రాంతీయతా స్పృహ, సామాజిక న్యాయం, రాజ్యాధికార చైతన్యం, వైవిధ్య భరితమైన నగర జీవన సంస్కృతి, బాల్య స్మృతి... వంటి అనేక సామాజిక రాజకీయ వైయక్తిక జీవిత పార్శ్వాల్ని పునరుక్తికి తావులేకుండా వొకచోటే రాశిపోసినట్టు భిన్న వుద్వేగాలు వొక్కసారే ముప్పిరిగొన్నట్టు కవిత అంతటా అనేక పాయల్లో వొక వుమ్మడి చైతన్యం పొంగి ప్రవహిస్తుంది. దాని చలనంలో ఉద్వేలమైన ఉరవడి వుంది. గమనంలో గహనమైన గాంభీర్యం వుంది. ఉక్తి వైచిత్రి వుంది. ప్రయోగ వైవిధ్యం వుంది. అందుకే అది నిత్య ప్రాసంగికంగా వుంది.

వర్తమాన కవికి గతంతోనే కాదు వర్తమానంతో కూడా పేచీయే. వర్తమానంలోని అస్తవ్యస్తతల పట్ల అపసవ్యతల పట్ల అసమానతల పట్ల అతను అసహనం ప్రకటించాడు. సామాజిక న్యాయం కోసం నినదించాడు. కారంచేడు చుండూరు దాడులు వేంపెంట నెత్తుటి మంటలూ ఇకపై జరగడానికి వీల్లేదని ఎలుగెత్తి చెప్పాడు. జాతి భవిష్యత్తుపై గొప్ప విశ్వాసాన్ని అందించాడు. ఆ భరోసా ఇవ్వడానికి అతను కొత్త భాషనీ ప్రతీకల్నీ వ్యక్తీకరణ రీతుల్నీ స్వీకరించాడు. పాతని నిరాకరించే ఆధునిక ప్రతీకల్ని ఎన్నింటినో సమకూర్చుకున్నాడు. చెప్పులు కుట్టే ఆది జాంబవుల చర్మ కళా నైపుణ్యంలోనే కవిత్వ నిర్మాణ రహస్యం యిమిడి వుందని డప్పు కొట్టి ఘంటాపథంగా చాటింపు వేశాడు. డప్పు చెప్పు చిర్రా చిటికెన పుల్లా ఆరె గూటం లంద సుధాకర్ కవిత్వంలో కొత్త అర్థాలు తొడుక్కున్నాయి. పోరాట రూపం ధరించాయి.

గబ్బిలాన్ని రాబోయే భవిష్యత్తుకి సూచనగా, రాజ్యాధికారాన్ని సాధించే దళిత ఉద్యమానికి ప్రతినిధిగా భావించాడు. తన్ను తాను గబ్బిలంలో చూసుకున్నాడు. తన తల్లిని చూశాడు. కొత్త గబ్బిలం తన జాతికి ప్రతీకగా భావించాడు. దాన్నొక బ్లాక్ సూపర్ మేన్ గా సంభావించి ఎల్లలు దాటించాడు.

అనేక సందర్భాల్లో ఎండ్లూరి వర్గీకరణం ద్వారా దళితుల మధ్య ఐక్యతనే కోరుకున్నాడు. మాల మాదిగల మధ్య నిలిచి వుండాల్సిన బాంధవ్యాన్ని పదే పదే గుర్తుచేశాడు. ఆ క్రమంలో 'పేటకీ గూడేనికీ పేగు ముడేద్దాం' అంటూ తహతహలాడాడు.

వర్గీకరణ వ్యాకరణంలో

కొత్త సంధి కుదరాలి
వైరి సమాసం లేని
ఏకవాక్యం రాయాలి
ఎబిసిడి దీపాల్ని ఆర్పవద్దని వేడుకున్నాడు.

కొత్త గబ్బిలం ద్వారా రాజమహేంద్రవరానికీ భాగ్యనగారానికీ సుధాకర్ సాంస్కృతిక వారధి కట్టాడు. తాను ఆబాల్యం తిరుగాడిన హైదరాబాద్ నగరాన్ని గానీ తనకు పౌరసత్వం యిచ్చి ఆదరించిన రాణ్మహేంద్రవరాన్ని గానీ నిండు గుండెతో ప్రేమించినప్పటికీ రెండు జీవన విధానాల్లోని వైరుధ్యాల్ని నిశితమైన విమర్శకు గురిచేశాడు. 'కులం కలుగులోంచి బయటకు రాని ఎంగ్రి రాజమండ్రి' అన్న ధైర్యంతోనే సాయంకాలపు భాగ్య నగరాన్ని 'నకిలీ రంగుల రికార్డింగ్ డ్యాన్సర్'తో పోల్చాడు. నగరంలో స్నేహాలకు అవసరాలే కొలబద్దలు అనీ కోనసీమ గండుచీమ కూడా గౌరవంగా కుడుతుందనీ నిష్ఠుర సత్యాన్ని సున్నితంగా నిర్మోమాటంగా చెప్పగలిగాడు. ఇటువంటి నిర్భీతి నిజాయతీలతో కూడిన ప్రకటనలు కవిత నిండా అనేకం కనిపిస్తాయి. నఖరాలు చేసే నంగనాచి నగరంలోనూ, వేషం మార్చిన వెయ్యేళ్ళ అగ్రహారం రాజమహేంద్రవరంలోనూ రెండు చోట్లా వ్యాపారభాషనే అతను విన్నాడు. ఇటువంటి ముక్కుసూటితనం వల్ల దాచిపెట్టి చెప్పే లౌక్యం లేనందువల్ల సుధాకర్ కొందరి ఆగ్రహాన్ని సైతం చవిచూశాడేమో! అయినా తాను చెప్పదలచుకున్న దానితో ఎక్కడా రాజీపడలేదు. ప్రభువు కళ్ళుగప్పి నయనర్మ 'గర్భం'గా సిస్టర్లని వేధించే కామాతురులైన ఫాదర్లనీ త్రిశూలాలు ధరించి వీధుల్లో విశృంఖలంగా తిరిగే మతమౌఢ్య కమలదళాల్నీ సమానంగా ఏకిపెట్టాడు.

నగరాన్ని నిర్మించిన శ్రమశక్తుల్ని సుధాకర్ ప్రేమించాడు. సికింద్రాబాద్ ఆల్ఫా హెూటల్ నుంచి పురానా షహర్ చార్మినార్ మదీనా వరకూ హుస్సేన్ సాగర్ బుద్ధి విగ్రహం సాక్షిగా ఆకాశ మార్గాన్ని గీశాడు. ఆ దారి పొడవునా కనిపించే వాస్తవ జీవన దృశ్యాల్ని విహంగ వీక్షణం చేశాడు. అపురూపమైన నగర చరిత్రని తలకెత్తుకున్నప్పటికీ దాని సాంస్కృతిక వైవిధ్యాన్ని తనివితీరా వున్నతీకరించాడు. అది నవాబుల కీర్తి గానం ఎంతమాత్రం కాదు. జీవిక కోసం నగరాన్ని ఆశ్రయించిన వడ్డెర్లు మన్నారోళ్ళు మంగలు ్ళ దోభీలు యాదవులు.. యిలా శరీర కష్టం నమ్ముకున్న సహస్ర వృత్తి కులాల వారూ కొత్త గబ్బిలం కావ్యంలోకి ఎదురెక్కారు. బాల్యాన్ని నెమరువేసుకునే నెవంతో నగరం తొడుక్కున్న వేలిముసుగు తొలగించి దాని విషాద బీభత్స ముఖాన్ని ఆవిష్కరించాడు. ఆ క్రమంలో నగరం పేవ్మెంట్ల మీదా వంతెనల కిందా యిరుకు గల్లీల్లో చీకటి తావుల్లో బడుగు జీవుల బతుకు పోరాటానికి మద్దతు పలికాడు. ఆకలి మరక మొకాలతో దీపదగ్ధ దేహాలతో మెహిందీ గల్లీల కీనీడల్లో సంచరించే స్త్రీల దుఃఖాన్ని పంచుకున్నాడు. బురఖాల వెనక దాగి వున్న బూబమ్మల బాధల గాధలు విన్నాడు. లష్కర్ బోనాల జాతరలో పచ్చి కుండ మీద రంగ మెక్కి శివాలూగి భవిష్యవాణి వినిపించి చివరికి చివికిపోయి గుడ్డిదై గుడి మెట్ల మీద బిచ్చమెత్తుకునే ఎల్లమ్మ దైన్యాన్ని చూసి చలించిపోయాడు. నగర వీధుల్లో మసిబారిన పసి బాలల మొఖాలపై కన్నీటి చారికలు తుడిచాడు.

శ్మశాన వాటికల్లో కల్లు పాకల మధ్య వినిపించే/ కనిపించే కాటి సీను పద్యాల నుంచో పోచయ్య తాత తత్వగీతాల నుంచో సుధాకర్ జీవన తాత్వికతని పిండుకుంటాడు. నగర సంపదని దోచుకునే నయా దొరతనాన్ని నిరసించాడు. 'నగర బాలిక సామ్రాజ్యవాద శిబిరానికి ప్రైవేటు కెళ్తుంది' అన్నప్పుడు ప్రపంచీకరణ వైపరీత్యంలో నగర సంపద చలనాన్ని అతను ఎంత సూక్ష్మంగా పరిశీలించాడో అర్థమౌతుంది.

తల్లి తెలంగాణపై తన ఎనలేని ప్రేమని సందర్భం వచ్చినప్పుడల్లా ప్రకటించాడు. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటానికి బీజాలు వేసిన చిట్యాల ఐలమ్మ బందగీలను స్మరించుకున్నాడు. హైదరాబాద్ మార్గంలో పోరాటాల గుమ్మానికి చెందిన అభ్యుదయ రచయితలు దాశరథి కౌముది దగ్గర్నుంచి పోరుగల్లు భక్త కవులు పాల్కురికి సోమన పోతనల వరకూ ప్రతి సాంస్కృతిక చేతనకూ ప్రణమిల్లి అంజలి ఘటించాడు. రక్తస్పర్శ కవుల నుంచి తిరగబడు చేతనావర్తన కవుల దాకా ఎవరూ అతని దృష్టి నుంచి తప్పుకుపోలేదు.

విజయవాడ దాటగానే తెలంగాణా పొలిమేరలు
చీకట్లో పులి కళ్ళయి మెరుస్తుంటాయి
అక్కడి గరికపోచల్లోంచి
పోరాట గాథలు తుడుం మోతలో వినపడుతుంటాయి
ఇవాళ తెలంగాణా కోట్ల గొంతుల విప్లవ వీణ
ఇవాళ తెలంగాణా నిత్య హింసల నెత్తుటి కోన

అన్నప్పుడు సుధాకర్ యీ నేల మీద విస్ఫోటనం చెందిన విప్లవోద్యమాన్ని గుండెకు హత్తుకున్నాడు. బూటకపు ఎన్కౌంటర్లతో దాన్ని నెత్తుటిలో ముంచిన పాలకుల దుర్మార్గాన్ని నిరసించాడు.

భాగ్యనగరంలో అభాగ్యుల గుడిసెల్ని మింగి అపార్ట్మెంట్లకు చుట్టుకున్న కోస్తా కొండచిలువల్ని సుధాకర్ చాలా మంది కన్నా ముందుగానే పసిగట్టాడు. మలిదశ రాష్ట్రోద్యమం తొలిరోజుల తెలంగాణ ఆత్మని అతను ఆవిష్కరించాడు.



దళితుల్లోని క్రీమీ లేయర్ తమ మూలాల్ని మరచి జాతి ద్రోహులుగా మారిన వైనాన్ని నిర్ద్వంద్వంగా ఖండించాడు. బంజారా జుబ్లీ హిల్స్ లో ఎదిగిన 'అంటరాని వేదల్ని' చూసి ఆశ్చర్యపోయాడు. ఆర్థిక సంబంధాలు మానవ సంబంధాల్నీ కుటుంబ సంబంధాల్నే కాదు కుల సంబంధాల్ని కూడా నిర్ధారిస్తాయి అని రూపాయి సాక్షిగా రుజువు చేశాడు.

దళిత ఉద్యమాన్ని, దండోరా ఉద్యమాన్ని సైతం కొత్త గబ్బిలంలో సుధాకర్ విమర్శనాత్మకంగా పరిశీలించాడు. రెండు మూడు అక్షరాల మర్మాన్ని విప్పిచెప్పాడు. ఉభయకవి మిత్రులు విసంధుల్లా విడిపోతున్నారని తల్లడిల్లేడు. రాజకీయ హైటెక్కుల పెన్మాయల జంతర మంతరాల్లో దండోరా దృష్టి 'మంద'గిస్తుందని వాపోయాడు. ఆత్మగౌరవానికి ప్రతీక అయిన డప్పు డబ్బులకు అమ్ముడుపోకూడదని కోరుకున్నాడు. పాతికేళ్ల క్రితం సుధాకర్ చేసిన హెచ్చరికలు యివ్వాల్టికీ ప్రాసంగికంగా వున్నాయి. దళిత నియంతల్ని 'మంద'లించాడు. దండోరా నాయకుల మధ్య తలెత్తిన వైరుధ్యాల్ని ప్రస్తావిస్తూ 'నాయకులంటే సిర్రా సిటికెన పుల్లల్లా వుండాల'ని ప్రబోధించాడు. తను నడిచే వుద్యమాన్ని విమర్శనాత్మకంగా విశ్లేషించడమే కాదుబీ అవసరమైతే వుద్యమాచరణలో సమూలమైన మార్పుని సైతం ప్రతిపాదించాడు. కొత్త డప్పుకు కాక పెట్టాలని ఆలంకారికంగా సూచించాడు.

శైశవ దృశ్యాల్ని ఎండ్లూరి తన రచనకు అలంకారశాస్త్రంగా భావించినప్పటికీ ఈ కావ్యం పూర్తిగా బాల్య స్మృతుల నాస్టాల్జియా కాదు. నగరం చుట్టూ కొత్త గబ్బిలం తిరిగినప్పటికీ నగరం ప్రధాన కావ్య వస్తువు కాదు. దాని అంతస్సూత్రం/సారం దళితోద్యమానికి దిశానిర్దేశమే. నగర జీవితంలో కనుమరుగయ్యే మానవీయ స్పందనల గురించి అతను అడుగడుగునా అప్రమత్తం చేశాడు.

'మనమంతా హిందువులం గంగాజల బిందువులం మనమంతా బంధువులం' అనే కాషాయం మూక నినాదాన్ని సుధాకర్ బలంగా గర్హించాడు. మేము మీకు ఎప్పటినుంచి బంధువులం ఎలా హిందువులం అని ప్రశ్నించి అంబేత్కరవాలం ఝుళిపించి జై భీమ్ అని గర్జించాడు. అయితే ఆ కరవాలం మార్క్సిజం వొరలో కూడా యిముడుతుందని/యిమడాలనీ అతను ఆశించాడు. ఒకచోట గాయపడిన గద్దర్ కాళ్ళకి నల్ల గజ్జెలు కట్టాలంటాడు. లాల్ నీల్ వర్ణ సమ్మేళనాన్ని అన్యాపదేశంగా ప్రస్తావించాడు.

అంతేకాదు, సుధాకర్ భిన్న సందర్భాల్లో హిందూ నాగరికతకు చిందు నాగరికతని పోటీగా నిలబెట్టాడు. 'దళితుల మర్మాంగాలూ దేహాంగాలూ భద్రంగా వుండే ఏదైనా ఒక కొత్త దేశాన్ని సృష్టించుకోవాలనుంది, ఆత్మ గౌరవంగా బతకాలనుంది' అంటాడు మరోచోట. భూమ్యాకాశాల మధ్య ఆకలి అవమానాలు లేకుండా జీవించే చారెడు నేలని దానిపై అధికారాన్ని అతను ఆకాంక్షించాడు. నగర జీవితాన్ని సైతం ఎండ్లూరి దళిత పార్శ్వంలో నుంచే చూశాడు. దళిత సామాజికతకు మాదిగ తత్వాన్ని జోడించాడు. దాన్ని దండోరా చైతన్యంలోకి అనువదించాడు. వర్గీకరణ ద్వారా సామాజిక న్యాయాన్ని కోరాడు.

మాల మాదిగలే యీ దేశ మూలవాసులు అని నిరూపించాడు. మాదిగ ఆత్మగౌరవ పోరాటంగా మొదలైన దండోరా వుద్యమం యస్సీల్లో ఎబిసిడిల వర్గీకరణకు పరిమితం కాకుండా రాజ్యాధికార సాధన దిశగా సాగాల్సిన అవసరం వుందని నిర్దేశించాడు. అందుకు 'అన్ని వర్ణాలు ఆర్థికంగా విలీనం కావాల'ని సూత్రీకరించాడు. వర్ణం వర్గం యీ రెండింటి మధ్య వున్న/వుండాల్సిన సంబంధాన్ని పసిగట్టాడు. కుల పోరాటాల్ని ఆర్థిక పోరాటాలతో ముడివేయాల్సిన అవసరాన్ని గుర్తించాడు. పునాది ఉపరితలాల చర్చకు విశాలమైన వేదికను నిర్మిస్తూ వొక విధంగా ఎండ్లూరి సుధాకర్ యీ దీర్ఘ కవిత ద్వారా నిర్దిష్టంగా విస్పష్టమైన రాజకీయ ప్రకటన చేశాడు. అంతిమంగా పీడిత జాతి విముక్తి మార్గాన్ని లక్ష్యించాడు. కొత్త గబ్బిలం ఫలశృతి అదే.

ఎండ్లూరి సుధాకర్ రచనా ప్రస్థానంలో కొత్త గబ్బిలం ఒక ముఖ్యమైన మలుపు.

('కలుద్దాం' అని నమ్మబలికి ఎప్పటికీ కలవకుండానే వెళ్ళిపోయిన సుధాకర్ మీద కోపంతో...)



---

(3వ పేజీ తరువాయి..)

పాతాళం అడుగునుంచి ఉబికిన చమురు ఒక దశాబ్దకాలంలోనే తిరిగి ఆధిపత్య ప్రపంచంలోకి తెచ్చి నిలిపింది. వ్యవసాయ రంగమూ కోలుకుంది. అదే సమయంలో 2008 నాటి ఆర్థిక సంక్షోభం నుంచి అమెరికా ఇంకా తెప్పరిల్లలేదు. చమురు తెచ్చిన సిరి రష్యా ప్రభావాన్ని పశ్చిమ యూరప్‌లోకి విస్తరిస్తే, అమెరికాకు తన ఆధిపత్యం నిలుపుకోవడమే కష్టమైపోయింది. రష్యా నుంచి ఈ దేశాలకు వెళ్లే చమురు సరఫరాలు ప్రధానంగా సోవియట్ పూర్వ దేశం ఉక్రేయిన్ మీదుగా వెళుతున్నాయి. ఉక్రేయిన్‌ను తన గుప్పిట్లో పెట్టుకుంటే రష్యాను కొంతమేర నిలువరించవచ్చునని అమెరికా ఎత్తు వేసింది. అనుకున్నట్టే 2014 ఎన్నికల్లో తన తైనాతీని అక్కడ అధ్యక్షుడిని చేసింది. అక్కడినుంచి చమురు సరఫరాలో రష్యాకు ఉక్రేయిన్ నుంచి తలనొప్పులు మొదలయ్యాయి. నాటోలో చేరడానికి ఉక్రేయిన్ సిద్ధమవడం రష్యాను మరింత కలవరపెట్టింది. యుద్ధానికి వీటిని తక్షణ కారణాలుగా పుతిన్ చెబుతున్నారు. అయితే, ఇది అర్ధసత్యం మాత్రమే.

అతనిలోని విస్తరణవాద కాంక్షకు ఇవన్నీ బాగా కలిసి వచ్చాయనేదే అసలు వాస్తవం. రష్యాకు ఇప్పుడు నీతులు చెబుతున్న అమెరికా ఇస్లామిక్ చమురు దేశాల విషయంలో ఇందుకు భిన్నంగా ఏమీ వ్యవహరించడం లేదనేది మనకు తెలిసిందే.

ఉక్రేయిన్ నుంచి ఒకనాడు క్రిమియాను, ఇప్పుడు డాన్‌బాస్‌లోని కొన్ని భూభాగాలను లాగేసుకున్న రష్యా చర్యను అందరం ఖండించాలి. దుస్సాహసానికి లోనుకానంతమేరకు ఉక్రేనియన్ల జాతీయవాదాన్ని సమర్థించాల్సిందే. అధికార రాజకీయ వ్యవస్థలోని వైవిధ్యతో, వైరుధ్యతో ఒకదేశంపై మరో దేశం దురాక్రమణపై మన వైఖరిని నిర్దేశించలేవు. అఫ్ఘాన్‌పై రష్యా దాడిని ఖండించి సోషల్ సామ్రాజ్యవాదంపై గొంతెత్తిన గతమే వర్తమానంలో మనకు దారిదీపం. యుద్ధాలు లేని భవిష్యత్తును సామ్రాజ్యవాద పతనంతోనే సకల మానవులు సాధించుకుంటారని నినదించడానికి తరుణమిదే!



# మౌలిక పరిశోధన

రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

**"పద్య కవిత్వంలో ఆధునికతను ప్రదర్శించినవాడు జాషువా సంప్రదాయంలో నుండి ఆధునికతలోకి దృష్టి సారించిన వినూత్న ప్రయోగవాది జాషువా"**
**పు 13 (ఎండ్లూరి : జాషువ సాహిత్యం -దృక్పథం -పరిణామం)**

విశ్వవిద్యాలయాలలో తెలుగు భాషా సాహిత్య పరిశోధన చరిత్రకు వందేళ్లు సమీపిస్తున్నాయి. ఈ కాలంలో కొన్ని వేలమంది పరిశోధకులు సిద్ధాంత గ్రంథాలు రచించి డాక్టరేట్లు పొందారు. అయితే ఆ వేల కొలది సిద్ధాంత గ్రంథాలన్నీ అచ్చుకాలేదు. అచ్చైనవి తక్కువ, కానివి ఎక్కువ. ఈ పరిశోధకులలో పరిశోధన చేసే కాలానికే పరిణతి చెందిన సాహితీపరులు కొందరుకాగా పరిశోధన కాలానికి రాయడం నేర్చుకుంటున్న వాళ్లు అనేకులు. పరిశోధనను ఒక జ్ఞాన అవసరంగా, సామాజిక అవసరంగా చేసిన వాళ్ళు కొందరైతే, పరిశోధనను ఒక జీవిక అవసరంగా చేసిన వాళ్ళు ఇంకొందరు. అలాగే ఈ పరిశోధకులలో సాంఘికంగా, ఆర్థికంగా వడ్డించిన విస్తరిలాంటి జీవితం గల వాళ్లు కొందరైతే, వాళ్ల వంట వాళ్లే వండుకోవలసిన వాళ్లు కొందరు. పరిశోధకుల మధ్య అనేక అంతరాలు ప్రభావం చూపిస్తూ ఉంటాయి. ఇదిలా ఉంచుదాం.

అచ్చవుతున్న సిద్ధాంత గ్రంథాలన్నీ గొప్పవి అనీ, అచ్చుకానివి పనికిరానివీ అని అనుకోవడానికి వీలులేదు. అచ్చయినా, కాకపోయినా ప్రామాణికమైనవీ, ప్రామాణికం కానివీ అని సిద్ధాంత గ్రంథాలు రెండు రకాలుగా ఉంటాయి. మౌలికమైన పరిశోధనా స్వభావం కలిగి, తర్వాతి పరిశోధనలకు మర్గదర్శకంగా నిలిచేవి ప్రామాణిక సిద్ధాంత గ్రంథాలు. తక్కినవి ప్రామాణికాలు కావు. అలా తదనంతర పరిశోధనలకు ఆధార గ్రంథాలుగా, ఆకర గ్రంథాలుగా నిలబడిన తెలుగు సిద్ధాంత గ్రంథాలు చాలా తక్కువ.

గుర్రం జాషువా ఆధునిక పద్య కవులలో విభిన్నమైన కవి. విశిష్టమైన కవి. వెయ్యేళ్ల చరిత్ర గల తెలుగు పద్యాన్ని మరణించే దాకా రాసి తన స్వీయ ప్రతిభను చాటుకొన్న కవి. 20వ శతాబ్దంలో భావ కవులు ప్రవేశపెట్టిన ఖండకావ్య ప్రక్రియను, భావ కవులవలె ఎవరికి తెలియని ఏవో పాటలు పాడడానికి కాకుండా సామాజిక వాస్తవాలను ఆవిష్కరించడానికి ఉపయోగించుకున్నారు. ప్రాచీన కవులంతా ఉన్నత స్థానానికి తీసుకుపోయిన తెలుగు పద్యాన్ని ఆధునిక కాలంలో పౌరాణిక కవులు మళ్లీ అనువాదాలకు, అను సృజనలకు వాహికగా చేసుకోగా - జాషువా సాంఘిక కావ్య నిర్మాణానికి బలమైన అభివ్యక్తి సాధనంగా ఉపయోగించుకున్నారు. బహుశా ఆయన సనాతన, పునరుద్ధరణ వాదులతో పోటీపడి పద్య శిల్పాన్ని చెక్కారు. ఆధునిక జీవిత ఆవిష్కరణకు పద్యాన్ని ఎలా ఉపయోగించుకోవచ్చునో రుజువు చేశారు. వాళ్లతోపోటీ పడడం సరేగానీ, అభ్యుదయ కవిత్వం తీసుకొచ్చిన వచన కవితను నిరాదరించడం జాషువ తనకు తానే విధించుకున్న పరిమితి. ఆయన రాసిన అన్ని రకాల సాహిత్యమూ 1500 పుటలే. కానీ సాహిత్యం మీద వచ్చిన విమర్శ, జరిగిన పరిశోధన 15000 పుటలు ఉంటాయి. ముఖ్యంగా దళిత అస్తిత్వ వాదం మొదలైనాక, అంతకు ముందటికన్నా జాషువాను తెలుగు సమాజం ఎక్కువగా చదివింది. 1990కి ముందున్న జాషువా పాఠకులు వేరు, ఆయన శత జయంతి సందర్భంగా పుట్టుకొచ్చిన ఆ కొత్త పాఠకులు వేరు. జాషువాతోపాటు తెలుగు సాహిత్యరంగంలోకి అడుగుపెట్టిన వారు కొందరు క్రమ క్రమంగా అప్రాసంగికులు కావడం, జాషువను క్రమక్రమంగా ప్రాసంగికత పెరగడం మనం గమనించవచ్చు. 'నిషిద్ధమానవ' సమాజం నుండి పుట్టుకొచ్చిన ప్రసిద్ధ కవి జాషువ.

గుర్రం జాషువా మీద ఎండ్లూరి సుధాకర్‌కన్నా ముందు కనీసం ముగ్గురు పరిశోధకులు పరిశోధించి ఉన్నారు. వారు డా. బి. భాస్కర చౌదరి-1. జాషువా జీవిత కవితా ప్రస్థానము 1981, 2. జాషువా కృతుల సమాలోచన 1985. ఆర్.ఆర్. సుందర్‌రావు-మహాకవి జాషువా వ్యక్తిత్వం-కవిత్వం, డా. సామ్యూల్ సుందరరావు - జాషువా సాహిత్యము - మనవతా వాదము. వీరు కాక అనేక మంది ఆధునిక తెలుగు కవిత్వ చరిత్రకారులు, పరిశోధకులు, విమర్శకులు జాషువను అనేక గ్రంథాలలో, వ్యాసాలలో పరామర్శించి ఉన్నారు. ఎండ్లూరి సుధాకర్ వాటి అన్నిటికీ పరిణత రూపంగా "జాషువా సాహిత్యం - దృక్పథం - పరిణామం" అని తన సిద్ధాంత గ్రంథం రచించారు. సుధాకర్ ప్రధానంగా కవి. ఆ తర్వాత సాహిత్య విమర్శకుడు. ఆచార్య ఆర్‌విఎస్ సుందరంగారి పర్యవేక్షణలో సుధాకర్ 1991-92 నాటి ఈ సిద్ధాంత గ్రంథం రాశారు. ఆ తర్వాత జాషువా మీద పుంఖాను పుంఖంగా విమర్శ గ్రంథాలు, వ్యాసాలు వచ్చాయి. అయినా సుధాకర్ పరిశోధన వన్నె తగ్గకుండా నిలబడి ఉంది.

1994లో అనంతపురంలో జాషువా శత జయంతి కార్యక్రమాలు మూడు రోజులు జరిగాయి. ఆ సమయంలో ఎండ్లూరి పి.హెచ్.డి. పట్టాపొంది ఉన్నారు. సుధాకర్, లక్ష్మీనరసయ్య, జూలూరు గౌరిశంకర్ వంటి అనేక మంది దళిత సాహిత్యోద్యమ కారులు వచ్చారు. సుధాకర్ చేసిన ప్రసంగం అనంతపురం శ్రోతలు ఇంకా మరచిపోలేదు.

కవిగా, పరిశోధకుడుగా ఎండ్లూరి గుర్రం జాషువాను గొప్పగా గౌరవిస్తారు. అయితే అభిప్రాయాలు ప్రకటించేప్పుడు వాస్తవికంగా నిర్మొహమాటంగా మాట్లాడతారు. తన పూర్వ పరిశోధకులు, విమర్శకుల అభిప్రాయాలను జీర్ణించుకొన్న సుధాకర్ తన సిద్ధాంత గ్రంథంలో తనవైన ప్రతిపాదనలు చేశారు.

మొదటి అధ్యాయంలో జాషువా జీవిత సంఘర్షణను వివరించి, ఆయన రచనలను క్లుప్తంగా పరిచయం చేశారు. ఆ పరిచయం అవధాని

కావాలసిన జాషువ ఆధునిక కవిగా ఎలా ఎదిగారో అర్థమౌతుంది. పరిచయమంతా చేసినాక "జాషువా జీవితము, రచనలు వేరు వేరు కాదు. అని ప్రకటించారు. రెండవ అధ్యాయంలో 'జాషువా దృక్పథం' పేరుతో జాషువా దృక్పథాన్ని పది శీర్షికలలో చర్చించారు. ఈ అధ్యాయం ప్రారంభంలోనే జాషువను సామాజిక నిబద్ధతగల కవిగా నిర్వచించారు. భావ కవితా యుగ కవుల్లో ఆయన గొంతు విలక్షణమైనది అని నిర్ధారించారు. జాషువా మీద గాంధీ ప్రభావం ప్రబలంగా ఉందని, అదే సమయంలో అభ్యుదయ భావజాల ప్రభావం కూడా ఉందని గుర్తించారు. జాషువా మత దృక్పథాన్ని చర్చించి, జాషువా మతరహిత సమాజం కోసం తహ తహలాడాడని పేర్కొన్నారు. ప్రారంభంలో ఆస్తికునిగా ఉండిన జాషువాలో 1940-50 దశల మధ్య హేతువాద ప్రభావానికి లోనయ్యారన్నారు. జాషువా కుల దృక్పథాన్ని చర్చిస్తూ "అంబేద్కర్‌లాగా జాషువాది పునాదుల్ని కదిలించే కుల నిర్మూలన కాదు. సర్వకుల సమభావన" అని స్పష్టంచేశారు. రాజకీయంగా జాషువా గాంధేయవాది అని పేర్కొంటూ గాంధీ కవిత్రయంలో జాషువా ఒకరని గుర్తుచేశారు. 1920-47 మధ్య గాంధీజీ ప్రభావానికి లోనైన జాషువాకు 1930-40 మధ్య కాలంలో విప్లవాత్మకంగా వచ్చిన వామపక్షభావాలు కదిలించలేకపోయాయన్నారు. అయితే జాషువా జన జీవిత అవసానదశలో 'కొదువటిటెక్కెము'లో పేద ప్రజల పక్షపాతాన్ని ఒప్పుకున్నారు. దళితుడైన జాషువా దళిత జీవిత వేదనను బలంగా వినిపించాడని సుధాకర్ వివరించారు. "కాని వారి జీవితాల విముక్తి కోసం దోహదపడే రాజకీయ చైతన్యాన్ని మాత్రం స్పృశించలేదు" అని స్పష్టంగా చెప్పారు. గాంధీ ప్రభావం బలంగా ఉండడం వల్ల ఈ పరిమితి ఏర్పడి ఉందని గుర్తించారు.

జాషువా మీద మానవతావా ప్రభావం కూడా ప్రబలంగా ఉందని సుధాకర్ గుర్తించారు. భావ కవుల ప్రణయ కవిత్వ ధోరణికి దూరంగా ఉంటూ జాషువా సామాజిక వాస్తవిక జీవితానికి సంబంధించిన మానవీయ చిత్రణలు చేశారన్నారు. జాషువా కవిత్వంలోని కన్నీటికి, కన్నీటిలోంచి పుట్టిన ఆవేదనకు మూలం మానవతావాద దృక్పథమేనని గట్టిగా ప్రతిపాదించారు సుధాకర్. అయితే జాషువ రాడికల్ హ్యూమనిస్టు కాదన్నారు. 1940కి పూర్వం రాసిన కావ్యాలలో మానవతావాదం, తర్వాత రాసిన కావ్యాలలో నవ్య మానవతావాదం కనిపిస్తాయని పేర్కొన్నారు. జాషువాలో రాయ్‌కన్నా ముందునుంచే మానవతా వాదం కనిపిస్తుందని కూడా చెప్పారు. జాషువ సామాజిక దృక్పథాన్ని వ్యాఖ్యానిస్తూ, సుధాకర్, ఆయన కవితా దృష్టి సమ సమాజ నిర్మాణ భావజాలానికి దగ్గరగా ఉంటుందని, కానీ ఆయనను వామపక్షవాద కవిగా గుర్తించలేమని అన్నారు. "జాషువా రాజకీయాలలో మితవాది, సాంఘికంగా అతివాది" అన్నది సుధాకర్ సిద్ధాంతం. తన పరిధిమేరకు జాషువా ఆర్థిక విప్లవాలను సమర్థించలేదు గానీ, పెట్టుబడిదారి విధానాన్ని , వ్యక్తిగత ఆస్తుల్ని ఆయన నిరసించారనీ సుధాకర్ అభిప్రాయపడ్డారు. సారాంశంలో "జాషువా కవిత్వం ఉపరితలం మీద సామాజిక వేదన చిత్రించగలిగింది గానీ, ఈ సమాజం మార్పుకోసం పునాదుల్ని కదిలించే విప్లవ దృష్టిమాత్రం కాదని భావించాలి" అంటారు.

జాషువా సాహిత్య పరిణామాన్ని సుధాకర్ చారిత్రక క్రమంలో అర్థవంతంగా చర్చించారు. మొదట్లో జాషువా మీద సంప్రదాయ సాహిత్య ప్రభావమే బలంగా ఉండేదని, అందుకే ఆయన సాహిత్య జీవితం అవధానాలతో మొదలైందనీ క్రమంగా ఆయన ఆధునికతవైపు మొగ్గారని వివరించారు. 1915-30 మధ్య జాషువా కవిగా అప్పటి రాజకీయ ఉద్యమాల ప్రభావానికి గురయ్యారని, 1930 తర్వాత ఆయన వాస్తవిక సామాజిక జగత్తును కవిగా పట్టించుకున్నారని సుధాకర్ పేర్కొన్నారు. అనాథ కావ్యం ఆకలిముప్పైల ప్రభావంలో పుట్టిందన్నారు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో జాషువా రచనలను బట్టి, ఆయన దేశభక్తిని శంకించరాదని గుర్తుచేశారు. జాషువా యుద్ధ కవితను ఎంతగా సమర్థించినా "ఒక ప్రజాకవి జాతీయ స్రవంతి నుంచి తాత్కాలికంగానైనా విడివడటం బాధాకరమే" అనడం విశేషం. "ఆర్ద్ర హృదయుడైన జాషువా బ్రిటిష్ యుద్ధ కార్యకలాపాల్లో పాల్గొనడం ఆయనలోని రాజకీయ ఆలోచనా రాహిత్యమే" అనడానికి కూడా సుధాకర్ వెనుకాడలేదు. కాందిశీకుడుతో జాషువా కవితా పరిణామం ఒక దశ దాటిందన్నారు. గబ్బిలం ఆయన కవిత్వ పరిణామంలో మరో దశ అని, ఆ తర్వాత ఆయనలో కొత్త చూపు ప్రవేశించిందని గుర్తించారు. ఈ దారిలోనే సుధాకర్ క్రమంగా కవిగా పరిణామం చెందుతూ వచ్చారని తీర్మానించారు. 'ముసాఫరులు' జాషువా కవిత్వ పరిపక్వతను ఆయన సాహిత్య పరిణామానికి చివరి మలుపు అని నిర్ధారించారు.

జాషువ కవిత్వ లక్షణాలకు ఎండ్లూరి వివరంగా ధృవీకరించారు. జాషువా కవిత్వం ఒక గట్టుకు కట్టబడిఉండదు. ఆయన నిలువెల్లా కవి. తెలుగు పద్యం బలహీనపడుతున్న దశలో జాషువా ప్రాణ ప్రతిష్ఠ చేశారు. జాషువా పారదర్శకతగల కవి వంటి అనేక సూత్రీకరణలు చేశారు. ఇతర కవుల మీద జాషువా ప్రభావాన్ని చర్చిస్తున్నప్పుడు కూడా ఆకర్షణ జాషువ కవిత్వానికి ప్రధాన లక్షణమని, ఆయన పద్య ముద్ర తెలుగులో స్థిరమైనదని, ఆయన పద్యానికి స్వయం కాంతి ఉందని చెబుతూ దాశరథి, కరుణశ్రీ వంటి వారిమీద జాషువా ప్రభావం ఎలా ఉందో రుజువు చేశారు. ఆధునిక తెలుగు సాహిత్యంలో జాషువా స్థానాన్ని కూడా సుధాకర్ చర్చించారు. గ్రంథం చివరలో భావ కవిత్వ కాలంలో భావ కవుల కన్నా భిన్నంగా కవిత్వం రాసిన జాషువా ఒక ప్రత్యేక స్థానాన్ని పొందారని, అదే నవయుగ కవి చక్రవర్తిత్వం అన్నారు. జాషువా కవిగా స్వేచ్ఛావాది అని, ఆయనది సొంతమార్గమని పేర్కొన్నారు. ఆయన ఒక ట్రెండ్ సెట్టర్ అని నిర్వచించారు. జాషువా భవ కవిత్వం నుంచి అనుభూతిని, అభ్యుదయ కవిత్వం నుంచి ఆర్ద్రతను, సామాజిక స్పృహను స్వీకరించారన్నారు. "తెలుగు వినీలాకాశంలో జాషువా ధృవతార"అని గ్రంథాన్ని ముగించారు.

ఎండ్లూరి సుధాకర్‌ది "ఎవరేంచెప్పినా బాగుంది" అనే గిరీశం తత్వంకాదు. తాను పరిశోధిస్తున్న కవి అనో, తన కులానికి చెందిన కవి అనో, తన వాదానికి చెందిన కవి అనో అన్నిటా వెనకేసుక రాలేదు సుధాకర్. జాషువాకున్న బలం, పరిమితి అన్నిటినీ విస్పష్టంగా చెప్పారు. ఇది శాస్త్రీయ అధ్యయనం.

'వైతాళికులు' సంకలనానికి సంపాదకత్వం వహించిన ముద్దుకృష్ణగాని, భావకవితా యుగాన్ని శాసించిన కృష్ణశాస్త్రి గాని వైతాళికుల్లో జాషువాకు స్థానం కల్పించకపోవడం సాహితీ లోకానికి ఒక లోటుగా చెప్పక తప్పదు'

(ఎండ్లూరి : ఈ పుస్తకంలో : పు136 పుట)



# సమసమాజాన్ని కాంక్షించిన వరూధిని గారు

శివలక్ష్మి

1925 లో గుంటూరులో జన్మించిన కొడవటిగంటి వరూధిని గారు 97 సంవత్సరాల వయసులో వృద్ధాప్య సమస్యలతో, అనారోగ్యంతో హైదరాబాద్, కుకట్‌పల్లిలోని 'క్షేమాలయం'లో ఫిబ్రవరి 9 (2022)న మరణించారు. ఆమె కొమ్మూరి పద్మావతి, కొమ్మూరి వెంకట్రామయ్యగార్ల ప్రథమ సంతానం.

వరూధిని గారు సాహిత్యంలో నిష్ణాతులైన కుటుంబంలో పుట్టి పెరిగారు. తల్లి కొమ్మూరి పద్మావతి గారు ప్రఖ్యాత స్టేజ్ నటే గాక, వెండితెర తార కూడా. తండ్రి కొమ్మూరి వెంకట్రామయ్య గారు పేరొందిన పాత్రికేయులు. ఎప్పుడు కలిసినా ఆమె తల్లిగారైన కొమ్మూరి పద్మావతి, పెదనాన్న చలం, డిటెక్టివ్ నవలా రచయితగా సుప్రసిద్ధులైన తమ్ముడు కొమ్మూరి సాంబశివరావు గార్ల గురించిన కబుర్లు చెప్తుండేవారు! మా కుటుంబంలో చలం, కొమ్మూరి సాంబశివరావు కొడవటిగంటి కుటుంబరావు, మా అమ్మాయి శాంతసుందరి, మా అబ్బాయి కొడవటిగంటి రోహిణి ప్రసాద్‌లతో కలిపి అందరూ సాహిత్య సృజన చేసినవారేనని సంతోషంగా చెప్పేవారు!

వరూధిని గారితో నా పరిచయం గురించి చెప్పాలంటే చలసాని ప్రసాద్ అంకుల్ హైదరాబాద్ వచ్చిన ప్రతిసారీ వరూధిని గారిని చూడడానికి వెళ్ళేవాళ్ళం. వివి సర్ అయితే వాళ్ళ పెద్దమ్మాయి సహజ ఇల్లు అమీర్ పేట్‌లో ఉన్నప్పుడు చాలా తరచుగా హేమక్కతో నడుచుకుంటూనే వెళ్ళేవారు! వాళ్లతో పాటు నేనూ అప్పుడప్పుడూ వెళ్ళేదాన్ని. అదీగాక హైదరాబాద్ ఫిల్మ్ క్లబ్‌లో సినిమా కెళ్ళిన ప్రతిసారీ సారథీ స్టుడియో వెనకే నాలుగడుగుల దూరంలోనే ఉన్న వారింటికి మేమిద్దరం వెళ్ళేవాళ్ళం. అలా చాలాసార్లు వరూధిని గారిని కలుస్తుండేవాళ్ళం. నాకున్న సినిమా పిచ్చివల్ల, ఫిల్మ్ క్లబ్ ఉద్యమాల గురించి తెలిశాక ఆరోజుల్లోనే కుటుంబరావు-వరూధినిగార్లు, కాకరాల-కాంతి దంపతులు మద్రాస్ లోనూ, ప్రొఫెసర్ వేణుగోపాలరావు-కృష్ణాబాయి దంపతులు విశాఖపట్నంలోనూ ఫిల్మ్ క్లబ్ ఉద్యమాలను ప్రోత్సహిస్తూ ప్రపంచ ప్రత్యామ్నాయ సినిమాలను చూస్తున్నారని తెలిసి వారి పట్ల గౌరవం, ఆరాధనాభావాలతో గొప్ప ఉత్తేజం కలుగుతుండేది. క్రమంగా పరిచయాలు పెరిగి ఆత్మీయ బంధాలైపోయాయి. వేణూ అంకుల్ నేనూ ఒక ప్రత్యామ్నాయ చిన్న బడ్జెట్ సినిమా తీయడం గురించి తెగ ఆలోచించి కొందరికి కార్డులు రాసి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి మనవల్ల కాదని నిరాశ పడిపోయాం కూడా! అది వేరే సంగతి. ఒకరకంగా సినిమా మమ్మల్ని దగ్గర చేసింది. శాంతసుందరి గారు ఇల్లు మారి దూరంగా వెళ్ళిపోయాక కలయికలు తగ్గిపోయాయి. ఫోన్‌లో పలకరించుకుంటూనే ఉండేవాళ్ళం. వరూధిని గారి క్షేమ సమాచారాలు తెలుసుకుంటూనే ఉండేవాళ్ళం.



ఆమె మొయినాబాద్ హోమ్‌లో ఉన్నప్పుడు చాలా దూరంలో ఉన్నప్పటికీ కూడా రెండు మూడుసార్లు వెళ్ళాం. ఒకసారి కాంతీ-కాకరాల గార్లు, ఇంకోసారి వివి సర్, కాంతీ-కాకరాల గార్లతో వెళ్ళాం. మాతోపాటు డాక్టర్ నళిని కూడా వచ్చిందింకోసారి. వరూధిని గారు మనుషులతో నిదానంగా కలుస్తారు. కొందరు నచ్చిన వ్యక్తులు చలసాని ప్రసాద్ అంకుల్, వివి సర్, కృష్ణాంటీ, కాంతి-కాకరాల గార్లు, నళినీ- శ్రీనివాస్‌లతో మాత్రం బాగా సన్నిహితంగా ఉండేవారు. వాళ్ళతో స్వేచ్ఛగా అభిప్రాయాలను పంచుకుంటూ రాజకీయ సిద్ధాంతాలతోపాటు సాహిత్య, కళా సిద్ధాంతాలు, మంచి సినిమాలు, సాహిత్యం గురించి తరచుగా చర్చించుకుంటుండేవారు. మొయినాబాద్ హోమ్‌లో మాకొకసారి హోమ్ వాళ్ళతో మాట్లాడి భోజనాల ఏర్పాటు చేసి మాతోపాటు ఆమె కూడా భోజనం చేశారు. వాళ్ళ మధ్యనున్న స్నేహానుబంధాలు, ఆప్యాయతలు దగ్గరినుంచి చూస్తున్న నాకైతే అద్భుతమైన పాఠాలు వింటున్నట్లు, అపురూపమైన దృశ్యాలు చూస్తున్నట్లూ ఉండేది!

కాకరాల గారు హైదరాబాద్ రాకముందు నేనొకసారి 2002 మే ప్రాంతాల్లో చెన్నై వెళ్ళాను. ప్రసాద్ అంకుల్ చెన్నైలో ఉన్న సురేష్‌కి చెప్తే సురేష్ నన్ను కాకరాల గారింటికీ, ఆతర్వాత వరూధిని గారింటికీ తీసికెళ్ళాడు. అప్పుడే నేను వరూధిని గారిని మొదటిసారి చూశాను. అప్పుడామెతో చలం గారమ్మాయి 'చంపక' (పకపక అని పిలుస్తారు) కూడా ఉన్నారు. 2002లోనే ఆమె తాను గనక ఉదయాన్నే లేచి తలుపులు తియ్యకపోతే ఏంచెయ్యాలో అనే అప్పగింతలన్నీ ఇంట్లో అద్దెకున్న వాళ్ళకి చెప్పానని చెప్పారు. దేనికైనా సిద్ధపడే ఆ సంసిద్ధతకి, స్థితప్రజ్ఞతకీ ఎంత ఆశ్చర్యంగా అనిపించిందో!

"కుటుంబరావు గారు చాలా విస్తృతంగా రాయడంవల్ల ఆయనేది రాసినా వెనక్కి తిరిగి చూసుకునేవారు కాదట. ఎక్కడెక్కడ తప్పులున్నాయో చూసి సరిచెయ్యమని కుటుంబరావుగారంతటి మేధావికే చెప్పగలిగిన గొప్ప సాహిత్య పాఠకురాలు వరూధిని గారు"ని సురేష్ ఆమె గురించి నాకు చెప్పాడు. అంటే నేడు వేలాది అభిమానులు తప్పులు లేకుండా హాయిగా చదువుకోగలిగిన కుటుంబరావు గారి సాహిత్యమంతటా సమాజానికి కనిపించని, ఆయనకు గొప్ప దన్నుగా నిల్చిన అదృశ్యశక్తి వరూధినిగారేనన్నమాట! పురుషాధిక్య సమాజంలో పురుషులకు దక్కుతున్న అపారమైన గౌరవాదరాల్లో రవ్వంతకూడా వారి వెనక అంతులేని కృషి చేస్తున్న స్త్రీలకు దక్కదు!

మనసు వ్యాకులంగా, నిస్తేజంగా, నిస్పృహగా, ఊపిరాడని స్థితిలో ఉన్న సమయాల్లో వరూధిని గారిని కలిసివస్తే నాకు మనసు చల్లబడేది. ఆమె కంఠస్వరం చాలా సున్నితంగా, మృదువుగా శాంతంగానే ఉండేది. కానీ అన్ని విషయాల్లో తనదైన అభిప్రాయాలను నిష్కర్షగా మాట్లాడేవారు. మనలో నిరాశా, నిస్పృహల చీకట్లని తొలగించి మనను చైతన్యవంతం చేసే జీవితానుభవాల సారాన్ని విప్పి చెప్పి రీచార్జ్ చేసేవారు. పెద్దవారు కదా అని "అమ్మా, మీకు షుగరుందా?" అని అడిగితే ఉత్సాహంగా "లేదు, పొగరుంది" అని చిలిపి సమాధానం చెప్పేవారు. షేక్స్‌పియర్ తన నాటక పాత్రల్లో ఎవరికీ కనిపించని మానవ మనస్తత్వ కోణాలను చూపించినట్లే వరూధిని గారు కూడా చుట్టూ సమాజంలోని మనుషుల మనస్తత్వాలను శాస్త్రీయ దృక్పథంతో విశ్లేషించగలరు. జీవితాన్ని, మనుషుల్ని, తత్వాల్ని తరచి చూసిన అనుభవం ఆవిడ మాటల్లో వ్యక్తమవుతుంది. కుటుంబరావు గారి సాహచర్యం వల్ల ఆవిడకా అవగాహన కలిగి ఉంటుంది.

అప్పుడప్పుడూ ఉదయాన్నే హిందూ పేపర్ చదివేసి, పొద్దెక్కాక లేచే నాకు ఎంచక్కా వార్తల్ని వినిపించేవారు. రహదారుల్ని ఆక్రమిస్తున్న దేవుళ్ళూ, స్వామీజీలూ, శవపూజలూ, విబూదిల గురించి విమర్శిస్తూ చెప్పి వాటి బారినుంచి మనల్ని మనమెలా కాపాడుకోవాలో ఆహ్లాదపరుస్తూ వివరించేవారు. టీవీ చూసి "వాడేమిటి? ఆ భక్తి చానల్‌లో తాయెత్తుల గురించీ, శని యంత్రాల గురించీ చెప్తున్నాడు" అంటూ చిరాకు పడుతూ హాస్యపు నవ్వులు చిందించేవారు. ఈ రచయితలేమిటి ఇలా అవార్డుల కోసం ఎగబడుతూ పేరు, ప్రతిష్ఠల కోసం నానా అగచాట్లూ పడుతున్నారు? అని విమర్శించేవారు. ఈ విషయంలో ఆమె తన కుమార్తె శాంతసుందరి గారి పట్ల కూడా విమర్శనాత్మకంగానే మాట్లాడేవారు. ఇప్పుడు "కుటుంబరావు గారుండి ఉంటే ఏమనేవారో" అని ప్రతి సందర్భంలోనూ ఆయనని తల్చుకుంటుండేవారు. ఆమాటకొస్తే 'అసలు నేను ఆయన పోయి ఇన్నేళ్ళైనా ఆయన జ్ఞాపకాలతోనే సంతోషంగా జీవిస్తున్నా'ననేవారు! ఆమె తన 16వ ఏట నుంచే కొకు రచనలను ఆబగా చదివి ఆయన వీరాభిమానినయ్యానని చెప్పారు. ఆ అభిమానంతోటే 1945లో ఆయనను పెళ్ళిచేసుకున్నానని చెప్పారు. దుర్గాబాయ్ దేశముఖ్ తమ వివాహం జరిపించారని చెప్పారు. అంతకు ముందు రకరకాల ప్రదేశాలలో ఉద్యోగాలు చేస్తూ ఎక్కడెక్కడో తిరిగిన కుటుంబరావు గారు మద్రాసులో ఒక స్థిరమైన జీవితానికలవాటు పడడానికి వరూధిని గారి ప్రోద్బలమే కారణం.

ఒకసారి శాంత సుందరి-గణేశ్వర రావు గార్లు అమెరికా వెళ్ళారు. అప్పుడావిడొక్కరే ఆరు నెలలు అంత పెద్దఇంట్లో ఉన్నారు. స్వంతంగా తనకు తనే వంట చేసుకునేవారు, ధైర్యంగా ఉండేవారు. ఆసమయంలో మా స్నేహితులెవరో మాకు కశ్మీర్ నుంచి తెచ్చిన యాపిల్స్ ఇచ్చారు. ఒక యాపిల్ తీసుకెళ్ళి ఆవిడ కివ్వబోతే "తలుపు తియ్యలేను. కిటికీ దగ్గర పెట్టమన్నా"రు. ఆతర్వాత ఫోన్ చేసి అది చాలా జూసీగా, రుచిగా ఉందనిచెప్పి It is a good gesture అని మెచ్చుకున్నారు. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే మామూలుగా ఆ వయసులోవాళ్ళెవరూ మనిషి తోడు లేకుండా ఒంటరిగా అంతకాలముండలేరు. ఆమె సాహసం చాలా అబ్బురమనిపించింది. ఆమెది చాలా స్వతంత్రమైన వ్యక్తిత్వం!

1947లో జన్మించిన వరూధిని గారి కుమార్తె శాంతసుందరి ప్రముఖ అనువాదకురాలు. హిందీ, తెలుగు, ఇంగ్లీష్‌లలో ఒక భాష నుంచి మరో భాషలోకి మూల రచయితల భావాల సాంద్రత ఏమాత్రం తగ్గకుండా అనువాదం చెయ్యగలిగిన సమర్థురాలు. దేశీయంగా, అంతర్జాతీయంగా ఎన్నో ప్రతిష్ఠాత్మకమైన గ్రంథాలను అనువదించారు. "ఇంట్లో ప్రేమ్‌చంద్" అనే ఆమె అనువదించిన గ్రంథానికి సాహిత్య అకాడమీ అవార్డ్ వచ్చింది. 1920 నవంబర్‌లో ఆమె కాన్సర్‌తో మరణించారు!

1949లో జన్మించిన కొడుకు రోహిణీ ప్రసాద్ అణుశాస్త్రవేత్త, సైన్స్ రచయిత. కుటుంబరావు గారివల్ల ప్రభావితమైన రోహిణీ ప్రసాద్ గారు మార్క్సిజంలోని గతితార్కిక భౌతికవాదం నుంచి మొదలుపెట్టి అతి సంక్లిష్టమైన విషయాలను సాధారణ పాఠకులు కూడా అర్థం చేసుకునే విధంగా అహర్నిశలు శ్రమించి అనువదిస్తుండేవారు. ఆయన డయాబెటిస్ వల్ల ఎంతో అనారోగ్యంతో బాధపడుతున్నప్పటికీ కూడా వివిధ పత్రికలద్వారా అనేక వ్యాసాలనూ, సైన్స్ గ్రంథాలనూ అతిసులభశైలిలో రచించి తెలుగు ప్రజలకందించారు.

బొంబాయి బాబా అటామిక్ రిసర్చ్ సెంటర్‌లో అణుశాస్త్రవేత్తగా పని చేస్తున్నప్పుడు అక్కడి తెలుగువారి కోసం 'తెలుగు సాహిత్య సమితి'ని స్థాపించి, సభ్యులు వివిధ విషయాల మీద రచించిన ఆర్టికల్స్‌ని రోహిణీ ప్రసాద్ గారే చేతిరాతతో రాసి "తెలుసా" అనే ఒక పత్రికను నడిపేవారట. పిల్లలతో సహా కుటుంబం మొత్తం ఆ పత్రిక పనిలో భాగమై ఇంటింటికీ వెళ్ళి పత్రికను పంచి ఇచ్చేవారని వారి శ్రీమతి లలితగారు చెప్పారు!

రోహిణీ ప్రసాద్‌గారికి అమోఘమైన సంగీతజ్ఞానం ఉంది. ఆయన గొప్ప సంగీతకారులు. సంగీతం గురించి అనేక వ్యాసాలను వివిధ పత్రికలకు రాశారు. సంగీతంలో ఉద్దండులైన బాలమురళీకృష్ణ, రావు బాల సరస్వతీదేవి లాంటి వారి సంగీత పాండిత్యం గురించి ప్రామాణికమైన రచనలు చేశారు. తన ఇంట్లోనూ, స్నేహితుల ఇళ్ళల్లోనూ సంగీత కార్యక్రమాలు పెట్టి ఆయన పాడుతూ, కొందరి చేత పాడిస్తూ సేద తీరేవారు. మేము కొన్ని కార్యక్రమాలకు హాజరై చాలా ఆహ్లాదంగా గడిపాం. సంగీతం మీద సాధికారతతో ఒక గ్రంథం "సంగీతం లోతులు-రీతులు"(హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ) రచించారు. అంతేకాదు, రోహిణీ ప్రసాద్ గారి కుమారుడు కార్తీక్ రిసెప్షన్

పార్టీలో ఈమని శంకర శాస్త్రి గారి కుమార్తె ఈమని కళ్యాణి గారి వీణావాయిద్యాన్ని ఏర్పాటు చేశారు. బొంబాయిలో ఆయనకి సంగీతంలో అభిరుచి ఉన్న ఒక మంచి బృందం ఉండేదట. వీరి సంగీత కచేరీకి ప్రఖ్యాత గాయని శ్రేయా ఘోషాల్ వచ్చి పాడిందని రోహిణీ ప్రసాద్ గారే స్వయంగా చెప్పారు! సంగీతంమీద ఆయనకింత గొప్ప అభిరుచి కలగడానికి కారణం వరూధిని గారి పెంపకమే అని చెప్పడంలో అతిశయోక్తి లేదేమో! ఎందుకంటే ఆమె తలిదండ్రుల ప్రోత్సాహంతో కొన్ని నాటకాలలో నటించారనీ, మంచిగాయని అనీ, లలిత సంగీతంలో నిష్ణాతురాలనీ, దేవులపల్లి కృష్ణశాస్త్రి లాంటి వారి ప్రోత్సాహంతో పలు ఆకాశవాణి సంగీత కార్యక్రమాలలో పాల్గొన్నారనీ వరూధిని గారి అల్లుడు గణేశ్వర రావు గారిచ్చిన సమాచారం వల్ల తెలుస్తుంది. చలసాని అంకుల్ పోయినప్పుడు వరూధిని గారు తన స్పందనను తెలియజేస్తూ దాన్ని ఆమె డిక్టేట్ చేస్తుండగా నన్ను రాయమన్నారు. అందులో ఆమె "ఆరోజు (సెప్టెంబర్ 6, సంస్మరణ సభ జరిగినరోజు) సాయంత్రం వర్షం వచ్చింది. అందరి "కన్నీళ్ళూ వానజల్లుగా కురిసెనేమోల" అని అనుకున్నాను"అని చెప్పారు. ఈ వాక్యం సంగీతజ్ఞానం ఉన్నవాళ్ళకే సాధ్యమని నాకనిపించింది. రోహిణి ప్రసాద్ గారికి అమ్మంటే చాలా ఇష్టమనీ, "లోకంలో దేన్నైనా సంపాదించుకోవచ్చు గానీ అమ్మను సంపాదించుకోలేమ"ని ఆయన అనేవారనీ, బొంబాయి నుంచి తరచూ అమ్మను చూడ్డానికి వెళ్ళేవారనీ లలితగారు చెప్పారు. రోహిణి ప్రసాద్ గారు 2012లో అనారోగ్యంతో మరణించారు!

ఇక కుటుంబరావు గారైతే యాభై సంవత్సరాల పాటు తెలుగు సమాజానికి చేసిన సాహిత్యకృషి అనన్యసామాన్యమైనది. భారతీయ సమాజం మొత్తంగా పెను మార్పులకు గురవుతున్న సంక్షోభకాలంలో పుట్టి పెరిగారు(1909-1980). 1930 దశకంలో మొదలుపెట్టి మరణించేవరకూ ఆయన నిరంతరంగా రాస్తూనే ఉన్నారు. మార్క్సిజం వెలుగులో మధ్యతరగతి గురించే వెయ్యిన్నర పైగా వ్యాసాలూ, కథలూ, నవలలూ, చందమామ బాల సాహిత్యం మొదలైన ఎన్నో ప్రక్రియలను విస్తృతంగా సృష్టించారు. దేశంలో అధిక సంఖ్యాకులుగా ఉన్న మధ్య తరగతి ప్రజలను చైతన్యవంతులను చెయ్యకపోతే సమాజంలో మార్పు సాధ్యం కాదంటూ "నాకు తెలిసిన జీవితం గురించే రాశాన"ని చెప్పారు. 20వ శతాబ్దపు తెలుగు సాహిత్యం మీద ఆయన చెరగని ముద్ర వేశారు. కుటుంబరావుగారి రచనలు ఆ కాలపు సామాజిక సంక్షోభాలనూ, యుద్ధాల వల్ల ప్రపంచ దేశాల సమాజాల్లోనూ, మన దేశంలోనూ పరోక్షంగా సంభవించిన అనేక జన, ప్రాణ నష్టాలనూ, విధ్వంసాన్నీ, ఆర్థిక మాంద్యాలనూ, కుదుపులనూ గమనించారు. ఆయన సాహిత్యం సనాతన -ఆధునిక భావాల పెనుగులాటలనూ, క్రమక్రమంగా మార్పు చెందుతున్న సంధికాలాల్నీ ప్రతిబింబిస్తుంది. ఒక్క కుటుంబం నుంచి ఇంతమంది సాహిత్యకారులు రావడం నిజంగా తెలుగు సమాజం చేసుకున్న అదృష్టమే!

ఒక్క మాటలో చెప్పాలంటే వరూధిని గారు-కుటుంబరావు గారు వేరు వేరు మనుషులు కాదు. వారిద్దరి మనోభావాలూ ఒక్కటిగా కలగలిసిపోయాయి. కొకు రాసిన ప్రతీ రచనను భద్రపరిచారు. కొకు మరణం తర్వాత విశాలాంధ్ర ప్రచురించిన కొకు సమగ్ర సాహిత్యానికి వరూధిని చేసిన సహకారం చెప్పుకోదగ్గది. ఒకసారి ప్రెస్‌క్లబ్‌లో రోహిణీ ప్రసాద్ గారితో ఒక మీటింగ్ జరిగినప్పుడు ఒకరెవరో "అసలు మీ ఇంట్లో సనాతనాచారాల సుడిగుండాలనుంచి తప్పించుకుని మీ కుటుంబం ఈ మార్క్సిజం వైపుకి ఎలా రాగలిగింది? అని ప్రశ్నించారు. ఆయన "మా నాన్నగారిదేముందండీ. తన సమయమంతా రాసుకుంటూనే గడిపేవారు. మా అమ్మ చాలా దృఢమైన వ్యక్తిత్వంతో అద్భుతమైన సుశిక్షితురాలిలాగా మాకు శాస్త్రీయమైన క్రమశిక్షణ నేర్పుతూ దిశానిర్దేశం చేసేది" అని రోహిణీ ప్రసాద్ గారు చెప్పారు. ఇది నూటికి నూరుపాళ్ళూ నిజం. పురుషుల్ని కమ్యూనిస్టులంటే అపూర్వమైన ఆరాధనతో చూసే ఈ ప్రపంచం అదే మహిళలనైతే హీనంగా చూస్తూ సూటీ పోటీ మాటలతో వెంటాడి, వేధించి చంపుతుంది. ఇది మహిళలందరి స్వానుభవమే! నిత్యం ప్రతి విషయంలోనూ చుట్టూ సమాజంతో సంఘర్షణలో ఉండేది స్త్రీలే! ఆరోజుల్లోనే సంప్రదాయాలనెదిరించి అంత సాహసంగా జీవించిన వరూధిని గారు ధన్యజీవి!

తన కళ్ళముందే కన్న కూతురూ, కన్నకొడుకూ దాటిపోయినా, "జీవితమా! నువ్వు నన్నింతకంటే ఏంచేయగలవు?" అని సవాలు చేస్తున్నట్లే ధీరవనితలా వరూధిని గారు జీవితేచ్ఛను కోల్పోలేదు. ఎంత విషాదంలోనూ సినికల్‌గా మాట్లాడలేదు! పైగా మొన్న జనవరిలో నాతో, "ఏమిటీ, ఈ మనుషులు ఎన్నాళ్ళిలా బతకడం? ఎప్పుడెప్పుడు పోతామా అని విచారిస్తుంటారెందుకు? జీవితంలో మంచి అంతా అనుభవించాక చెడును కూడా చవిచూడాలి కదా?"అని ఈ చెడు రోజుల్ని తల్చుకున్నారు. సమాజంలో అన్నీఉన్నా, మనమెటు వుండాలో తెలుసుకుని, మనల్ని మనం నిర్మించుకోవాలని వరూధిని గారి లాంటివారివల్ల స్ఫూర్తిని పొందుతాం!

మొన్న 2022, జనవరి 3న నేను, జనవరి 4న కాకరాల గారూ విడివిడిగా 'క్షేమాలయం'లో కలిసినప్పుడు కూడా ఒక్కొక్కరి గురించి ఎంతగానో తల్చుకుంటూ, వారి విషయాలు వివరించి చెప్పి ఇద్దరితోనూ రెండు, రెండు గంటలు ఏకధాటిగా మాట్లాడారు. నేనున్నప్పుడైతే మాట్లాడుతున్నప్పుడే భోజనం వచ్చింది. కష్టం, సుఖం చెప్పుకోవడానికి మనిషి దొరికితే భోజనమెందుకు? అంటూ భోజనం చెయ్యనని పసిపాపాయిలా మారాం చేశారు. అప్పుడు మేమిద్దరం కూడా ఆవిడతో మాట్లాడే మనుషులు కావాలని అనుకున్నాం. కాకరాల సర్ అయితే సి ఆర్ ఫౌండేషన్‌లో చేర్చగలిగితే మేముండి (ఆయనా, మూర్తి గారిలాంటి వాళ్ళు) పలకరిస్తూ ఉంటామని అందుకేం చెయ్యాలా అని ఆలోచించడం మొదలుపెట్టారు. ఇంతలోనే...ప్చ్ అందర్నీ వదిలి వెళ్ళిపోయారు!

వరూధిని గారిది పరిపూర్ణమైన జీవితం! కానీ సూర్యోదయం వైపుకి ఎగబాకడానికి మొక్క కాదు కదా, పొద్దు వాలిపోతున్న బతుకు. ఎవరికైనా మరణం తప్పదు గానీ మర్రిచెట్లలాంటి మనుషులు మాయమవుతున్నారనే బాధ! మానవీయమైన విలువలున్న తరం అంతరించిపోతుంది!



# విప్లవం అపురూప కళాత్మక శిల్పం

5వ భాగం

(గత సంచిక తరువాయి)

## అల్లం రాజయ్య ఇంటర్వ్యూ

**5. మిగతా విషయాలు ఎలా ఉన్నా బైట వచ్చిన బృహత్ నవలలను ఇప్పుడు తెలుగు పాఠకులు ఎలా స్వీకరిస్తారు?**

గతంలో ఇతర భాషలల్లో వచ్చిన కొన్ని నవలలు అనువాదకులు, ప్రచురణకర్తలు, సామాజికోద్యమాల వల్ల తెలుగులోకి వచ్చాయి. రష్యా నుంచి తెలుగులోకి చాలా అనువాద నవలలు వచ్చాయి.వారి వారి ఆసక్తిని బట్టి ఈ అనువాదాలు జరిగాయి. అప్పుడు పెద్దగా తెలుగు సమాజంలో క్షేత్రస్థాయి ప్రజా పోరాటాలు, వైరుధ్యాలు ఇంత స్పష్టంగా ఉండేవి కావు. నక్సల్బరి విప్లవోద్యమం గత యాభై సంవత్సరాలుగా మూడు తరాలుగా - ప్రజా పోరాటాల ద్వారా అనేక విజయాలు, అపజయాలతోపాటు - దేశవ్యాపిత ఉద్యమంగా గుణాత్మకంగా అభివృద్ధి చెందింది. తెలుగు ప్రజలు - ముఖ్యంగా యువకులు దేశవ్యాపితంగా జరిగిన, జరుగుతున్న ప్రజా పోరాటాలను, అందులోని పరిణామాత్మక, గుణాత్మక దశలను గతితార్కికంగా, చారిత్రికంగా, రాజకీయార్థికంగా అధ్యయనం చేస్తున్నారు. పోరాట ఆచరణ క్రమంలో అధ్యయనం, పోరాటాన్ని కనిష్ట స్థాయి నుండి గరిష్ట స్థాయికి ప్రజల్లోకి తీసుకపోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఇందులో భాగంగా ఆయా దశలకు సంబంధించిన కథలు, నవలలు తెలుగులో లేకపోతే ఇతర భాషల నుండి అనువాదం చేస్తున్నారు.

ఉదాహరణకు లక్షలాది మంది పాల్గొన్న విద్యార్థి ఉద్యమం మీద తెలుగులో చెప్పుకోదగిన నవలలు రాలేదు. ఆ అవసరం కోసం ఉదయగీతిక చైనా నవల అనువాదమై విద్యార్థి ఉద్యమాల మీద చాలా ప్రభావం చూపింది. అట్లాగే నిర్బంధాల మధ్య ప్రజా ఉద్యమాల పని విధానం గురించి చెప్పడానికి ఎర్రమందారాలు నవల తెలుగులోకి అనువాదం అయింది. ఇది పోరాడే శక్తులను నిలబెట్టింది. రహస్య పార్టీ విధానం, అనేక టెక్ జాగ్రత్తలను నేర్పింది. టావ్ చెంగ్ 'నా కుటుంబం', చౌలిపో 'ఉప్పెన', షోలకోవ్ 'బీళ్లు దున్నేరు', ఎమిలిజోల 'భూమి' నవలలు, తుర్గనేవ్ 'తండ్రులు కొడుకులు', దోస్తయేవస్కీ 'నేరము శిక్ష', టాల్‌స్టాయ్ 'అన్నాకెరినినా', 'యుద్ధము శాంతి', 'కోసక్కులు', వ 'తల్లి భూదేవి', 'జమిల్యా' లాంటి అనేక నవలలు మా తరానికి స్ఫూర్తినిచ్చాయి. అమెరికన్ నవలలు - గుగివా థియాంగో నవలలు ఇప్పటి పోరాటానికి చాలా అవసరం.

ఇతర భాషల నవలలు రెండు రకాలు - ఒకటి: ఇతర భారతీయ భాషలల్లో వచ్చినవి - మన తెలుగు ప్రాంతానికి ఇప్పటి దశలకు సంబంధించినవి. రెండు: ఇతర దేశాల ఇప్పటి పరిస్థితికి అనువైన నవలలు. తెలుగులో తెలంగాణ, కోస్తాంధ్ర, రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రాంతాలల్లో స్థానికంగా స్థలకాలాల నేపథ్యంలో - వేరు వేరు రకాల సామాజిక పరిస్థితులు - పోరాటాలు ఉన్నాయి. అవికాక - దళిత, బహుజన, మహిళా, ఆదివాసీ, మత మైనారిటీలు స్వయంగా నవలలు రాయడమేకాక - కన్నడ, తమిళ, మరాఠి, బెంగాలీ నవలలను తెలుగులోకి అనువదిస్తున్నారు. నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమ నేపథ్యంలో ఇతర భారతీయ భాషల్లో వచ్చిన నవలలు ఇప్పుడు తెలుగులో తేవాల్సిన అవసరముంది. అట్లాగే తెలుగు నవలలను ఇతర భారతీయ భాషల్లోకి అనువాదం చేయాల్సిఉంది. రకరకాల అస్తిత్వాల నుండి - దళితులు,బహుజనులు, మహిళలు, మత మైనారిటీలు కలిసి 'ఢిల్లీ' పరిసరాలల్లోసంవత్సరం పైగా మోహరించిన రైతుల ఉద్యమంలో పాల్గొన్నారు. స్ఫూర్తి పొందారు. మొట్టమొదటిసారిగా భారతదేశ వ్యాపితంగా, శ్రామికవర్గం నాయకత్వంలో ప్రజలు ఐక్య పోరాటాలు నిర్మిస్తున్నారు. ఈ గొప్ప సందర్భంలో తెలుగు ప్రజలు మిగతా ప్రాంతాల తమ మిత్రులైన ప్రజల గురించి - వారి భావోద్వేగాల పోరాట జీవితాన్ని ఆలింగనం చేసుకోవాలనుకుంటున్నారు. అట్లాగే తెలుగులో వచ్చిన నవలల గురించి ఇతర ప్రాంత ప్రజలు ఆసక్తిగా ప్రేమగా ఎదురుచూస్తున్నారు.

బ్రాహ్మణీయ భూస్వామ్యం, అమెరికన్ సామ్రాజ్యవాదంతో కలిసి సమస్తాన్ని దోపిడి చేస్తూ ఫాసిజంగా వ్యక్తమవుతున్న దశలో, ప్రజలు సంఘటిత పోరాటాలకు దారులు వెతుకుతున్న తరుణంలో అన్ని దేశాల, భాషల అన్ని రకాల ప్రజాపోరాట నవలలు తెలుగులోకి రావాల్సి ఉంది. దేశవ్యాపిత ప్రజా పోరాటాలు బలపడుతున్న సందర్భంలో దారులు వెతుకుతున్న భారతీయ ప్రజలు తమ గుండెల కదుముకొని తప్పక ఆదరిస్తారు. ఇప్పుడు తెలుగులో నాలుగు ప్రాంతాల నేపథ్యంలో వచ్చిన నవలలను అన్ని ప్రాంతాల యువకులు చదవడం విశేషం...

**6. తెలుగులో విప్లవ నవల ప్రత్యేకతలేమిటి?**

విప్లవోద్యమంతోపాటే విప్లవోద్యమంలోని పరిణామాత్మక, గుణాత్మక దశలను, పోరాటంలో పాల్గొంటున్న, వివిధ స్థాయిలలో ఉన్న ప్రజలకు చేర్చడం, విప్లవోద్యమాన్ని గతితార్కికంగా అర్థం చేయించడం -ఈ లక్ష్యంతో వచ్చిన రచనలు - పోరాటంలో పాల్గొంటున్న ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాలను - పోరాటంలో తలెత్తే వైరుధ్యాలను పరిష్కరించడంలో ఐక్యత-ఘర్షణను వాళ్ల భాషల్లో, శిల్పంలో చిత్రించాయి. భూషణం 'కొండగాలి', చెరబండరాజు 'మాపల్లె', నేను రాసిన 'కొలిమంటుకున్నది', కౌముది 'తెలంగాణ పల్లె', తుమ్మేటి రఘోత్తమరెడ్డి 'నల్లవజ్రం', పి.చంద్ 'శేషగిరి', 'నెత్తుటి ధార', పాణి 'నిప్పుల వాగు', కనుపర్తి రాజారాం 'ఎదురగ్గి', కళ్యాణరావు 'అంటరాని వసంతం', వనజ 'అడవి పుత్రిక', సాధన 'రాగో', 'సరిహద్దు', నల్లూరి రుక్మిణి 'నిషిధ', అట్టాడ అప్పలనాయుడు 'పునరావాసం', 'బహుళ' ఇలాంటి నవలలు ఇందుకు కొన్ని ఉదాహరణలు మాత్రమే. అట్లాగే నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమాన్ని ఎత్తి పట్టడానికి అన్ని తరగతుల ప్రజల్లోకి ప్రయాణం చేసే లక్ష్యంతో రాసిన నవలలు - సాహుతో కలిసిరాసిన 'కొమురంభీం' లాంటివి కొన్ని. ఉన్నత కులాల, వర్గాల నుండి తెలుగు నవల రైతాంగం, ఆదివాసీ, మహిళ, దళిత, బహుజన, మత మైనారిటీ నుండి కార్మికుల దాకా క్షేత్ర స్థాయి జీవితాలను ప్రజల భాషలో పోరాటాలతో పాటే చిత్రించడం విప్లవ నవల ప్రత్యేకత.

ఎవరికి, ఎందుకు, ఎలా, ఎప్పుడు, ఎంత, ఏమిటి, ఎక్కడ

అనే అవగాహనతో స్థల, కాలాల నేపథ్యంలో చిత్రించడం విప్లవ నవల ప్రత్యేకత. ఊహాత్మక, కల్పిత, వైయక్తిక భావవాద, నిరాశావాద, రకరకాల వ్యాపార ధోరణుల నుంచి తెలుగు నవలను భూ మార్గం పట్టించి అట్టడుగు శ్రామిక వర్గ ప్రజల ఆరాట పోరాటాలను చిత్రించడం విప్లవ నవల ప్రత్యేకత.

కన్పించే జీవితం వెనుక అల్లుకొని ఉన్న సామాజిక జీవితాన్ని కళాత్మకంగా చిత్రించడం విప్లవ నవల ప్రత్యేకత. ఉత్పత్తి కోసం, వర్గ పోరాటం, శాస్త్రీయ ప్రయోగం విప్లవ నవల వస్తువులో భాగం కావడం, వస్తువు, శిల్పం, భాష, భావోద్వేగాలు - కుల, మత, లింగ, వర్గ, ప్రాంత విభేదాలను గుర్తించడం - ఘర్షణ, ఐక్యత ద్వారా ప్రజలను - తమ శత్రువుకు వ్యతిరేకంగా సన్నద్ధం చేయడం విప్లవ నవల ప్రత్యేకత.

విప్లవోద్యమం గతిక్రమాన్ని, పరిమాణాత్మక మార్పులను, గుణాత్మక దశలను ఉత్పత్తి శక్తుల - ఉత్పత్తి సంబంధాలను తాత్వికంగా, రాజకీయార్థికంగా అర్థంచేసుకొని - విప్లవోద్యమంతో పాటే నవల సర్వసంపూర్ణంగా కనిష్టస్థాయి నుండి గరిష్టస్థాయికి ఎదగడం నిరంతర ప్రక్రియ. అది విప్లవమంత ఆచరణాత్మక ప్రక్రియ. ఇట్లాంటి నవలలు చాలా వచ్చాయి. అయినా ఈ ప్రక్రియ ఇంకా బలపడవలసే ఉన్నది. విప్లవోద్యమ శ్రేణుల నుండి, రైతాంగం, కార్మిక, మహిళా, దళిత, బహుజన కులాల నుండి నవలలు రావడం విప్లవోద్యమం వల్లనే సాధ్యమయ్యింది. ఇలాంటి నవలలు మిగతా ప్రధాన స్రవంతి నవలా సాహిత్యం కన్నా భిన్నమైనవి - ప్రత్యేకమైనవి.

**7. విప్లవోద్యమం పాట, దృశ్య కళారూపాల వలె నవలను తొలి రోజుల్లోనే వాహిక చేసుకోవడం వెనుక ఏమైనా సామాజిక, కళా సంబంధమైన కారణాలున్నాయా?**

ప్రధానంగా పాటల, జముకుల కథ లాంటి దృశ్య కళారూపాల ద్వారా ఆదివాసీ ప్రాంతాలల్లో శ్రీకాకుళ గిరిజన పోరాటం గిరిజనులకు రాజకీయాలు చెప్పి ఉత్తేజపరిచింది. మైదాన ప్రాంతాల్లో ప్రచారం చేసింది. ఆ పోరాటంలోకి మైదాన ప్రాంతం నుండి పంచాది కృష్ణమూర్తి, పంచాది నిర్మల లాంటి డాక్టర్లు మేధావులు పాల్గొని ప్రజలకు స్ఫూర్తినిచ్చారు. జాతులు విముక్తిని, దేశాలు స్వాతంత్ర్యాన్ని కోరుతున్న దశలో నెహ్రూ మార్కు సోషలిజం భూస్వాములకు, బడా పెట్టుబడిదారులకు - ఉన్నత కులాలకు - మరింత పేదల శ్రమ దోచిపెట్టింది. ఒక నిప్పు రవ్వ దావానలమైనట్లు నక్సల్బరి దేశవ్యాపితంగా ఒక సంచలనం. ఈ నేపథ్యంలో తెలుగు ప్రాంతంలో ఆదివాసి ప్రాంతంలో ఆరంభమైన సాయుధ పోరాటాన్ని అన్ని ప్రాంతాల ప్రజలకు చెప్పడానికి పాటలు, దృశ్య కళారూపాల కన్నా నవలవిస్తృత పరిధి కలిగినది కనుక భూషణం కొండగాలి నవల రాశారు.

అదే విధంగా 1972 కల్లా ఆ పోరాటం నెత్తుటేర్లలో ముంచబడిన కూడా - మిగతా ప్రాంతాలకు విస్తరించింది. ముఖ్యంగా మెదక్ జిల్లాలో గిరాయిపల్లిలో విద్యార్థులను చంపడం, అనేక ప్రాంతాలలో వర్గశత్రు నిర్మూలన జర్గడం, ఆదిలాబాదు, కరీంనగర్, వరంగల్లు గ్రామీణ ప్రాంతాలల్లోకి విస్తరించడం - విరసం, జననాట్య మండలి లాంటి సంస్థలు ఏర్పడి పాటలు దృశ్యకళారూపాలు బీదల పాట్లు లాంటి నాటకాలు ప్రదర్శించడం ఆరంభమయ్యింది. 1974లో పిడిఎస్‌యూ, రాడికల్ విద్యార్థి సంఘం ఏర్పడ్డాయి. వీళ్లందరికి నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమ లక్ష్యాలు అర్థం కావాల్సిఉన్నది. గ్రామీణ ప్రాంతాలల్లో భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు - అర్ధవలస-అర్ధ భూస్వామిక సమాజంలో ప్రధానవైరుధ్యం భూస్వామ్యానికి అశేష పీడిత ప్రజానీకానికిగా గుర్తించారు. ఈ నేపథ్యంలో నవలలు ఈ మొత్తం తాత్విక రాజకీయార్థిక విషయాలను ప్రజల్లోకి ముఖ్యంగా విద్యార్థులు, ఇతర ప్రజాస్వామిక మేధావులకు చేరాలనే లక్ష్యంతో చెరబండరాజు మాపల్లె, నిప్పురాళ్లు, ప్రస్థానం, దారి పొడుగునా, నవలలు 1972, 1974, 1978 దాకా హైదరాబాద్ చుట్టు పక్కల గ్రామాల గురించి రాశారు. ఆ నవలలన్నీ 1978, 1981 తరువాతనే ప్రచురణయ్యాయి. ఆదిలాబాదులో ఆరంభమైన విప్లవోద్యమం - దళిత జీవితం నేపథ్యంలో గూడ అంజయ్య పొలిమేర, పొద్దుపొడుపు నవలలు రాశారు. ఈ ఝొరవడికి కారణం గతంలో 1948-1951 తెలంగాన సాయుధ పోరాటం నేపథ్యంలో వచ్చిన నవలలు - వట్టికోట ఆళ్వారుస్వామి ప్రజలమనిషి, గంగు - దాశరథి రంగాచార్య చిల్లర దేవుళ్లు, మోదుగుపూలు లాంటివి.

విప్లవోద్యమం అన్ని ప్రజా కళారూపాలతోపాటు కథ, నవల బలమైన సాంస్కృతిక ఆయుధంగా గుర్తించడమే దీనికి కారణం. పాటలకు, దృశ్య కళారూపాలకు నిర్బంధకాలంలో కొన్ని పరిమితులేర్పడుతాయి. అట్లాగే ప్రజా జీవితాన్ని రూపు కట్టడానికి పరిమితులున్నాయి. పాటలు, దృశ్య కళారూపాలు పరిమాణాత్మక పోరాటాలల్లో ప్రత్యక్ష కళారూపాలు. పరిమాణాత్మక పోరాటాలు గుణాత్మకంగా మారుతున్న దశలో ప్రజలు - తత్వశాస్త్రం, ఆర్థికశాస్త్రం, గతితార్కిక చరిత్ర అధ్యయనంచేస్తూ పోరాటాలు విస్తరించే దశ. వీటన్నిటిని కలిపి తగిన భావోద్వేగాలతో చిత్రించడానికి నవల మాత్రమే తగిన సాహిత్య రూపంగా ముందుకు వచ్చింది.

వలస, అర్ధవలస - అర్ధ భూస్వామిక సామాజిక నేపథ్యంలో, వర్గ పోరాటంలో నవల పుట్టి అభివృద్ధి చెందినది కనుక - ఈ రెండు రకాల సమాజాలల్లోని నశించిపోయే పాత సమాజాన్ని, రూపొందుతున్న కొత్త సమాజాన్ని - ఉత్పత్తి శక్తుల వికాసం, వర్గ పోరాటం, శాస్త్రీయ విజ్ఞానం - ముఖ్యంగా నూతన ప్రజాస్వామిక దీర్ఘ పోరాట లక్ష్యాలను చిత్రించడానికి నవలను ఎంచుకోవడం జరిగింది.

**8. విప్లవ నవల నిర్మాణాన్ని, శిల్పాన్ని ఉద్యమాలు ప్రభావితం చేశాయా?**

చరిత్రంటే వర్గపోరాటాల చరిత్రే - బానిస, భూస్వామ్య, పెట్టుబడిదారి, సామ్రాజ్యవాదం, పారిస్ కమ్యూన్, రష్యా అక్టోబర్ బోల్షివిక్ విప్లవం, చైనా విప్లవం మొదలైన మార్గంలో వర్గపోరాటాల వల్ల చరిత్ర నడిచింది. పాత అభివృద్ధి నిరోధకమైన సమాజంలోకన్నా పూర్తిగా భిన్నమైన, అప్పటికి అభివృద్ధి కారకమైన నిర్మాణ రూపాలుగా ముందుకు వచ్చాయి. అన్ని రకాల పీడన, హింసారూపాలను రద్దుచేసే సోషలిస్టు, కమ్యూనిస్టు లక్ష్యాల అత్యున్నత రూపం విప్లవం. విప్లవం అపురూప కళాత్మక శిల్పం.

సాహిత్యంలో వస్తు శిల్పాలను వేరు చేసి చూడలేము. శిల్పం అనేది శబ్దానికీ, అర్థానికి రెండింటికి సంబంధించినది. వస్తువును సాహిత్యంగా మార్చేది రచనా శిల్పం మాత్రమే. వస్తువు లేకపోతే శిల్పానికి విలువలేదు, శిల్పంలేని వస్తువు ప్రభావం శూన్యం. ఈ విధంగా శిల్పం గురించి, వస్తువు గురించి మార్క్సిజం శాస్త్రీయంగా విశ్లేషించి వివరించింది.

విప్లవం అనేది- ముందే వివరించినట్టుగా - ఉత్పత్తి శక్తుల

వికాసం, వర్గ పోరాటం, శాస్త్రీయ విజ్ఞానం ప్రాతిపదికగా స్థలకాలాలల్లో జరుగుతుంది. మనం ముందే సుదీర్ఘంగా వివరించిన భారతదేశ నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమం ఎన్ని దశల గుండా జరిగిందో ఆ అన్ని దశలు భారతీయ నవలా సాహిత్యంలో కనిపిస్తాయి. అహింస, గాంధీ, నెహ్రూలాంటి బూర్జువా, భూస్వామ్య రాజకీయ నాయకులు - వాళ్లు నడిపించిన ఉద్యమాలు - ప్రధానంగా భావవాదంతో వ్యక్తి కేంద్రంగా, కులం, మతం, ప్రాంతం, లింగ భేదాలతో అవి నడిచాయి. అలాంటి వైరుధ్యాలను పెంచిపోషించాయి. కమ్యూనిస్టులు దేశవ్యాప్తంగా ప్రజలతో కలిసి పనిచేసినా కూడా భారతదేశంలోని వైరుధ్యాలను ఘర్షణ, ఐక్యత - మార్క్సిస్టు - లెనినిస్టు పద్ధతిలో పరిష్కరించలేదు. ఆదివాసీలను, దళితులను, మహిళలను, బహుజనులను సమీకరించడంలో విఫలమయ్యారు. అగ్రకుల నాయకత్వం ప్రజారాశుల నుండి నాయకత్వాన్ని ఎదిగించుకోలేదు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో - భారతదేశాన్ని పీల్చిపిప్పి చేసిన బ్రిటన్ రష్యా కూటమి కనుక కమ్యూనిస్టులు బలపర్చడం వలన దేశవ్యాపితంగా - ప్రజలకు దూరమయ్యారు. ఇలాంటి వస్తుగతమైన విషయాలన్నీ కూడా భారతదేశ నవలా వస్తువు, శిల్పంలో, భాషలో చోటు చేసుకున్నాయి.

1967 నక్సల్బరి నూతన ప్రజాస్వామిక విప్లవానికి భారతదేశంలో భూస్వామ్యం ప్రధానమైన వైరుధ్యంగా గుర్తించడం, వర్గ శత్రు నిర్మూలన - ఈ ప్రభావంలో కొన్ని నవలలు వచ్చాయి. శ్రీకాకుళ గిరిజన పోరాటం ఆదివాసీ జనజీవన నేపథ్యంలో మిగతా నవలలకు భిన్నమైన శిల్పంగా కొండగాలి వచ్చింది.

ఎమర్జెన్సీ ఎత్తేసిన తరువాత ప్రజలే చరిత్ర నిర్మాతలని, విప్లవానికి బాట రచించుకొని గ్రామాల్లో దున్నేవానికి భూమి ప్రాతిపదికగా వ్యవసాయ విప్లవం కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలల్లో ఆరంభమైంది. అన్ని జిల్లాల్లో కోస్తాంధ్ర, ఉత్తరాంధ్ర, రాయలసీమ రైతాంగ పోరాటాలు క్రమంగా ఆరంభమై విస్తరించాయి.

రాడికల్ విద్యార్థులు, రైతుకూలీ సంఘాలు మార్క్సిజం-లెనినిజం, మావోయిజంతో పాటు భారతదేశ చరిత్ర, రాజకీయార్థికశాస్త్రం, తత్వశాస్త్రాలు అధ్యయనం చేసి - ఆ సిద్ధాంతాల వెలుగులో క్షేత్రస్థాయిలో గ్రామీణ ప్రాంతాలను అధ్యయనం చేశారు. ముఖ్యంగా ఉత్పత్తి శక్తుల స్థాయి, ఉత్పత్తి వనరులు - ఉత్పత్తి సంబంధాలు...గ్రామంలో పునాది-ఉపరితలాల గురించి అధ్యయనం చేశారు. మొదట కూలిరేట్ల పెంపు, పాలేర్ల జీతాల పెంపు, ఆశ్రిత కులాల వెట్టి రద్దు, శికం, ప్రభుత్వ బంజరు - అక్రమంగా దొరలు ఆక్రమించిన భూముల ఆక్రమణ రైతు కూలి సంఘాలు చేపట్టాయి. ఎప్పటిలాగే దొరలు తమ స్థాయిలో కులాల మధ్య చిచ్చుపెట్టే ప్రయత్నాలు చేశారు. కుల పెద్దలను రెచ్చగొట్టారు. పంచాయితీలను రైతుకూలీ సంఘాలు తమ చేతిలోకి తీసుకున్నాయి. గూండాలతో భౌతిక దాడులకు దిగి హత్యలు చేయించారు. దొరల పంటలు హస్తగతం చేసుకోవడం - ఆఖరుకు సాంఘిక బహిష్కరణ దాకా ఎదిగాయి. చీకటి ఖండాలుగా - మళ్లీ కులాలుగా విభజింపబడిన ఊళ్లు - సంఘటిత పడ్డాయి... ఈ పరిణామాలు గ్రామ భౌతిక, భౌద్ధిక రూపు రేఖలు మార్చాయి. బాంచెగాడు కమ్యూనిస్టుగా మారాడు. దేవుడు, అదృష్టంస్థానే సమస్తం తెలుసుకున్నాడు. కారణ, కారక సంబంధాలకు సంబంధించిన కొత్త భాష, కొత్త రకం అపురూపమైన కామ్రేడ్లీ సంబంధాలు నెలకొన్నాయి. దొరలు పట్నాలు పట్టారు. దొరల పక్షాన ప్రభుత్వం కేసులతో, చట్టాలతో పోలీసులతో రంగ ప్రవేశంచేసింది.

ఈ కొత్త ఒరవడిలో 'కొలిమంటుకున్నది' నవల వచ్చింది. ఒక పేద రైతు నర్సింహం తన మీద జరిగిన క్రూరమైన దొర దాడికి భయపడలేదు. కార్మికులు పోరాడితే పోయేదేమిలేదు అనే చైతన్యంలోకి వచ్చిండు. ఈ మొత్తం వస్తువును, శిల్పాన్ని, కొత్త భాషను భావోద్వేగాల వ్యక్తీకరణను వర్గపోరాటంలో రైతాంగం తమ త్యాగాలతో నిర్మించింది. విప్లవం తమ నాయకులను ప్రజల నుండి నిర్మించుకున్నట్లుగానే నవలలను ఊరు పేరులేని వారు నిర్మించారు. నవలలు రాశారు.

ఆ తరువాత విప్లవోద్యమం పటిష్టమైన పార్టీ, ప్రజాసైన్యం, ఐక్య సంఘటనతో - కార్మిక, కర్షక రాజ్యాధికారం, అర్ధవలస - అర్ధ భూస్వామ్య ప్రభుత్వాల స్థానే స్థాపించే క్రమంలో - అనేక ఎత్తుగడలు రూపొందించుకున్నది. ముఖ్యంగా ఆదివాసీ ప్రాంతాలకు విస్తరించింది. నవలల పరంపర కొనసాగింది. కొమురంభీం, వసంతగీతం, అగ్నికణం, బతుకుపోరు, అడవిపుత్రిక - ఆదివాసీ సమాజాలల్లో మహిళల పోరాట చైతన్యం రాగో - ఒక ఎపిక్‌లాగా సాగిన అంటరానివసంతం - దళితుల పోరాటం మీద నిషిధ, మహిళల దృష్టి నుంచి మేరువు, రాయలసీమలో ఎదురగ్గి, నిప్పుల వాగు నవలలు వచ్చాయి. కార్మిక జీవితం గురించి పి. చందు శేషగిరి నల్లమల, శృతి దాకా వంటి చాలా నవలలు వచ్చాయి. అనేక నవలలు విప్లవోద్యమం వ్యూహంలో భాగంగా, ఎత్తుగడలు - స్థలకాలాలల్లో వర్గపోరాట ఆచరణ వస్తువు నేపథ్యంలో ప్రతి నవలను క్షేత్రస్థాయి భౌతిక, భావపరమైన శిల్పం - భాష - భావోద్వేగాల సమ్మిళితంగా చూడవచ్చును. విప్లవోద్యమ పరిణామ క్రమం ఈ నవలలు రూపొందడానికి ప్రధాన భూమిక.

ప్రధానంగా ఆయా స్థలకాలాల్లో - విప్లవం స్థాయి, అవగాహన, నిర్మాణం, సమిష్టి ఆచరణను బట్టి పరిణామాత్మకంగానూ - గుణాత్మకంగానూ ఎదుగుతూ నవలల నిర్మాణాన్ని, శిల్పాన్నీ ప్రభావితం చేశాయి. ఈ నవలల్లోని శిల్పం అంతకు ముందటి నవలలోని పూర్తిగా కొత్తగా ప్రజలనుండి రూపొందింది. అలాంటి నిర్మాణ రూపాన్ని పొందాయి. ఇందులో ప్రజలు- శ్రామిక కులాల, శ్రామిక వర్గాల అదో:జగత్సహోదరులు తమ సమస్త శ్రామిక జీవన సౌందర్యంతో - సమస్త సంపద - సృష్టికార్యకలాపాల జ్ఞానంతో - భావోద్వేగాలతో సాహిత్యంలోకి ప్రవేశించారు. దీన్ని బట్టే సాహిత్యంలోని శిల్ప సౌందర్య విషయాలన్నీ మారిపోయాయి.

### 9. విప్లవ నవల నెలకొల్పిన శిల్ప ప్రమాణాలు ప్రత్యేకంగా ఏమిటి?

ప్రజల నుండి నేర్చుకోవడం - ప్రజలకు నేర్పడం - పరస్పర అధ్యయనం - నేర్చుకోవడం - అనే ప్రక్రియ ద్వారా - దోపిడి, పీడన, హింసాత్మక అభివృద్ధి నిరోధక పాత అర్ధవలస - అర్ధ భూస్వామ్యం స్థానే కార్మిక కర్షక రాజ్య స్థాపన దిశగా - వ్యూహం - అందుకు తగిన ఎత్తుగడలకు తగిన శిల్ప ప్రమాణాలు ఇవి. చలనంలో ఉన్న - పరస్పరం సంఘర్షించుకునే విరుద్ధ శక్తులను - స్థల కాలాలల్లో తగిన భావోద్వేగాలతో శాస్త్రీయంగా చిత్రించడం ఒక శిల్పంగా ముందుకు వచ్చింది. ఇది విప్లవోద్యమం యొక్క గొప్ప పోరాట శిల్పం. అది గతితార్కికమైనది - చారిత్రికమైనది - శాస్త్రీయమైనది. అంటే వస్తువుకు, శిల్పానికి, భాషకు పొంతనలేని పాత భూస్వామిక, బూర్జువా శిల్పం కాదు ఇది. ముఖ్యంగా ఉత్పత్తి శక్తుల ఆరాట పోరాటాలు -

ఆవిష్కరణలను మాయ జేసి దేవునికో, భూస్వాములకో, కొందరు వ్యక్తులకో, మార్కెట్టుకో అంటగంటే – భూస్వామ్య, బూర్జువా కళా శిల్పాన్ని విప్లవ నవల తిరస్కరించింది. ప్రజలు ఉత్పత్తిలో – వర్గపోరాటంలో నిర్మించిన సమస్త కళాత్మక జీవితాన్ని, దాని శిల్ప సౌందర్యాన్ని గుర్తించి నవలా రచనలోకి విప్లవ రచయితలు తీసుకొచ్చారు. అలాంటి ప్రజా శిల్పంలో ఉన్న – భూస్వామ్య, బూర్జువా అవశేషాలను వర్గపోరాటంతో పాటే ఎదుర్కొని విప్లవీకరించడం విప్లవ నవల నెలకొల్పిన శిల్ప ప్రమాణం.

ఉత్పత్తి శక్తుల జీవన సౌందర్యాన్ని, ధీరోదాత్తతని పోరాట పటిమను మరింత ఉన్నత స్థాయిలోనూ, మరింత గాఢంగానూ, మరింత లక్ష్యణాన్వితంగానూ ఆదర్శానికి దగ్గరగానూ – చరిత్రను పురోగమింపజేయడానికి తగిన పద్ధతిలో విప్లవ నవల వస్తువులోను, శిల్పంలోనూ, భాషలోను నిరంతరం ప్రమాణాలు పెంచడానికి కృషి చేస్తున్నది.

మొదలు గ్రామీణ ప్రజలను చేరుకోవడానికి నవల మౌలిక రూపంలో ఆరంభమయ్యింది. అలాంటిదే కొలిమంటుకున్నది నవల. ఈ నవల కరీంనగర్ – ఆదిలాబాదు జిల్లాల్లో సాగుతున్న రైతుకూలీ పోరాటాల కాలంతో పాటు సృజన సాహితీ మిత్రుల సాంస్కృతిక కృషి నుంచి రూపొందింది. రైతుకూలీ సంఘంవాళ్లు గ్రామంలో మీటింగుపెట్టి అందరిని పిలిచేవారు. సంఘం నాయకుడు సమస్య చెప్పి కూర్చుంటోడు.

ఉదాహరణకు రైతుకూలీలకు కూలి సరిపోవడంలేదు. కూలీలు పెరుగాలా వద్దా? ఇదీ సమస్య. కూలిరేట్లు పెరగాలని నాయకుడు చెప్పడు. ఆ సమస్యలో ఉన్న రైతు కూలీలు, చిన్న రైతులు, మధ్య తరగతి రైతులు, ధనిక రైతులు – రాగద్వేషాలతో తమ తమ అభిప్రాయాల చెప్పుతారు. అది తీవ్రమైన భావావేశాలకు దారితీస్తుంది. ఆ వాదోపవాదాలు ఆ పరిస్థితిని దాటడమెట్ల అనే సమస్యను సూచిస్తుంది. నాయకుడు మధ్యలో అయితే ఏం చేద్దాం? అడుగుతాడు. లొల్లి – రెండు గ్రూపులుగా చీలిపోతారు. విచిత్రంగా ఆ సమస్య పూర్వాపరాలు, అనివార్యత ముందుకువచ్చి కూలీలు కూలి పెరగాలిందేనంటారు. మధ్యతరగతి నోరు మూసుకుంటారు. చివరకు మిగిలింది నలుగురో అయిదుగురో ధనిక రైతులు. సమస్యను ప్రజల మధ్యకు తేవడం – దాని లోతుపాతులను చర్చించడం.. ఇది రైతు కూలీ సంఘం నిర్మించిన పోరాట శిల్పం. రచయిత ఇంట్లో కూర్చుండి – ఈ శిల్పాన్ని నిర్మించలేడు. ముఖ్యంగా రైతుకూలీ సంఘం నిర్మాణం, పని విధానం రాయజాలడు.

భావవాదం స్థానంలో గతి తార్కిక ఆలోచనా విధానాన్ని శిల్పంలో అభివృద్ధి చేయడం అంటే ఇదే. ఇది విప్లవోద్యమం సాధించిన పరిణామాత్మక మార్పు. భిన్నమైన ప్రజల అనుభవాలను అధ్యయనం చేసి – సాధారణ, ప్రత్యేక వైరుధ్యాలను – ప్రధాన వైరుధ్యాన్ని గుర్తించడం. రైతాంగం, కార్మిక, ఆదివాసీ, మహిళ, దళిత, బహుజన జీవితంలోని – వారి సాంప్రదాయిక సాహిత్యంలోని శిల్ప రీతులను అధ్యయనం చేయడం – గతితార్కికంగా అభివృద్ధి చేయడం మౌలిక సాహిత్యంలోకి సాధ్యమైనంత మేరరకు నవల శిల్పాన్ని అభివృద్ధి చేయడం ఇందులో ఉంది. దీన్ని గుగీవాథియాంగో దీన్నే వొరేచర్ అన్నారు.

తెలంగాణ, కోస్తాంధ్ర, ఉత్తరాంధ్ర, రాయలసీమ ప్రాంతాలల్లోని ప్రత్యేక సాహిత్య శిల్ప రీతులను, నుడికారాన్ని అధ్యయనం చేసి నవలా శిల్పంలో అభివృద్ధి చేయడం జరిగింది. తాత్కాలిక వెనుకడుగు సమయంలో – ప్రజల్లో ఏర్పడే స్థితిని మాజిక్ రియలిజం – లాటిన్ అమెరికన్ సాహిత్యంలో ఎక్కువగా ప్రాచుర్యం పొందిన శిల్పం కూడా విప్లవ నవల పద్మకుమారి పాల్గుణలో చోటుచేసుకున్నది.

విప్లవోద్యమం నుండి వచ్చిన ప్రతి నవలా నిర్మాణంలో ప్రదర్శించిన ప్రత్యేక శిల్పాన్ని ఆ నవలా నేపథ్యంలోని విప్లవోద్యమంతో కలిపి విశ్లేషించాలి. అట్లా ప్రతి నవలా ఒక ప్రత్యేకమైన శిల్పనైపుణ్యాన్ని ప్రదర్శించింది. భూషణం కొండగాలి, చెరబండరాజు మాపల్లె, అల్లం రాజయ్య కొలిమంటుకున్నది – కౌముది తెలంగాణ పల్లె, సాహు, నేను కొమురంభీం, పి. చందు శేషగిరి, వనజ అడవి పుత్రిక, సాధన రాగో, నల్లూరి రుక్మిణి నిషిధ, కళ్యాణరావు అంటరానివసంతం, పాణి నిప్పుల వాగు, గుమ్మెటమోత, మునికన్నడి సేద్యం, కేశవరెడ్డి 24 గంటలు నవలలు ప్రత్యేకమైన వస్తువును, శిల్పాన్ని ప్రదర్శించాయి.

విప్లవోద్యమ నవలా శిల్పం – మృత్యప్రాయమైన భూస్వామ్య, అమ్మకపు సరుకు బూర్జువా, స్వేచ్ఛ పేరుతో సమస్తం విధ్వంసం చేసే సామ్రాజ్యవాద సమాజాల నవలా శిల్పరీలకు భిన్నమైన శిల్పరీతులను తీసుకొచ్చింది. సజీవమైన నిరంతరం పురోగమించే చైతన్యవంతమైన – మార్క్సిజం – లెనినిజం –మావోయిజం అంత లోతైన విప్లవోద్యమ నిర్మాణ నవలా శిల్పమిది.

ముక్కుతూ, మూల్గుతూ, నిట్టూరుస్తూ – కుట్రలు కుతంత్రాలు – పన్నుతూ – మోసగాళ్లు, నేరగాళ్లు, బేరగాళ్లు, స్వంతాస్తి కుప్పేసి గాలి వెలుతురు చొరని – జీవ శక్తిలేని మృత్యప్రాయమైన – పాత కుళ్లిన ఉన్నతవర్గాల అసంబద్ధ – అశాస్త్రీయ, భావవాదపు మతం దేవుడు రొచ్చుతో నానిన పాత సాహిత్య ప్రపంచంలోకి – మట్టి పాదాల వాళ్లు – మట్టి వాతావరణంతో – సూర్యరశ్మితో వెలిగిపోయే మనుషులు – వాళ్లు సృష్టించిన సకల వస్తువులు, పరికరాలు – జంతువులు, పిట్టలు, పంట పొలాలు, ఫ్యాక్టరీలు – అడవి, సకల సంచలనాలతో నిరంతరం ప్రజ్వలించే – కొత్త కాంతులతో విరజిల్లే సమిష్టి జీవన సౌందర్యాన్ని, సకల ఉత్పత్తులను, సహస్ర సంవేదనలను విప్లవ శిల్పం సాహిత్యంలో ప్రవేశపెట్టింది.

**10. నూతన సమాజ నిర్మాణ ప్రయత్నాన్ని కాల్పనీకరించడాన్ని, మానవ జీవిత అన్వేషణను విప్లవ నవల ఎలా సాధించింది?**

నూతన సమాజం అంటే ఏమిటి? మన దేశంలో ఇప్పటి మన కాలంలో కొనసాగుతున్న అర్ధ భూస్వామ్య అర్ధ వలస అభివృద్ధి నిరోధక సమాజాన్ని – ఉత్పత్తి శక్తులకు – ఉత్పత్తి సంబంధాలకు ఉన్న వైరుధ్యాన్ని పరిష్కరించడం అంటే కార్మిక, కర్షక విప్లవ చోదక శక్తుల నాయకత్వంలో – పటిష్టమైన పార్టీని నిర్మించి – భారత దేశంలోని అతి పురాతన వైరుధ్యాలైన కుల, వర్గ, మత, లింగ, ప్రాంత వైరుధ్యాలను పరిష్కరిస్తూ ఘర్షణ ఐక్యత ద్వారా సంఘటితపర్చడం. ప్రజా సైన్యాన్ని నిర్మించి – దేశంలోని మిగతా మిత్ర పక్షాలతో ఐక్య సంఘటనతో శ్రామికవర్గ నియంతృత్వంతో – నూతన ప్రజాస్వామిక విప్లవ రాజ్యాన్ని ఏర్పాటు చేసి ప్రైవేటు ఆస్తిని రద్దుచేసి సోషలిస్టు సమాజాన్ని నిర్మించే క్రమం ఆరంభించడం. క్రమంగా రాజ్యం ప్రాధాన్యత కోల్పోయి కమ్యూనిస్టు సమాజ స్థాపన జరగడం. ఇది నవ సమాజ నిర్మాణ క్రమం. ఈ ప్రయత్నం 1848 కమ్యూనిస్టు ప్రణాళికతో మొదలై –1871 ప్యారిస్‌కమ్యూన్, రష్యా కార్మికవర్గ విప్లవం 1917, చైనా శ్రామిక విప్లవం 1949 నుండి 1966 చైనాలోని సాంస్కృతిక విప్లవం దాకా – అనేక సైద్ధాంతిక పోరాటాలు నిర్మాణాలు మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో లాంటి వారి నాయకత్వంలో ప్రజలు నిర్మించిన నూతన సమాజ

నిర్మాణ చరిత్ర... మార్క్సిజం-లెనినిజం-మావోయిజం దాని తాత్వికత. అంటే పదార్థం నుండి చైతన్యానికి - చైతన్యం నుండి పదార్థానికి జ్ఞానం నుండి ఆచరణకు - ఆచరణ నుండి జ్ఞానానికి - అస్థిత్వం నుండి అనుభవానికి అనుభవం నుండి అస్థిత్వానికి పునరావృతమైన నిర్మాణమిది.

ఇది కల్పనకాదు - గతితార్కిక చిత్రణ. ఇది మానవులు సాగించిన వర్గ పోరాటాల చరిత్ర.

నవల ఈ దశలోనే పుట్టి పెరిగింది. ఒక్క నవలే కాదు అనేక తాత్విక ఆలోచనలకు శాస్త్రీయమైన పునాదిని మార్క్సిజం కల్పించింది...

మన దగ్గర నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమం-1957 తర్వాత మేగవంతమయ్యింది. ఆ చరిత్రంతా ముందే వివరించుకున్నాం.

తెలుగులో - అంటే 1921 నుండి మాలపల్లి నుండి - వలస ప్రాంతంలో జరిగిన అన్ని రకాల ప్రజాపోరాటాల నేపథ్యంలో మానవులు ఉత్పత్తి వికాసం కోసం - వర్గపోరాటం, శాస్త్రీయ విజ్ఞానం ఆధారంగా జీవితాన్వేషణను వస్తువుగా నవలలు రాస్తూనే ఉన్నారు...

1967 తర్వాత విప్లవోద్యమం - విప్లవోద్యమానికి చోదక శక్తులైన రైతాంగం, ఆదివాసులు, దళితులు, బహుజనులు, మహిళల సమస్త ఆరాటపోరాటాలను - అన్ని ప్రాంతాల వైరుధ్యాలను చిత్రిస్తున్నది...

విప్లవోద్యమం గతం-వర్తమానం-భవిష్యత్తు నవలల్లో మరింత శాస్త్రీయంగా - మరింత గతితార్కికంగా మరింత కళాత్మకంగా చిత్రించడమే విప్లవ నవల కర్తవ్యం. ఇది విప్లవోద్యమం నిర్మాణం-ప్రయాణం-గుణాత్మక దశకు చేరుకోవడం-గుణాత్మక దశ మళ్లీ అనేక పరిమాణాత్మక పోరాటాల ద్వారా - వ్యూహాత్మక లక్ష్యానికి చేరుకోవడంలోని అన్ని దశలు - విప్లవ నవలకు, సాహిత్యానికి, కళలకు కూడా వర్తిస్తాయి. ఇది నిరంతరాయంగా కొనసాగే ప్రక్రియ.

స్వంత ఆస్తి కేంద్రంగా గల దోపిడి హింసల సమాజం మనుషులను కులాలుగా, మతాలుగా - వర్గాలుగా రకరకాల నేరగాళ్లుగా - ఒంటరివాళ్లుగా - తమ చేతలకు ఉత్పత్తికి - ప్రకృతి ప్రకోపాలు తెలియని అజ్ఞానులుగా - పిరికివాళ్లుగా - మూఢులుగా - భక్తులుగా మార్చింది. అలాంటి సకల పాత కుళ్లిపోయిన మానవ సమాజంలో - కొత్త మానవుడు - ధీరోదాత్తుడు ఆవిర్భవించాల్సి ఉంది. ప్రేమాస్పదులు - యుద్ధవీరులను - సృష్టికర్తలను - తార్కిక జ్ఞానులను భూమిని తలకిందుల చేసి బువ్వ పంచేవాళ్లను, ఇనుప ముక్కలను గాలిలోకి ఎగిరేసి - నీటి మీద, భూమి మీద పరుగెత్తించగల - జ్ఞానాన్ని - సమస్త భూమండలాన్ని ఒక బంతి చేసి ఆడించగల మనిషిని విప్లవోద్యమం ఆవిష్కరించింది. వాళ్ల ఆటను, పాటను - ప్రకృతిలో నిరంతరం మోగే సకల స్వరాల సమ్మేళనాల వాళ్ల కంఠస్వరాలను సాహిత్యంలోకి తెచ్చింది.

**11. విప్లవోద్యమ అభివృద్ధి క్రమంలో విప్లవ నవలా వికాసాన్ని ఎలా చూడవచ్చు? ఎన్ని దశల్లో చూడవచ్చు?**

మొత్తం తెలుగు నవలా పరిణామక్రమంలో ముందే ఇదివరకే కొంత చర్చించాం. విప్లవోద్యమ అభివృద్ధి క్రమంలో కొంత ప్రత్యేకంగా చెప్పుకోవాలంటే సౌలభ్యత కోసం పరిమాణాత్మక పోరాటాలు గుణాత్మక దశకు చేరుకోవడం ప్రాతిపదికగా సౌలభ్యం కోసం తొమ్మిది దశలుగా చెప్పుకోవచ్చు. కోస్తాంధ్ర, ఉత్తరాంధ్ర, తెలంగాణ, రాయలసీమ విప్లవోద్యమాలను - తిరిగి ఇతర రాష్ట్రాలల్లోని విప్లవోద్యమాలను అర్థం చేసుకోవడంలో ఈ దశలు అటుయిటు మారవచ్చు.

**1. 1857 నుండి 1947 జాతీయ విప్లవోద్యమకాలం - రైతాంగ విప్లవోద్యమకాలం:** జాతీయ విప్లవోద్యమ కాలంలో దేశవ్యాపితంగా భూస్వామ్యం - వలస బ్రిటిష్ సామ్రాజ్యంకు వ్యతిరేకంగా రైతాంగం దేశ వ్యాపితంగా వీరోచిత తిరుగుబాట్లు చేశారు... 1925 తర్వాతి నుండే కమ్యూనిస్టులు భారతదేశంలో వివిధ ప్రాంతాలల్లో రైతాంగంలో - విద్యార్థుల్లో పనిచేస్తున్నారు. అప్పటికే తెలుగు ప్రాంతాల నుండి చాలా మంది పై చదువుల కోసం లండన్ జర్మనీ లాంటి యూరప్ దేశాలకు వెళ్లడం అక్కడి పారిశ్రామిక విప్లవం రష్యా విప్లవోద్యమం గురించి అధ్యయనం చేయడం జరిగింది. ఐర్లండ్ డబ్లిన్‌లో చదివి రష్యా విప్లవంతో ప్రభావితమై లాయరుగా ప్రసిద్ధుడైన గుంటూరు వాసి ఉన్నవ లక్ష్మీనారాయణ పల్నాడు పుల్లరి సత్యాగ్రహంలో జైలుపాలై 1921లో మాలపల్లి నవల రాశారు. ఇది మొట్టమొదటి సారిగా రైతాంగ సమస్యలను చర్చించిన నవల - అయితే అప్పటికి గ్రామాలల్లో నెలకొన్ని పరిస్థితులు ముఖ్యంగా - రైతులు - రైతు కూలీలు - భూమి సమస్య - ఈ నవలలో చర్చించారు... ఈ పరిస్థితి మార్పుకు గాంధీ అహింస మార్గం మార్క్సిస్టు పోరాట మార్గం - రెండు దళితులైన రైతు బిడ్డలు సంగదాసు గాంధేయవాదంతో పనిచేస్తాడు. భూస్వామి చంపుతాడు. వెంకట దాసు తక్కెళ్ల జగ్గడుగా సాయుధ ముఠాను ఏర్పాటుచేసుకుంటాడు. నిర్మాణం గాని - అందుకు తగిన రాజకీయాలు గాని భారతదేశంలోని రైతాంగం స్థితిగతులు అధ్యయనంగాని - శాస్త్రీయంగా అధ్యయనం చేయని కాలమది. ఆ పరిమితులు తొలి విప్లవ నవలలో ఉన్నాయి. సాయుధంగా తప్ప భూస్వామిక సమాజాన్ని మార్చలేమన్నది - మొదటిసారిగా నవలలో ఆకాలంలో చిత్రించడం చెప్పుకోతగినది. రాయలసీమ నేపథ్యంలో అమిర్యా కృష్ణారావు గాంధీ అహింస ఉద్యమం నేపథ్యంలో ఓనామీ (1934) నవల వచ్చింది. భూస్వామ్య సంబంధాలు - ఉత్పత్తి శక్తుల పెనుగులాట చిత్రించిన నవలలు చాలా వచ్చినా ఆకాలానికి - ఆయా ప్రాంతాలల్లో తొలి విప్లవ నిర్మాణానికి సంబంధించిన నవలలను - వట్టికోట ఆళ్వారుస్వామి ప్రజల మనిషి తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం నేపథ్యంలో వెలువడింది (1955). ఈ నవలలో 1928-38 నాటి తెలంగాణలో నైజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా గ్రామీణ ప్రాంతాల ప్రజలను సంఘటితం చేయడం ఆరంభమైన దశ. ఆ తరువాత నాయకత్వం ప్రజల నుండే అభివృద్ధి చెందాల్సిన అవసరం... సంఘం ఒక శక్తిగా ఎదుగాల్సిన దశకు సంబంధించి 1940-44 గంగు నవల వట్టికోట ఆళ్వారుస్వామి రాశారు. తర్వాతి నవల దాశరథి రంగాచార్య నవల చిల్లరదేవుళ్ళు, ఈ అన్ని నవలల్లో కూడా ప్రజల్లో విప్లవాకాంక్ష - యాదృచ్ఛికంగా పెల్లుబికిన ప్రజా పోరాటాలు - దొరల దమనకాండ - చిత్రికమైనది. శాస్త్రీయమైన సిద్ధాంతంతో - పార్టీ నాయకత్వంలో ప్రణాళికబద్ధమైన ఎత్తుగడలు - రాజ్యాధికారం లక్ష్యంగా సాగిన పోరాటాలు కాదు. ఆనాటికి రైతాంగ ప్రజా పోరాటాలకు - వాటికి నాయకత్వం వహించవల్సిన కమ్యూనిస్టు పార్టీకి ఆచరణాత్మకమైన సంబంధం ఇంకా బలపడలేదు.

దేశవ్యాపిత ఉద్యమాలల్లో - చైనాలోలాగా నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమ లక్ష్యం - అందుకు తగిన వ్యూహం, ఎత్తుగడలు రూపొందించుకోని స్థితి రైతాంగ ఉద్యమాలల్లో కనిపిస్తుంది. భారతదేశంలోని వైరుధ్యాలను మార్క్సిజం-లెనినిజం వెలుగులో అర్థంచేసుకోవడంలో పరిమితులున్నాయి. అప్పటికి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం అగ్రకులాల చేతుల్లో ఉంది. **(ఇంకా ఉంది)**



# కామ్రేడ్
# సి. రామ్మోహన్

**సున్నిత సునిశిత మేథ ఆయన సొంతం. ఒక కొత్త ఆలోచన కోసం నిరంతరం అన్వేషించేవాడు. వ్యక్తిగత, ఉద్యమ జీవితంలోని కల్లోలాల మీదే విప్లవోద్యమ చైతన్యాన్ని పదును పెట్టుకొనేవాడు. చివరి దాకా నిర్మాణయుతంగా ప్రజా ఉద్యమాల్లో కొనసాగాడు. మిత్రులు, సహచరులు ఆయన పరోక్షంలో కూడా రామ్మోహన్ సార్ అనే అంటారు. ఇది వ్యక్తిగతంగా ఆయనపట్ల అభిమానమే కాదు. విప్లవ, ప్రజా పోరాటాల్లో ఆయన పాత్రను గౌరవించడం.**

ప్రజా ఉద్యమాల స్నేహితుడు, పాలమూరు అధ్యయన వేదిక నాయకుడు కామ్రేడ్ సి. రామ్మోహన్ మృతికి విరసం నివాళి అర్పిస్తోంది. మంగళవారం (08-03-22) ఉదయం హైదరాబాద్‌లో తన 74వ ఏట అనారోగ్యంతో ఆయన మరణించారు. తొలితరం విరసం నాయకుల్లో ఆయన ఒకరు. కార్యవర్గ సభ్యునిగా సంస్థలో చాలాకాలం పనిచేశారు. అటు భావజాలానికీ, ఇటు కార్యక్షేత్ర సమస్యలకీ మధ్య ఆలోచనలు సాగించే ఆయన పూర్తిగా ఆచరణవాది. ఒక ప్రయాణమో, కొద్ది అడుగుల నడకో, కొంత సంభాషణో రామ్మోహన్‌తో సాగించినవారికి ఆయన వ్యక్తిత్వంలోని ఈ విలక్షణత అనుభవంలోకి వస్తుంది. మహబూబ్‌నగర్ జిల్లా గద్వాలలో 1985లో విరసం సాహిత్య పాఠశాల జరిగింది. పాలమూరు లేబర్ అనే అంశంపై ఈ పాఠశాలలో రామ్మోహన్ చేసిన ప్రసంగం సామాజిక సమస్యల అధ్యయనానికి ఒక నమూనా లాంటిది. మానవ జీవితానికి సంబంధించిన చాలా లోతైన అంశాలను ఆ పాఠం తడిమింది. విషయం, విశ్లేషణ వల్లనే కాకుండా.. వ్యక్తీకరణ వల్ల, ఆయనకు ఉన్న ఉపన్యాస సామర్థ్యం వల్ల కూడా గద్వాల పాఠశాల కొండగుర్తుగా రామ్మోహన్‌ను ఈరోజున అనేకమంది గుర్తు చేసుకొంటున్నారు.

గత కొన్నేళ్లుగా ఆయన విరసం నిర్మాణ సమావేశాలకు హాజరు కాలేకపోయినా, చివరి దాకా విరసం ఆశయాల కోసం, విప్లవ సాహిత్యోద్యమ కర్తవ్యాల కోసం దృఢమైన మార్క్సిస్టు లెనినిస్టుగా కొనసాగారు. అన్నిరకాల ఆధిపత్య, వివక్షపూరిత సంబంధాలకు ఆయన తొలినుంచీ వ్యతిరేకి. ఈ క్రమంలో ఫాసిజంపై ఆయనది తిరుగులేని పోరాటం. పాత సంస్థానాలతో నిండి ఉండే పాలమూరు ప్రాంతంలోని విద్యాలయాలు సంఘ్ పరివార్ శక్తుల ఆధిపత్యంలో ఉండేవి. అయితే.. ఈ శక్తులకు రామ్మోహన్ ఒక విలన్. తమ శ్రేణుల్లో ఆయన గురించి ఈ శక్తులు ఇలాంటి ప్రచారమే చేసేవి. తాను పాఠాలు చెప్పే విద్యాలయంలో తనను తాను కమ్యూనిస్టుగా ప్రకటించుకుని ప్రత్యామ్నాయ రాజకీయాలను రామ్మోహన్ ధైర్యంగా ప్రచారం చేసేవారు. ఇలా ప్రచారం చేయడం పాలకవర్గాలకూ, ఫాసిస్టులకూ కంటగింపుగా ఉండేది. ఈ నేపథ్యం నుంచే విరసంలోకి, అక్కడినుంచి పాలమూరు అధ్యయన వేదికలోకి ఆయన ప్రయాణం కొనసాగింది.

తొలినుంచీ సిద్ధాంత అధ్యయనాన్నీ, ఆచరణనూ మేళవించిన జీవన శైలి ఆయనది. పాలమూరు అధ్యయన వేదిక హైదరాబాద్ కమిటీ బాధ్యతల్లో భాగంగా అనేక క్షేత్రస్థాయి అధ్యయనాల్లో రామ్మోహన్ చురుగ్గా పాల్గొన్నారు. తాను ఎక్కడ ఉంటే అక్కడ ఒక ఆహ్లాదకర వాతావరణం ఆవరించేది. తాను చేసే చర్చల్లో, సాగించే ఆలోచనల్లో, కలబోసుకునే అభిప్రాయాల్లోని మృదుత్వం, పాటించే ప్రజాస్వామిక మర్యాదలే దీనికి కారణం. ఈ లక్షణమే ఆయనను వ్యక్తులకు, వేదికలకు స్నేహశీలిని చేశాయి. ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్‌లో ఒక టీచరుగా తన వృత్తిగత బాధ్యతగా మాత్రమే ఆయన కొనసాగలేదు. శ్రమ సంస్కృతి, పోరాట అవసరాన్ని పరిచయం చేస్తూ ఉపాధ్యాయులకు ఆరోగ్యకరమైన భావజాలాన్ని అందించడాన్నీ తన కర్తవ్యంగా పెట్టుకుని పనిచేశారు. నిబద్ధ ప్రజా ఆచరణతో కూడిన జీవితం గడిపిన ఆ ఆదర్శ కామ్రేడ్‌కు విరసం జోహార్లు అర్పిస్తోంది.

**అరసవిల్లి కృష్ణ**, అధ్యక్షుడు
**రివేరా**, కార్యదర్శి
**విప్లవ రచయితల సంఘం**
08-03-22

వ్యాసం

# నిండైన ఆలోచనాపరుడు రామ్మోహన్ సార్

పాణి



రామ్మోహన్ సార్‌కు ఆరోగ్యం బాగోలేదని, ఆయన కోసం పుస్తకం తీసుకరావాలనుకొని రాఘవాచారిగారు వ్యాసం రాయమన్నారు. తనతో కలిసి జీవిస్తున్న వారు తన గురించి ఏమనుకుంటున్నదీ, ఈ ప్రపంచ కల్లోలాలపై వేర్వేరు సందర్భాల్లో ఆయన చేసిన విశ్లేషణల్లో ఏమున్నదీ ఒక చోటికి చేర్చి రామ్మోహన్‌సారుకు అందించాలని పాలమూరు అధ్యయన వేదిక అనుకున్నది. మామూలుగా అయితే ఇలాంటి పుస్తకం చదివాక రామ్మోహన్‌సారు తప్పన ఏదో ఒక సునిశిత వ్యాఖ్య చేసేవారే.

కానీ ఇంకా పుస్తకం పని పూర్తి కాక ముందే ఆయన ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. దాంతో అప్పటికి సేకరించిన వ్యాసాలను ఒక పుస్తకంగా కూర్చి ఆయన చేతిలో పెట్టారట. దాని గురించి ఆయన ఏమనుకున్నదీ మనకు తెలియదు. అప్పటికే ఆయన తన తుది ప్రయాణానికి సిద్ధమయ్యారు. మానవ సంబంధాల్లోంచి, ఉద్యమానుభవాల్లోంచి రామ్మోహన్‌గారిని తిరిగి చూచుకోడానికి మిత్రులు, సహచరులు ప్రయత్నిస్తుండగా ఆయన తిరిగి చూడకుండా నిశ్శబ్దంలోకి జారిపోయారు.

ఈ ఉద్విగ్న విషాద పరిణామాలు ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, ఇంతకూ ఆయన గురించి ఏం రాయాలని మథనపడుతూ వచ్చాను. మృత్యుముఖంలో ఉన్న ఆయనతో నాకున్న పరిచయాన్ని తలపోసుకుంటున్నాను.

నిజంగానే ఇది మరణం వలె విషాదభరితమైనది. అరవై ఏళ్ల ఉద్యమ జీవితాన్ని, ప్రజా మేధో జీవితాన్ని గడిపిన మనిషి మృత్యువులోకి ఒరిగిపోతున్న చివరి సన్నివేశం. ఇలాంటప్పుడు రాయడమంటే ఆయనను మళ్లీ తెలుసుకోవాలని ప్రయత్నించడం. ఆయన తేటతెల్లంగా బతికిన మనిషి. కర్కశమైన లోకంతో కూడా సుతిమెత్తగా వ్యవహరించిన బుద్ధిజీవి. ఈ ప్రపంచాన్ని మార్చాలనే ప్రయోగానికి ఆసరా అయిన మానవుడు. చివరి క్షణాల్లో ఆయన గురించి రాయడమంటే ఆయనను మళ్లీ తెలుసుకోవడమే కదా.

నిజంగానే ఈ పది పదిహేను రోజులుగా ఎంత మథనపడ్డా రామ్మోహన్‌సార్ నా రాతలోకి రాలేదు. ఇప్పుడు ఆయన లేరు. అలా వెళ్లిపోయిన మనిషిని తొలిసారి ఎప్పుడు, ఎక్కడ చూశానో గుర్తు లేదు. ఆయనతో నాకు సుదీర్ఘ అనుబంధం లేదు. కానీ గాఢమైన మానవానుబంధం ఉంది. ఆయన వ్యక్తిత్వం వల్ల అది చాలా విలువైనది. గత పాతికేళ్లుగా తెగిపోని జీవధారలా ఆయనతో ఒక సంభాషణ సాగింది. ఇటీవలైతే తరచూ ఎక్కడో ఒక చోట తారసపడటం. ఫోన్‌లో మాట్లాడుకోవడం. ఏదైనా సరే అది మెత్తగా ఉంటుంది. ఒక చూపుతో ఉంటుంది. ఒక వెలుగుతో ఉంటుంది. ఇది చాలు. నిత్యం మాట్లాడుకోవాల్సిన పని లేదు.

రామ్మోహన్‌సార్‌ను విరసం నిర్మాణ సమావేశాల్లో చూసినట్లు నాకు గుర్తు లేదు. కానీ ఎక్కడ కలిసినా ఆయన మాట్లాడే అనేక విషయాల్లో సాహిత్యం, విరసం కూడా ఉండేవి. ఆయన విరసాన్ని, విప్లవ సాహిత్యోద్యమాన్ని సన్నిహితంగా పరిశీలించేవాడు. ఎవరెవరు ఏం రాస్తున్నదీ, ఎలా విశ్లేషిస్తున్నదీ గమనించేవాడు. అలాంటప్పుడు ఆయన తనను తాను విరసం సభ్యుడనుకొనే మాట్లాడేవాడు. అవగాహనలో, విశ్వాసాల్లో ఆయన దృఢమైన వైఖరితో ఉండేవాడు. సుదీర్ఘ ఉద్యమానుభవం వల్ల కావచ్చు అనేక కల్లోలాలు చుట్టుముడుతున్నా ఆయన గొంతులో ఎన్నడూ నిరాశ ధ్వనించేది కాదు. ఉద్యమాల విస్తృతిని, లోతును, వాటి ముందున్న సవాళ్లను, మానవ జీవితమే ఎదుర్కొంటున్న సంక్షోభాలను.. అన్నిటినీ పరిగణలోకి తీసుకొని ఇలా ఆలోచించాలి కావచ్చు.. అన్నట్లు మాట్లాడేవారు. ఏ ఒక్కవైపుకో ఒరిగిపోయి రామ్మోహన్‌గారు మాట్లాడేవారు కాదు.

బహుశా ఇతరులతో మాట్లాడటమంటే ఆయనకు తనలో తాను ఆలోచించడమే కావచ్చు. కాసేపు ఆయనతో గడిపితే, కాసేపు ఆయన మాటలు వింటే ఇలా అనిపించేది. అందుకే ఆయన చాలా నింపాదిగా మాట్లాడేవారు. ఎక్కడి నుంచో కొత్త ఆలోచనలను, భావనలను కూడగడుతున్నట్లు మాట్లాడేవారు. కొత్త దిక్కుల నుంచి ఆలోచనలు వెతికి తెచ్చినట్లు సంభాషించేవారు. ఒక్కోసారి ఆయన మాటలు చాలా తాజాపరిచేవి. అందులో కొత్త సమాచారం కూడా ఉండేది. క్షణుల హడావిడిలో కొట్టుకపోయేవారు నిలబడి ఆలోచించక తప్పని స్థితి కల్పించేవారు.

రామ్మోహన్‌సారు తాను ఆలోచిస్తున్నట్లే కాకుండా మనతో కూడా కలిసి ఆలోచిస్తున్నట్లుగా ఆయన సంభాషణ ఉండేది. అందుకే తుది వైఖరిని ప్రకటించడం కంటే వెతుకులాటగా ఉండేది. చాలా ఓపెన్ మైండ్‌తో ఆయన ఆలోచించేవారు. ఆయన నిండైన చింతనాపరుడనిపించేది. అందులో కచ్చితత్వం ఉండేది. ఎంతగానంటే, ఒకసారి మహబూబ్‌నగర్‌లో పాలమూరు అధ్యయన వేదిక మీటింగ్‌లో మాట్లాడుతూ నేను వాడిన ఒక పదం మీద ఆ తర్వాత చాలా సేపు చర్చించారు. ఖండించడమో, విమర్శించడమో ఆయన ఉద్దేశం కాదు. ఆ పదం చుట్టూ, ఆ భావన చుట్టూ వెలుగు ప్రసరింపచేయడం ఆయన ఆలోచనా పద్ధతి. నిజానికి ఆ పదం గురించిన ప్రస్తావన ఒక సందర్భం మాత్రమే. ఆ మొత్తాన్నీ ఇంకో వైపు నుంచి ఏమైనా చూడగలమా? అనేదే ఆయన ప్రయత్నం.

రామ్మోహన్‌గారు విప్లవ, విప్లవ సాహిత్యోద్యమ తొలి తరం ఆలోచనాపరుడు. ఆ లోతు, గాఢత స్పష్టంగా కనిపించేవి. ఆ తరంలో కొందరికి ఉండిన ఉద్రిక్త స్వభావానికి మాత్రం ఆయన దూరం. బహుశా ఆయన నిర్మాణ కర్తవ్యాలకన్నా వాటికి అవసరమైన

ఆలోచనలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి ఉండవచ్చు. అది ఆయన స్వభావానికి తగినదే కావచ్చు. అందుకే విప్లవోద్యమ నేపథ్యంలో మేధో శిక్షణ పొందిన అనుభవశాలిగా కనిపించేవారు. చుట్టూ మోహరించిన సమస్యల మీద, ఆటుపోట్ల మీద, జయాపజయాల మీద ఆయన లోతైన అంతర్మథన చెందుతున్నాడని అనిపించేది. అక్కడి నుంచి ఆయన మాటలు వచ్చేవి. బహుశా ఆయన తర్వాతి తరాల వాళ్లకు కూడా ఆయనంటే గౌరవం అందుకే కావచ్చు.

రామ్మోహన్‌సార్‌లో ఇంకో ప్రత్యేకత కూడా ఉన్నట్లుంది. జీవితకాలమంతా నిర్మాణయుతంగానే పని చేశారు. విప్లవోద్యమం, విరసం, ఏపీటీఎఫ్, పాలమూరు అధ్యయన వేదిక దాకా రూపంలో, పేర్లలో ఎన్నయినా కావచ్చు. కాని సారంలో రామ్మోహన్‌సార్ నిర్మాణయుతంగానే పని చేశారు. బహుశా ఆయన ఆలోచనల్లోనే నిర్మాణాత్మక లక్షణం ఉంది. ప్రతి ఆలోచనా, ప్రతి పనీ ప్రజా పోరాటాల నిర్మాణాత్మక కృషికి దోహదకారి కావాలనే అవగాహన ఉన్నది. అందుకే ఆయన ఉండిన విప్లవోద్యమ ప్రవంతిలో ఎన్ని సంక్షోభాలు వచ్చినా, సొంత జీవితంలో ఆటుపోట్లు వచ్చినా ఎప్పుడూ ఏదో ఒక నిర్మాణంతో కలిసి నడిచారు. ఇది ఆయన దృఢమైన ఆలోచనాపరుడనడానికి నిదర్శనం. వ్యక్తిగా ఉండిపోకుండా, ఉద్యమాలకు మిత్రుడిగా మిగిలిపోకుండా తన స్వభావానికి తగిన పద్ధతిలో సంస్థలలో భాగమయ్యారు. బహుశా దీని వల్లే కావచ్చు.. ఆయన విరసం కమిటీల సమావేశాలకు రాలేకపోయినా తనను తాను విరసం సభ్యుడనుకొనే మాట్లాడేవారు.

ఇటీవల ఓ పదేళ్లుగా ఆయన సంభాషణలో కులం, మతం గురించి ప్రస్తావన ఎక్కువగా ఉంటోంది. హిందుత్వ ఫాసిజం మీద విశ్లేషణ ఉంటోంది. ఆయన మృత్యుశయ్య మీద ఉన్నారని తెలిశాక ఆ రోజుల్లో రామ్మోహన్‌గారు ఎలా ఆలోచించేవారనే ఆసక్తి కలిగి దొరికిన కొన్ని రచనలు చదివాను. ఆశ్చర్యం కలిగింది. ముప్పై అయిదేళ్ల కిందటి నుంచే ఆయన ఈ విషయాలను లోతుగా ఆలోచిస్తున్నారు. విప్లవోద్యమ చైతన్యంతో విశ్లేషిస్తున్నారు. మామూలు ఉదారవాద వైఖరితో కాకుండా మార్క్సిస్టు లెనినిస్టు అవగాహనతో కులం, మతం, సంస్కృతి మొదలైన వాటిపై పదునైన వ్యాసాలు రాశారు. 1989లో విరసం వేసవి పాఠశాలలో అంబేద్కరిజం మీద చేసిన ప్రసంగం సంక్షిప్త నివేదికలో రామ్మోహన్‌సార్ చాలా వరకు కనిపిస్తాయి. చుండూరు ఘటన జరిగాక విరసం, జనసాహితి, ప్రజారస తరపున ఆయన ఒక పెద్ద కరపత్రం రాశారు. అందులో రామ్మోహన్‌గారు రాజకీయార్థిక చారిత్రక సాంస్కృతిక విశ్లేషకుడిగా కనిపిస్తారు. చుండూరులాంటి దారుణ ఘటన జరగడానికి నిర్దిష్టంగా గుంటూరు జిల్లా చరిత్రలోకి, స్థూలంగా కోస్తా ప్రాంత సామాజిక పరిణామాల్లోకి వెళ్లారు. దళితులు ఆత్మగౌరవం ప్రకటించుకొనే స్థితికి చేరుకొనేసరికి అగ్రకుల భూస్వాముల ప్రతిక్రియ ఎంత దారుణంగా ఉంటుందో ఆ నేపథ్యంలో వివరించారు. ఎంత 'అభివృద్ధి' జరిగినా, ఎన్ని ఆర్థిక పరిణామాలు జరిగినా మన సాంఘిక సాంస్కృతిక సంబంధాల ప్రాచీన మూలాలు బలీయమైనవనే ఎరుక కలిగించేలా ఆ రచన సాగుతుంది. కరపత్రమనేగాని, ఒక సొంత రచనలా అది ఉంటుంది.

మతతత్వం-ఒక పరిశీలన అనే వ్యాసం(1992), కులం, మతవాదం, సామ్రాజ్యవాదం(1994) అనే వ్యాసం సిద్ధాంత స్థాయిలో ఉంటాయి. పరిశోధనా దృష్టితో వీటిని రాశారా? అనిపిస్తుంది. ఈ విషయాలపై ప్రామాణిక మార్క్సిస్టు లెనినిస్టు వైఖరిని చేరుకోగల ప్రయత్నం ఈ వ్యాసాల్లో చేశారు. విప్లవ సాహిత్యోద్యమంలో భాగంగా రామ్మోహన్‌సార్‌కు మొదటి నుంచి ఈ విషయాల మీద సహజంగానే ఆసక్తి ఉన్నట్లుంది.

వీటన్నిటికంటే ముందు చెప్పుకోవాల్సింది పాలమూరు వలసల గురించిన ఆయన విశ్లేషణ. కాలపరంగా కూడా అది ముందటిదే. అందులో లేబర్ వలసను ఆ ప్రాంత రాజకీయార్థిక సాంస్కృతిక కోణాల్లో చూస్తారు. గణాంకాలు, వ్యథలు, వ్యక్తీకరణలకే పరిమితం కాకుండా సారంలోకి వెళతారు. బహుశా పాలమూరు కరువు, వలస, వెనుకబాటుతనం గురించి తదనంతర కాలంలో జరిగిన పరిశోధనలకు, ఉద్యమాలకు ఒక మౌలిక భూమికను రామ్మోహన్‌సార్ ఆ వ్యాసంలో సిద్ధం చేశారా? అనిపిస్తుంది.

ఆయన లోతైన విప్లవ మేధావి అనడానికి ఇలా ఎన్నో రచనా ఆధారాలు కూడా ఉన్నాయి. వీటిని ఇప్పుడు చూస్తే రామ్మోహన్‌గారు ఇంకా ఎంతో రాసి ఉండాల్సింది కదా అనిపిస్తుంది. దేనికో ఆయన చాలా తక్కువే రాశారు. అందుకే ఆయన సంభాషణలను ఇప్పుడు గుర్తు చేసుకుంటే తనను తాను రచయితగా అనుకొనేవారా? అనే సందేహం కలుగుతుంది. పరిశీలకుడిగా, చుట్టూ చూపున్నవాడిగా, ఆత్మీయ ఆలోచనాత్మక సంభాషణ నెరిపేవాడిగానే ఆయన స్ఫురిస్తారు.

ముఖ్యంగా 2018లో మహబూబ్‌నగర్ విరసం మహాసభల సందర్భంగా ఆయనతో చాలా విస్తృత సంభాషణకు అవకాశం కలిగింది. ఆ సభల ఇతివృత్తం బ్రాహ్మణీయ హిందుత్వ ఫాసిజం కావడం వల్ల కూడా ఆయన మాటలు దాని చుట్టూ తిరిగేవి. ఆ సందర్భంలో ఆయన పాలమూరుకు ఉన్న ప్రజాస్వామిక, లౌకిక సంప్రదాయాన్నీ, బలపడిపోతున్న సంఘ్ ఫాసిస్టు ధోరణినీ ఘటనల్లో, ఉదాహరణల్లో పూసగుచ్చి వివరించేవారు. ఫాసిస్టు ప్రమాదం గురించిన రామ్మోహన్‌సార్ చాలా ఆందోళనపడేవారు. హిందుత్వ అనే మాట కౌంటర్ ప్రొడక్ట్ కాకుండా ఎన్నెన్ని జాగ్రత్తలతో, ఎన్నెన్ని అర్థాల్లో వాడవలసి ఉన్నదో ఆలోచించేవారు. లేకుంటే దాన్నే ఫాసిస్టులు వాడుకొనే ప్రమాదం ఉన్నదనేవారు.

రామోహ్మన్‌సార్ విప్లవోద్యమంలో ఒక తరానికి ప్రతినిధి. మరో రెండు తరాలతో కలిసి ప్రయాణించారు. సహజంగానే ఈ కాలమంతా చాలా ఘర్షణతో, వేదనతో, సంక్షోభాలతో సాగింది. కానీ ఇందులో అద్భుతమైన వెలుగు ఉంది. గొప్ప విజయాలు ఉన్నాయి. అపారమైన అనుభవాలు ఉన్నాయి. వీటన్నిటి మధ్యనే అంతా అయిపోయిందని వగచేవాళ్లున్న ఈ లోకంలో ఆయన మొదటి నుంచీ తన పద్ధతికి తగిన రీతిలో పని చూస్తూ వచ్చారు. విప్లవ, విప్లవ సాహిత్యోద్యమాల కోసం, ప్రజాస్వామిక పోరాటాల కోసం ఆయన చేసిన ఆలోచనలకు, పనులకు, రాతలకు, మాటలకు ఆయన్ను సగౌరవంగా స్మరించుకోవాలి. అంతకంటే కూడా ఇంత సుదీర్ఘమైన కాలినడకన అలిసిపోకుండా, పడిపోకుండా సాగడం, నడుస్తున్న దారిని ఇంకా విశాలం చేయాలనుకోవడం ఆయన గొప్పదనం. అన్నిటికన్నా అవి చాలా విలువైనవి. ఈ పని చేసిన అనేక మందిలో రామ్మోహన్‌సార్‌ది ఒక ప్రత్యేక శైలి. అది పనులకు, ఆలోచనలకేగాక హృదయస్పందనలకు మరింత దగ్గరిది. అది విప్లవంవల్లా, తన సొంత వ్యక్తిత్వం వల్లా ఆయన సంతరించుకున్నారు. అట్లా మన హృదయ స్పందనల్లో ఆయన పదిలంగా నిలిచే ఉంటారు. ☆






# ఉక్రెయిన్‌పై రష్యా యుద్ధం

**- ఎ.నర్సింహారెడ్డి**

సామ్రాజ్యవాద వికృత రూపమే యుద్ధం. అధునిక సమాజంలో రాజ్యాలు చేసే యుద్ధాలు అన్నీ దురాక్రమణలే. ఇవి అకస్మాత్తుగా జరిగే సంఘటనలు కావు. వీటికి ఒక చారిత్రక క్రమం ఉంటుంది. స్వార్థం కోసం నరమేధానికి వెనుతీయని ఫాసిస్టు శక్తులుంటాయి. వీటికి సామ్రాజ్యవాద ప్రయోజనాలు ఉంటాయి. అర్ధసత్యాలతో, అసత్యాలతో బాకాలూదే కార్పొరేట్ మీడియా ఉంటుంది. వీటన్నింటిని ఖండించే పౌర సమాజం ఉంటుంది. అలాగే హింసను, దోపిడీనీ, దురాక్రమణను ఖండించే మానవీయ సమాజం ఉంటుంది. ఇప్పుడు ఉక్రెయిన్‌పై రష్యా చేస్తున్న దాడి సందర్భంలో కూడ అదే జరుగుతున్నది. ఈ యుద్ధం సామ్రాజ్యవాద శిబిరాల మధ్య ఏర్పడిన ఆధిపత్య, విస్తరణ పోటీ ఫలితం మాత్రమే.

సామ్రాజ్యవాద యుగంలో పెట్టుబడిదారీ దేశాలు శాంతియుతంగా ఉండే అవకాశం ఉండదు. వాటి మధ్య అంతర్యుద్ధాలు సహజమే. ప్రపంచ భౌగోళిక ఆర్థిక రాజకీయాల పరివర్తన క్రమంలో రష్యా-ఉక్రెయిన్ యుద్ధం ఒక చర్యగా మాత్రమే గుర్తించాలి. యుద్ధం అంటే విధ్వంసమే, అసంఖ్యాక ప్రజానీకానికి తీరని వ్యధను మిగుల్చుతుంది. యుద్ధంలో గెలుపోటములతో నిమిత్తం లేకుండా ఇరు పక్షాలు తీవ్ర కష్టనష్టాలకు గురవుతాయి. యుద్ధం చేసే గాయాలు మానడానికి చాలాకాలం పడుతుంది. ఏ మూలన యుద్ధం జరిగినా దాని ప్రభావం ప్రపంచమంతటిపైనా పడుతుంది. అత్యధికుల బతుకులు ఛిద్రం చేసే యుద్ధం కొందరికి మాత్రం లాభాల పంట పండిస్తాయి. అందువల్ల యుద్ధం చేస్తున్నదెవరో, చేయిస్తున్నదెవరో అర్థమైతే ఎవరి ప్రయోజనాల కొరకు యుద్ధం జరుగుతుందో అర్థమవుతుంది.

1991లో సోవియట్ యూనియన్ పతనమైన తర్వాత ప్రచ్ఛన్న యుద్ధం ముగిసినప్పటికీ దాని వాసనలు ఇంకా పోలేదనడానికి తాజా ఉక్రెయిన్ సంక్షోభమే ఉదాహరణ. అమెరికా-రష్యా కూటములుగా ప్రపంచ దేశాలు చీలే ప్రచ్ఛన్న యుద్ధం కాలపు పరిస్థితి పునరావృతమయ్యే ప్రమాదం ఉంది. ఉక్రెయిన్ యూరప్‌లో అత్యంత పేద దేశం, సోవియట్ మాజీ రిపబ్లిక్ ఉక్రెయిన్‌లో ఉద్రిక్తత ప్రపంచాన్ని కలవరపెడుతున్నది. ఒకప్పుడు తమతో కలిసున్న ఉక్రెయిన్‌ను ఎలాగైనా మళ్లీ స్వాధీనం చేసుకోవాలని రష్యా ప్రయత్నిస్తుండగా, ఈ ప్రయత్నాలను అడ్డుకునేందుకు అమెరికా, నాటో దేశాలు రెడీగా ఉన్నాయి. 2014 నుంచి సింహాల మధ్య పోరులో జింకలు బలైనట్లు అగ్రరాజ్యాల యుద్ధ క్రీడలో పేదదేశం నలిగిపోతోంది. ఇప్పుడు రష్యా రాజ్యకాంక్షకు ఉక్రెయిన్ బలైపోతున్నది. అందరూ అనుకున్నట్లే సామ్రాజ్యవాద రష్యా ఫిబ్రవరి 24 నుంచి ఉక్రెయిన్‌పై విధ్వంసకర యుద్ధాన్ని ప్రారంభించింది. ఈ యుద్ధంలో అమెరికా, యూరోపియన్ యూనియన్, నాటో దేశాలు పరోక్షంగా భాగస్వాములై ఉన్నారు. ఎందుకంటే ఈ యుద్ధం అమెరికా, రష్యా సామ్రాజ్యవాద దేశాల ఆధిపత్య, విస్తరణవాద వ్యూహంలో భాగమే.

ఉక్రెయిన్ నుంచి ఎటువంటి కవ్వింపు చర్యలు లేకుండానే, తూర్పు ఉక్రెయిన్‌లో 'శాంతి పరిరక్షణ' కోసమంటూ రష్యా యుద్ధాన్ని ప్రారంభించడంతో ఉక్రెయిన్ నిలువెల్లా గాయాలతో నెత్తురోడుతున్నది. అక్కడి జనజీవనం అతలాకుతలమైపోతోంది. రష్యన్ దురాక్రమణ దళాల దాడికి ఉక్రెయిన్ ప్రజలు ముఖ్యంగా రాజధాని కీవ్ జనం ఇళ్లు వాకిళ్లూ విడిచిపెట్టి బంకర్లలో తలదాచుకుంటున్నారు. ప్రాణాలరచేత పెట్టుకొని సురక్షిత ప్రాంతాలకు తరలిపోతున్నారు. పలు నగరాలు ధ్వంస ధూళిగా మారాయి. 'ఉక్రెయిన్ సైనికీకరణ-నాజిఫికేషన్' నిర్మూలన లక్ష్యంగా యుద్ధాన్ని ప్రారంభించినట్లు పుతిన్ పేర్కొన్నాడు. అందుకే సైనిక స్థావరాలు లక్ష్యంగా మొదట రెండు రోజులు తూర్పు, ఉత్తర, దక్షిణ సరిహద్దుల గుండా రాకెట్ల అగ్ని వర్షం కురిపించారు. పొరుగున ఉన్న ప్రజాస్వామిక సార్వభౌమ దేశాన్ని రష్యా దుర్మార్గంగా కబళిస్తున్నదనే అభిప్రాయం అంతటా నాటుకున్నది. ఉక్రెయిన్ పట్ల ప్రపంచ దేశాల సానుభూతి పెల్లుబుకుతున్నది.

పుతిన్ ఒంటెత్తు పోకడలపై స్వదేశంలోనే జనాందోళనలు మిన్నంటాయి. ఉక్రెయిన్‌పై రష్యా దాడికి నిరసనగా మాస్కో నుండి సైబిరియా వరకు విస్తరించి ఉన్న యాభైకి పైగా పట్టణాల్లో నిరసన ప్రదర్శనలు ఉవ్వెత్తున ఎగశాయి. "యుద్ధానికి నో" అని, 'ఉక్రెయిన్ తమ శత్రువు' కాదని నినదిస్తూ, సాటి మనుషులకు సహానుభూతి తెలుపుతూ వీధుల్లోకి వస్తున్న వారిపై రష్యన్ బలగాలు ఉక్కుపాదం మోపుతున్నాయి. అయినా సెయింట్ పీటర్‌బర్గ్, మాస్కో వంటి నగరాల్లో యుద్ధ వ్యతిరేక నిరసనల్లో పాల్గొనేందుకు వేలాది మంది రష్యన్లు తరలి వచ్చారు. సైనిక ప్రచారానికి వ్యతిరేకంగా, పోలీసుల హెచ్చరికలను ధిక్కరిస్తూ సెంట్రల్ స్క్వేర్‌లను చేరుకున్నారు. యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్న స్థానిక పత్రికలు, ప్రసార మాధ్యమాల గొంతు నులమడానికి అధికార శ్రేణులు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి. క్రెమ్లిన్‌లో బుసలుకొడుతున్న సామ్రాజ్యవాదాన్ని తీవ్రంగా దుయ్యబడుతున్న రష్యన్ సమాజ చేతన శాంతి కోరుకునేవారికి స్ఫూర్తిదాయకం.

ఇవాళ ప్రపంచం ఆర్థిక సంక్షోభం, కరోనా విపత్తు, నిరుద్యోగం, పేదరికం, అసమానతలతో అల్లాడుతున్నది. అసలు సమస్యలను వదిలేసి, అగ్రరాజ్యాలు అనాలోచితంగా అహంభావ ప్రదర్శనకు దిగితే ప్రపంచ పురోగమనానికి ప్రమాదం ఏర్పడుతుంది. దానివల్ల అఖరికి నష్టపోయేది అధినేతలు కాదు... అతి సామాన్యులు. అయినా, మదపుటేనుగు వంటి వైఖరికి వెన్నుచూపకుండా ఆత్మగౌరవం కోసం సర్వస్వం ఒడ్డుతున్న ఉక్రెయిన్ పోరాట పటిమ అనితర సాధ్యం! ముష్కర మూకలపై ఒంటరి పోరులో ఆత్మాహుతి దాడులకు సైతం ఆ దేశ సైనికులు తెగిస్తున్నారు. తమ మాతృభూమి పరిరక్షణకు ఎందరో పౌరులు ఆయుధధారులై స్వచ్ఛందంగా ముందుకొస్తున్నారు. ఉక్రెయిన్ గడ్డను నెత్తుటి ముద్దగా మార్చి ఆ మట్టిని గుప్పిటపట్టినా అక్కడి ప్రజా సమూహాల స్వాతంత్ర్యాభిలాషను క్రెమ్లిన్ ఎన్నటికీ అణచిపెట్టలేదు.

**రష్యా-ఉక్రెయిన్‌ల దశాబ్దాల వివాదం :**

రెండవ ప్రపంచ యుద్ధం ముగిశాక రష్యాను కట్టడి చేయడానికి 1949లో నాటో ఏర్పడింది. దీని ప్రధాన ధ్యేయం తన కూటమిలోని ఏ దేశం మీదైనా దాడి జరిగితే అది అన్ని దేశాల మీద జరిగిన దాడిగానే భావించి నాటో దేశాలు స్పందిస్తాయి. అమెరికా పశ్చిమ యూరప్‌ల 'నాటో' సైనిక కూటమికి దీటుగా తూర్పు యూరప్ దేశాలతో 'వార్సా ప్యాక్ట్' పేరుతో సోవియట్ ఒక సైనిక కూటమిని ఏర్పాటు చేసుకున్నది. తూర్పు జర్మనీ, పోలాండ్, చెకోస్లొవేకియా (ఇప్పుడు చెక్, స్లోవేకియా), హంగెరీ, రుమేనియా, యుగోస్లోవియా (ఇప్పుడు స్లోవేనియా, క్రొయేషియా, బోస్నియా, సెర్బియా, కొసావో, మాంటెనిగ్రో), బల్గేరియా, అల్బేనియాలు ఈ 'వార్సా ఒప్పందం'లో సభ్యదేశాలు. సోవియట్ యూనియన్ పతనానికి ముందూ వెనక ఈ ఎనిమిది దేశాల్లో తిరుగుబాట్లు తలెత్తి, కమ్యూనిస్టు ప్రభుత్వాలు కూలిపోయాయి. బెర్లిన్ గోడ బద్దలై తూర్పు జర్మనీ, పశ్చిమ జర్మనీలో విలీనమైంది. మిగిలిన ఏడు దేశాలకు కూడా అమెరికా ఆధిపత్యంలోని 'నాటో' కూటమి సభ్యత్వాన్నిచ్చింది. ఆ తర్వాత బాల్టిక్ తీర దేశాలైన లిథువేనియా, లాత్వియా, ఎస్తోనియాలను 'నాటో'లో చేర్చుకున్నారు. మిగిలిన మూడు దేశాల్లో బెలారస్ రష్యాకు సన్నిహితంగా, మాల్డోవా తటస్థంగా ఉన్నాయి. మిగిలిన ఉక్రెయిన్‌కూ, కాకేసస్ ప్రాంతంలోని జార్జియాకు 'నాటో' సభ్యత్వం ఇవ్వాలని అమెరికా, బ్రిటన్ ప్రయత్నాలు ప్రారంభించాయి. ఉక్రెయిన్ నాటోలో చేర్చుకోకూడదని అమెరికా, ఫ్రాన్స్, జర్మనీ నేతలకు పలుమార్లు రష్యా విజ్ఞప్తి చేసింది. ప్రచ్ఛన్న యుద్ధకాలంలో నాటోలో సభ్య దేశాలు 16 ఉండగా 1991లో రష్యా విచ్ఛిన్నం తర్వాత 2020 వరకు నాటో సభ్యదేశాల సంఖ్య 30కి చేరుకుంది.

ఉక్రెయిన్‌తో రష్యా వివాదం ఇప్పటిది కాదు. ఉక్రెయిన్ వందలాది ఏళ్లుగా రష్యన్ సామ్రాజ్యంలో భాగమే, తర్వాత కూడా అవిభక్త సోవియట్ యూనియన్లో భాగంగానే కొనసాగుతూ వచ్చింది. 30 ఏళ్ల క్రితం, అంటే 1991లో ప్రచ్ఛన్న యుద్ధానంతరం సోవియట్ విచ్ఛిన్నం తర్వాత ఉక్రెయిన్ స్వతంత్ర దేశమైంది. నాటి నుంచి రష్యాతో విభేదాలు రగులుతూనే ఉన్నాయి. రష్యాకు వ్యతిరేకంగా ఉక్రెయిన్‌ను నిలబెట్టేందుకు పశ్చిమ దేశాలు చాలామేర పెట్టుబడులు పెట్టాయి. అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్) ఆ దేశానికి మద్దతుగా నిలిచింది. ప్రపంచ బ్యాంకు, ఈయూ, అమెరికా నుంచి వందల కోట్ల డాలర్లు ఉక్రెయిన్‌కు అందాయి. అమెరికా భారీగా రుణ పూచీకత్తులు, సైనిక సాయం అందించింది. ఈ క్రమంలో ఉక్రెయిన్ యూరప్ దేశాల వైపు మొగ్గుతుండటం రష్యాను కలవరపెడుతూ వచ్చింది. యూరోపియన్ యూనియన్లో సభ్యత్వం కోరడంతో పాటు తనను నాటోలో చేర్చుకోవాలని కూడా ఉక్రెయిన్ విజ్ఞప్తి చేసింది. ఈ పరిణామం రష్యాను మరింత ఆందోళనకు గురిచేసింది. నాటో కూటమి ఉక్రెయిన్‌లో తిష్ట వేస్తే తన భద్రతకు పెను ముప్పుంటుందని రష్యా ఆందోళన.

ఉక్రెయిన్ నాటోలో చేరితే అమెరికా సహా సభ్య దేశాల సైనిక దన్నుతో ఉక్రెయిన్ బలోపేతమవుతుంది. ఈ పరిణామం రష్యా అధ్యక్షుడు పుతిన్ ఆధిపత్యానికి ప్రమాదమని ఆందోళన చెందుతున్నాడు. 2000లో రష్యా పగ్గాలు చేపట్టిన నాటినుంచే ఉక్రెయిన్‌పై ఆయన ప్రత్యేకంగా దృష్టి పెట్టారు. దానికి ఎట్టి పరిస్థితుల్లోనూ నాటో సభ్యత్వం ఇవ్వకూడదని డిమాండ్ చేస్తూ వస్తున్నారు. 1990లో పతనా వ్యవస్థలో ఉన్న సోవియట్ యూనియన్ చివరి అధ్యక్షుడు మిఖాయిల్ గోర్బచెవ్‌కు అమెరికా విదేశాంగ కార్యదర్శి జేమ్స్ బేకర్‌కు మధ్య చర్చలు జరిగాయి. 'నాటో' కూటమి తూర్పు యూరప్ (ఎనిమిది) దేశాలకు విస్తరించినట్లయితే రష్యా భద్రతకు ప్రమాదమని గోర్బచెవ్ ఆందోళన వ్యక్తం చేశారు. 'ఒక్క అంగుళం మేరకు' కూడా 'నాటో కూటమిని తూర్పు వైపునకు విస్తరించబోమని, కూటమి తరపున బేకర్ స్పష్టమైన హామీ ఇచ్చారు. 2002లో భద్రతా సదస్సులు, ఉమ్మడి ప్రాజెక్టుల (తీవ్రవాద నియంత్రన సాంకేతిక పరిజ్ఞాన వృద్ధి, పర్యావరణ పరిరక్షణ) నిర్వహన కోసం నాటో-రష్యా కౌన్సిల్ స్థాపించబడింది. రష్యా క్రిమియాను అక్రమించిన తర్వాత నాటోతో విభేదాలు మొదలయ్యాయి. 2021లో ఎన్ఆర్‌సి స్తంభించిపోయింది.

1991 వరకు సోవియట్ యూనియన్‌లో రష్యాతో పాటు మరో 14 రిపబ్లిక్‌లు సోవియట్ యూనియన్‌లో అంతర్భాగంగా ఉండేవి. ఇవన్నీ సోవియట్ యూనియన్ విచ్ఛిన్నంతో స్వతంత్ర దేశాలుగా ప్రకటించుకున్నాయి. వీటిలో కజక్‌స్థాన్, తజికిస్థాన్, తుర్క్‌మెనిస్థాన్, ఉజ్బెకిస్థాన్, కిర్గిజిస్థాన్‌లు సెంట్రల్ ఆసియా రిపబ్లిక్‌లు. యూరప్, పశ్చిమాసియా ఖండాలను విభజించే కాకేసస్ పర్వత శ్రేణుల సమీపంలో జార్జియా, ఆర్మేనియా, అజర్‌బైజాన్ రిపబ్లిక్‌లున్నాయి. మిగిలిన ఆరు రిపబ్లిక్‌లు రష్యాకు పశ్చిమ సరిహద్దుగా బాల్టిక్ తీరం నుంచి కింద బ్లాక్‌సీ తీరం వరకు విస్తరించి ఉన్నాయి. బాల్టిక్ తీరంలో లిథువేనియా, లాత్వియా, ఎస్తోనియా దేశాలు, నల్ల సముద్ర తీరంలో మాల్డోవా, ఉక్రెయిన్, రెండు తీరాల నడుమ మైదాన సరిహద్దుగా బెలారూస్‌లున్నాయి. ఈ ప్రాంతం భౌగోళిక రాజకీయాల రీత్యా చాల కీలకమైంది. అలాగే రష్యా సరిహద్దుల వెంబడి తూర్పు ఉక్రెయిన్‌లో డాన్‌బాస్ ప్రాంతం ఉంది. అందులో దొనెట్స్క్, లుహాన్స్క్‌లు అంతర్భాగాలు పారిశ్రామిక హబ్‌గా డాన్‌బాస్ పేరు గాంచింది. అక్కడ మైనింగ్ ఎక్కువగా సాగుతోంది.

**అమెరికా-రష్యాల ఘర్షణకు బీజాలు :**

1991లో సోవియట్ యూనియన్ కూలిపోయిన తర్వాత అంతవరకు ఒకే ఉమ్మడి వ్యవస్థలో అంతర్భాగాలుగా ఉన్న రష్యా, ఉక్రెయిన్లు, ఇతర సోవియట్ రాష్ట్రాల మాదిరిగానే స్వతంత్ర దేశాలయ్యాయి. ఉక్రెయిన్‌కు రష్యాతో లోతైనా సామాజిక, సాంస్కృతిక సంబంధాలు ఉన్నాయి. ఉక్రెయిన్‌లో అత్యధికులు రష్యన్ భాష మాట్లాడుతారు. ఉక్రెయిన్, రష్యాకు చేరువుగా ఉన్నందున రష్యా బలపడుతున్న కొద్దీ దాని అభద్రతా భయాలు పెరుగుతూ వచ్చాయి. అందరికీ సమాన దూరంలో ఉంటూ తన స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమత్వాన్ని కాపాడుకునే విధానాన్ని పాటించాలని ఉక్రెయిన్

మొదట్లో ఆశించింది. కాని అది ఫలించలేదు. ఉక్రెయిన్ పార్లమెంటులో యూరప్ దేశాల మద్దతుదార్లు అధిక సంఖ్యాకులు కావడంతో పరిస్థితి దిగజారడం ప్రారంభించింది. రష్యన్ జాతిమీద అణచివేత ఎక్కువైంది. దోపిడీ, పీడన, వివక్ష పెరిగింది. ప్రజల్లో తీవ్ర అసంతృప్తి నెలకొంది.

ఉక్రెయిన్‌లో 2011 పార్లమెంటు ఎన్నికల్లో అమెరికా సామ్రాజ్యవాద అనుకూల ప్రభుత్వం అక్కడ ఓడిపోయింది. విక్టర్ ఫెడరోవిచ్ యెనుకోవిచ్ ఉక్రెయిన్ మూడవ అధ్యక్షుడిగా రష్యా అభిమాని 2011లో ఎన్నికయ్యాడు. ఆ ప్రభుత్వాన్ని పునరుద్ధరించడం కోసం అమెరికా నిధులిచ్చి ప్రజల్లో ఉన్న అసంతృప్తిని ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొట్టింది. 2014 వరకు ఉక్రెయిన్‌ను పాలిస్తూ వచ్చిన రష్యా అనుకూల ప్రెసిడెంట్ విక్టర్ యన్ కోవిచ్ పై అమెరికా, నాటో ప్రోత్సాహంతో ప్రజా తిరుగుబాటు తలెత్తింది. ఆయన రాజధాని కీవ్ నుంచి పారిపోయి రష్యాలో తేలాడు. యూరప్ దేశాల మద్దతుతో తలెత్తిన రెవల్యూషన్ ఆఫ్ డిగ్నిటీ (మైదాన్) తిరుగుబాటు కారణంగా యెన్‌కోవిచ్ పదవి నుంచి తప్పుకోవాల్సి వచ్చింది. ఆయన స్థానంలో ఉక్రెయిన్ పార్లమెంటు(రాడా) తాత్కాలిక అధ్యక్ష, ప్రధానులను నియమించింది. పార్లమెంటు నుండి కమ్యూనిస్టులను బహిష్కరించారు.

ఉక్రెయిన్‌ను రష్యా నుండి శాశ్వతంగా దూరం జేసేందుకు అన్నట్లు యూరోపియన్ యూనియన్‌తో 2014లో 1200 పేజీల చారిత్రక రాజకీయ వాణిజ్య, సైనిక ఒప్పందంపై 27-06-2014న యూరప్- ఉక్రెయిన్ దేశాలు సంతకాలు చేశాయి. అప్పటి నుంచి అమెరికా, పాశ్చాత్య దేశాలకు రష్యాకు మధ్య ఘర్షణ వాతావరణం తలెత్తింది. రష్యా ప్రభావాన్ని కట్టడి చేయడం కోసమే ఉక్రెయిన్ అంతర్గత వ్యవహారాల్లో అమెరికా జోక్యం చేసుకుంటుందని రష్యా పాలకవర్గాలకు అర్థమైంది. నల్ల సముద్రానికి తనను దూరం చేసి ఏకాకిని చేయడానికి అమెరికా, యూరప్ దేశాలు, నాటో దళాలు కుట్ర పన్నాయనే అభద్రతా భావంతో రష్యా 2014 నుంచి ఉక్రెయిన్‌పై పగబట్టింది. అప్పటి నుంచి రగులుతున్న ఉక్రెయిన్ వివాదం నానాటికీ మరింత వేడెక్కుతూ ప్రస్తుత యుద్ధం అంచులకు చేరుకున్నది.

రివల్యూషన్ ఆఫ్ డిగ్నిటీ యూరప్ దేశాలు, అమెరికా, నాటో మంత్రించిందేన్న అవగాహనతో అందుకు ప్రతిగా ఉత్తర ఉక్రెయిన్ డాన్‌బాస్‌లో తిరుగుబాటును రష్యా పోషించడం ప్రారంభించింది. ఉక్రెయిన్‌లో 30 శాతంగా ఉన్న డాన్‌బాస్ ప్రాంతంలోని రెండు (డొనెన్స్క్ లుహన్స్క్) రిపబ్లిక్‌లూ 2014 మార్చి నుంచి వివాదాస్పదమే. రష్యా అండ ఉన్న డాన్‌బాస్ ప్రాంత వేర్పాటువాదులు ఉక్రెయిన్ నుంచి తమ ప్రాంతానికి స్వాతంత్ర్యం కోరుతూ అదే ఏప్రిల్‌లో రిఫరెండమ్ పెట్టారు. అప్పటి నుంచి ఆ ప్రాంతంలోని తిరుగుబాటుదారులకూ, ఉక్రెయిన్ సేవలకూ మధ్య చిన్నపాటి యుద్ధాలు జరుగుతూనే ఉన్నాయి. ఇప్పటికి 14 వేల మంది ప్రాణాలు కోల్పోగా, 15 లక్షల మంది దేశంలోనే అంతర్గత నిరాశ్రయులయ్యారు. యుద్ధ విరమణ, రాజకీయ పరిష్కారానికి ఉక్రెయిన్‌తో 2014-15ల్లో కుదుర్చుకున్న మిన్స్క్ ఒప్పందాలను పక్కన పెట్టారు. యూరప్‌లో భాగంగా ఉండి దానికి అనుకూలంగా నడుచుకోవాలని కోరుకునే శక్తులు ఉక్రెయిన్‌లో అధికారంలో ఉన్నంత కాలం రష్యాకు కంటి మీద కునుకుండదు. రష్యాతో సత్సంబంధాలను కోరుకునే శక్తులు ఉక్రెయిన్‌లో ఆధిపత్యం చెలాయిస్తే అది అమెరికాకు, యూరప్ దేశాలకు గిట్టదు.

క్రిమియాలో పెద్దసంఖ్యలో ఉన్న రష్యన్ మైనారిటీలను ఉక్రెయిన్ అణచివేస్తున్నదని రష్యా ఆరోపించింది. రష్యన్‌ల అణచివేత ఆరోపణల సంగతెట్లా ఉన్నా ఉక్రెయిన్‌లోని నల్లసముద్ర తీరం ఒడెసాలోనూ, అజోవ్ సముద్ర తీరంలోనూ సైనిక స్థావరాల ఏర్పాటుకు బ్రిటన్ ఏర్పాట్లు చేసింది. రష్యా నౌకదళానికి ఇది పూర్తిగా ప్రాణ సంకటం. ఈ మార్గం నుండే మధ్యధరా సముద్రంలోకి రష్యా ప్రవేశించగలిగేది. అందుకే రష్యా వేగంగా స్పందించింది. 2014లో ఉక్రెయిన్ దక్షిణ సరిహద్దులో నల్లసముద్రంలోకి విస్తరించిన క్రిమియా ద్వీపకల్పాన్ని రష్యా ఆక్రమించింది. వెంటనే 'నాటో' సభ్యత్వం కోసం ఉక్రెయిన్ మరోమారు పరుగెత్తింది. ఈ పరిణామాన్ని దృష్టిలో పెట్టుకుని ఉక్రెయిన్-రష్యా సరిహద్దులోని రష్యన్‌లు గణనీయంగా ఉన్న డాన్‌బాస్ ప్రాంతంలో డొనెట్స్క్, లూహాన్స్క్‌లను స్వతంత్ర రాజ్యాలుగా రష్యా ప్రకటించింది. రష్యా నుంచి డాన్‌బాస్ మీదుగా క్రిమియా వరకు ఒక మైదాన కారిడార్ రష్యా చేతికి ఇప్పుడు దొరికింది. ఉక్రెయిన్, రష్యాల వైరం జాతి వైరంగా పరిణమించడం ఆశ్చర్యం కలిగించే విషయం. ఎందుకంటే రష్యా ఆధిపత్యంలోని సోవియట్ యూనియన్‌లో అంతర్భాగంగా ఉన్న 14 రష్యనేతర జాతులు ఏనాడూ వివక్షకు గురయినట్లు ఆరోపణ రాలేదు.

**తూర్పు యూరప్ దేశాలకు అమెరికా బలగాలు :**

అమెరికా తమ సైన్యాన్ని నేరుగా ఉక్రెయిన్‌కు పంపించడం లేదని వైట్ హౌజ్ మీడియా కార్యదర్శి జెన్‌పాసకీ చెబుతున్నప్పటికీ ఉక్రెయిన్‌కు అండగా అవసరమైతే ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గనేందుకు అమెరికా సైన్యాన్ని యూరప్‌కు తరలించేందుకు సన్నాహాలు మొదలయ్యాయి. నార్త్ కరోలినాలోని ఫోర్ట్ బ్రాగ్ నుంచి 2000 మంది సైనికులను పోలెండ్, జర్మనీకి తరలించాలని జో బైడెన్ రక్షణశాఖ అధికారులకు జనవరిలోనే ఆదేశాలు జారీ చేశాడు. అలాగే ఇప్పటికే జర్మనీలోని విల్సెక్‌లో ఉన్న 1000 మంది సైన్యాన్ని రొమేనియా తరలించాలని ఆదేశాలు ఇచ్చారు. నాటోలో భాగస్వామి అయిన రొమేనియా రష్యాకు సమీపంలో ఉంది. ఒకవేళ ఉక్రెయిన్‌పై రష్యా దాడికి పాల్పడితే వెంటనే ప్రతిదాడి చేసేలా తమ సైన్యాన్ని సర్వసన్నద్ధంగా ఉంచాలన్నదే బైడెన్ ఆలోచన అని పెంటగాన్ వర్గాలు చెబుతున్నాయి. తూర్పు యూరప్ దేశాల్లో తన సైనిక బలగాల సంఖ్యను అమెరికా క్రమంగా పెంచుకుంటూనే ఉంది. ఉక్రెయిన్‌కు బాసటగా డెన్మార్క్ ఇప్పటికే ఎఫ్-16 యుద్ధ విమానాలను లిథ్వేనియాకు తరలించింది. స్పెయిన్ 4 ఫైటర్ జెట్లను , 3 యుద్ధ నౌకలను నల్ల సముద్రానికి పంపించింది. ఇక నెదర్లాండ్స్ సైతం 2 ఎఫ్-35 యుద్ధ విమానాలను బల్గేరియాకు తరలించేందుకు సన్నద్ధమవుతోంది. అమెరికా, ఫ్రాన్స్, జర్మనీ దేశాలు ఉక్రెయిన్‌కు ఆహార పదార్థాలు, ఆయుధాలు అందజేశారు.

**ఉక్రెయిన్ నగరాలపై బాంబు దాడులు :**

ఉక్రెయిన్‌లోని పెద్ద నగరాలపై యుద్ధం మొదలైన నాటి నుండి రష్యా సైన్యం క్షిపణులు, రాకెట్లలో విరుచుకు పడుతున్నది. మొదట కీవ్ నగర సరిహద్దులకు చేరిన రష్యా సైన్యానికి ఉక్రెయిన్ సైన్యం, పౌరులు ప్రతిఘటించారు. యుద్ధ విమానాలు, బాంబుల మోతలు, బుల్లెట్ల ధ్వనులతో దద్దరిల్లిపోతోంది. కీవ్ నగరాన్ని స్వాధీన పరచుకోవడంలో భాగంగా రష్యన్ బలగాలు ఉక్రెయిన్ మిలటరీ విమానాశ్రయాలను ధ్వంసం చేశాయి. ఆ తర్వాత ఉక్రెయిన్ ఈశాన్య ప్రాంతంలోని రెండవ పెద్దనగరం ఖార్కివ్ మధ్యలో ఉన్న ఫ్రీడమ్ స్క్వేర్‌లో ఒపెరా హౌస్, కాన్సుల్ హాల్, ప్రభుత్వ కార్యాలయాలపై బాంబులతో రష్యా సైన్యం దాడి చేసింది. ఖార్కివ్‌లోని సహజవాయు

పైపులైన్లను రష్యా సేనలు పేల్చి వేశాయి. వ్యూహాత్మక పట్టణాలైన ఒడెసా, మారియాపోల్‌పై బాంబుల దాడి జరిగింది. నల్ల సముద్రంలో వ్యూహాత్మకంగా ఎంతో ప్రాముఖ్యత ఉన్న దక్షిణ నగరమైన ఖేర్సన్‌లోని చమురు క్షేత్రంపై, అజోవ్ సముద్రంలో ఉన్న ఓడరేవు మారియాపోల్ తీవ్ర బాంబు దాడికి గురైంది. నోవా కఖోవ్కా నగరంపై పట్టు సాధించడంతో క్రిమియా ద్వీపకల్పానికి, సెవస్టపోల్ నగరానికి మంచినీరు అందించే నీపర్ నదిపై రష్యాకు పట్టు లభించింది. వ్యూహాత్మకంగా ఇది చాలా కీలకమైన ప్రాంతం. బెర్డియాంక్, ఒడెసా, మయెంకొలానే తదితర నగరాలకు దాడులు విస్తరించాయి. ఉక్రెయిన్‌పై రష్యా సైనిక చర్యలు ప్రారంభించినప్పటి నుంచి ఇంతవరకు 975 మిలిటరీ మౌలిక సదుపాయాలు, పరికరాలను తమ దళాలు ధ్వంసం చేశాయని రష్యా రక్షణ శాఖ ప్రతినిధి ఇగోర్ తెలిపాడు.

**ఆంక్షలతో రష్యా విలవిల :**

యుద్ధం మొదలైన వెంటనే రష్యాపై అమెరికా, నాటో ఆంక్షలు నానాటికీ పెరిగిపోతున్నాయి. రష్యా సెంట్రల్ బ్యాంకును లక్ష్యంగా చేసుకుని అమెరికా, ఇంగ్లాండ్ ఆంక్షలను ప్రకటించాయి. రష్యా సెంట్రల్ బ్యాంకు, ప్రభుత్వ ఇన్వెస్ట్‌మెంట్ ఫండ్లపై పూర్తిస్థాయిలో నిషేధం విధిస్తూ నిర్ణయం తీసుకున్నాయి. అమెరికాలోని తన ఆస్తులను రష్యా ఏ రకంగానూ ఉపయోగించుకోకుండా అడ్డుకుంటుందని పేర్కొంది. పుతిన్ ఆయన సన్నిహిత వర్గం విదేశాల్లోని తమ వ్యక్తిగత ఆస్తులదీ అదే పరిస్థితని అమెరికా ఆర్థిక మంత్రి జానెట్ యెలెన్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ చర్యతో అమెరికాతో పాటు పశ్చిమ దేశాల్లో రష్యాకున్న వందలాది బిలియన్ డాలర్లు ఆ దేశానికి అందుబాటులో లేకుండా పోతాయని అంచనా. ఆంక్షల ప్రభావం రష్యాపై గట్టిగానే పడుతోంది. ఆర్థికంగా ఇప్పటికే పలు ఇబ్బందులు ఎదురవుతున్నాయి. దేశ కరెన్సీ రూబుల్ విలువ శరవేగంగా పడిపోతోంది. యుద్ధానికి ముందు డాలర్‌కు 80 రూబుల్స్ లోపే ఉండేది కాస్తా ఇప్పుడు ఏకంగా 96 రూబుల్స్‌కు దిగజారింది.

సొసైటీ ఫర్ వరల్డ్‌వైడ్ ఇంటర్ బ్యాంక్ ఫైనాన్షియల్ టెలికమ్యూనికేషన్ (స్విఫ్ట్) వ్యవస్థ నుంచి ప్రధాన రష్యా బ్యాంకులను బహిష్కరించడం ఎగుమతులు, దిగుమతులపై భారీ ప్రభావమే చూపుతోంది. దాంతో దేశంలో నిత్యావసరాల ధరలు కూడా నింగినంటేలా కన్పిస్తున్నాయి. ఈ పరిణామంతో సగటు రష్యన్లు బెంబేలెత్తిపోతున్నారు. రష్యా కరెన్సీ రిజర్వులను జప్తు చేయాలని పశ్చిమ దేశాలు తీసుకున్న నిర్ణయం ప్రభావం తీవ్రంగానే ఉంటుందని క్రెమ్లిన్ అధికార ప్రతినిధి దిమిత్రీ పెస్కోవ్ సైతం అంగీకరించారు. 640 బిలియన్ డాలర్ల రష్యా కరెన్సీ నిల్వల్లో ఎంతమేరకు బయటి దేశాల్లో ఉన్నదీ స్పష్టత లేకపోయినా, కనీసం సగం దాకా జప్తు కావచ్చని యూరప్ అధికారుల అంచనా. రష్యా నుంచి తమ దేశానికి సహజవాయువును తీసుకురావడానికి నిర్మించతలపెట్టిన 'నార్డ్ స్ట్రీమ్ 2' పైప్‌లైన్ ప్రాజెక్టుకు ధ్రువీకరణ ప్రక్రియను నిలిపివేస్తున్నట్లు జర్మనీ ప్రకటించింది.

**ఒకవైపు చర్చలు- మరోవైపు దాడులు :**

ఉక్రెయిన్‌పై యుద్ధం మొదలుపెట్టిన రెండో రోజు నుండే చర్చలకు సిద్ధమని రష్యా ప్రకటించింది. ఉక్రెయిన్ చర్చలకు అంగీకరించింది. బెలారస్‌లోని గోమెల్‌లో చర్చలు ప్రారంభమయ్యాయి. అవి సఫలం కాలేదు. మరోవైపు పుతిన్ అణుబాంబులను సిద్ధం చేయాలంటూ తన సైన్యాధికారులను ఆదేశించడం సంచలనంగా మారింది. ఇది పుతిన్ దూకుడుకు సంకేతం. కాల్పుల విరమణపై అర్థవంతమైన చర్చ జరగాలంటే ముందు బాంబు దాడుల్ని నిలిపివేయాలని ఉక్రెయిన్ అధ్యక్షుడు జెలెన్‌స్కీ డిమాండు చేశాడు. మరో దఫా చర్చలు జరిగిన ఫలితం రాలేదు. ఎవరి డిమాండ్లు వారివిగానే ఉన్నాయి. ఎందుకంటే రష్యా బలగాలు భీకర దాడులు కొనసాగిస్తున్నాయి. పట్టణ ప్రాంతాల్లోని జనావాసాలే లక్ష్యంగా విరుచుకుపడుతున్నాయి. ఉక్రెయిన్‌లోని ప్రధాన నగరాలు బాంబు మోతతో దద్దరిల్లుతున్నాయి. ఆస్పత్రులు, పాఠశాలలు, ఇళ్లు, రవాణా సౌకర్యాలకు సంబంధించిన నిర్మాణాలపైనా రష్యా సేనలు దాడులకు తెగబడుతున్నాయి. వేలాది భవనాలు ధ్వంసమయ్యాయి. ఈ పోరులో సామాన్యులు సమిధలవుతున్నారు. రష్యా సైన్యం ఎనిమిది రోజులుగా చేస్తున్న దాడుల్లో వేలాది మంది ప్రాణాలు కోల్పోయారు. దాదాపు 2 వేల మందికి పైగా పౌరులు చనిపోయినట్లు ఉక్రెయిన్ ప్రకటించింది. గంట గంటకూ భారీ సంఖ్యలో చిన్నారులు, మహిళలు, సైనిక సిబ్బంది ప్రాణాలు కోల్పోతున్నారు. మరోవైపు ప్రాణాలు కాపాడుకోవడానికి 10 లక్షల మంది పొరుగు దేశాలకు వలస వెళ్ళినట్లు ఐక్యరాజ్య సమితి ప్రకటించింది.

**ముగింపు :**

రూపంలో రష్యా-ఉక్రెయిన్ దేశాల మధ్య జరుగుతున్న యుద్ధంలా కనిపించినా, సారాంశంలో ఇది అమెరికా-రష్యాల మధ్య జరుగుతున్న యుద్ధం. అమెరికా ఆర్థికంగా బలహీనపడింది. రష్యా, చైనాలు ఆర్థికంగా పుంజుకున్నాయి. ఈ రెండు దేశాలు అమెరికా సామ్రాజ్యవాద ఆధిపత్యానికి పోటీనిస్తూ సవాళుగా నిలుస్తున్నాయి. ఈ రెండు దేశాలను కట్టడి చేయడమే అమెరికా ప్రస్తుత వ్యూహం. దాని ఓటమి ఆఫ్ఘాన్ నుంచి నిష్క్రమించడంతో ప్రారంభమైంది. అయితే రష్యా ఉక్రెయిన్‌పై చేపట్టినా యుద్ధం ప్రపంచ యుద్ధంగా మారుతుందా? ప్రపంచ ఆధిపత్య శిబిరం పాశ్చాత్య దేశాల నుంచి ఆసియా ఖండానికి మారుతుందా? ప్రపంచ భౌగోళిక ఆర్థిక, రాజకీయ శిబిరాల్లో పునర్విభజన జరుగుతుందా? అణు యుద్ధం వస్తుందా? వంటి ప్రశ్నలు నేడు అందరిలో తలెత్తుతున్నాయి. ఇప్పటిదాక ప్రపంచ పోలీసుగా వ్యవహరించిన యుద్ధోన్మాది అమెరికా సామ్రాజ్యవాద ప్రపంచ గమనంలో స్థానభ్రంశం చెందవచ్చు. ఎందువల్లనంటే ఇటీవల అమెరికా చాలా దేశాల్లో చావు దెబ్బ తింటోంది. రష్యా, చైనాలు ఒక శిబిరంలోకి వచ్చే అవకాశం కన్పిస్తుంది.

ఆధునిక ప్రపంచ రాజకీయ చరిత్ర అంతా యుద్ధాలతో కూడిన సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ దేశాల దురాగతాలే. అంతర్యుద్ధాలకు, యుద్ధాలకు ఆజ్యం పోసింది, పోస్తున్నదీ ఆ దేశాలే. అమెరికా నావికాదళంలో మేజర్ జనరల్‌గా పనిచేసి అనేక యుద్ధాల్లో దాటుదేలిన స్మెడ్లీ బట్లర్ (1881-1940) తన యుద్ధ అనుభవాలను వివరిస్తూ రాసిన 'వార్ ఈజ్ ఎ రాకెట్' పుస్తకంలో యుద్ధాలన్నిటి వెనుకా పెట్టుబడిదారుల ప్రయోజనాలే దాగిఉన్నాయని దాదాపు శతాబ్దం కిందటే కుండబద్దలు కొట్టారు. 30 సంవత్సరాల సైనిక జీవితమంతా పెట్టుబడిదారుల పక్షాన తాను ఒక గూండాలా పనిచేసినట్లుగా తనను తాను తిట్టిపోసుకున్నారాయన. మానవాళి రక్తమాంసాలను నంజుకు తింటున్నది 'లాభం' అనే పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క రాక్షస రూపమే. అందువల్ల సామ్రాజ్యవాద విస్తరణ, ఆధిపత్య యుద్ధాలను ఓడించాల్సిన చారిత్రక కర్తవ్యం కార్మికవర్గం పైనే ఉంది.



# కేరళలో పాణి, వరలక్ష్మిపై ఎన్ఐఏ మరో కుట్ర కేసు..

కేరళలో ఎప్పుడో నమోదయిన ఓ కేసులో ఇప్పుడు ప్రజాసంఘాల నాయకులను ముద్దాయిలుగా చూపుతూ ఎన్ఐఏ అధికారులు ఎఫ్ఐఆర్ నమోదుచేశారు. ఆరుగురి పేర్లతో తయారైన ఈ ఎఫ్ఐఆర్‌లో విరసం కార్యవర్గ సభ్యులు పాణి, వరలక్ష్మి, ప్రగతిశీల కార్మిక సమాఖ్య సభ్యుడు అంజనేయుల పేర్లు ఉన్నాయి. ఇంకా..కేరళ, మహారాష్ట్రకు చెందిన ఇద్దరిని, పిడుగురాళ్ల పోలీస్ స్టేషన్ పరిధిలో రెండేళ్ల క్రితం ఓ కేసులో అరెస్టయిన చైతన్య అనే విద్యార్థినీ నిందితుడిగా పేర్కొన్నారు. వీరందరిపై ఉ.పా., నేరపూరిత కుట్ర తదితర క్రూర చట్టాలను మోపారు. ఇలాంటి టెర్రరిస్టు చట్టాలను మోపడం వారి జీవించే, భావ ప్రకటన స్వేచ్ఛని కాలరాసే ఫాసిస్టు చర్యే అవుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో మరోసారి భారీస్థాయిలో అరెస్టులకు తెరతీసి..ప్రజాసంఘాల కదలికలను కట్టడి చేయడానికి జరుగుతున్న కుట్ర ఇది. ఈ కుట్రను విరసం ఖండిస్తోంది.

కేరళలో మావోయిస్టులపై నమోదయిన పాత కేసు ఇది. ఎన్ఐఏ ఇటీవల ఆ కేసు దర్యాప్తును కేరళ పోలీసుల నుంచి తన చేతుల్లోకి తీసుకుంది. వారం క్రితం అంజనేయులును ఆయన స్వస్థలం చిత్తూరు జిల్లా మదనపల్లెలో అదుపులోకి తీసుకుంది. కేరళ తీసుకెళ్లి రెండు రోజులపాటు విచారించి ఆ తర్వాత వదిలిపెట్టింది. ఈ క్రమంలోనే తాజాగా కేరళ కేసులో ఎన్ఐఏ నమోదుచేసిన ఎఫ్ఐఆర్ వెలుగులోకి వచ్చింది. ఆంధ్రప్రదేశ్‌లో ముంచింగిపుట్టు కేసును అప్పటికే డీల్ చేస్తున్న అనుభవంతో తాజా ఎఫ్ఐఆర్‌ను ఎన్ఐఏ బాగా వండివార్చింది. ముంచింగిపుట్టు కేసులో ఉన్న పాణి, వరలక్ష్మిని కేరళ కేసులోనూ ఇరికించింది. భవిష్యత్తులో ప్రజాసంఘాలకు చెందిన మరికొందరినీ ఈ జాబితాలోకి చేర్చేందుకు వీలుగా ఇతరులు.. అంటూ ఎఫ్ఐఆర్‌లో కొంత ఖాళీ వదిలిపెట్టింది.

మహారాష్ట్ర కేంద్రంగా భీమాకోరేగావ్ కేసును సృష్టించి దేశమంతటా ఎన్ఐఏ భారీఎత్తున అరెస్టులకు పాల్పడటం మనం చూశాం. ఇప్పుడు కేరళ కేంద్రంగా అదే ప్రయోగాన్ని మరోసారి మొదలుపెట్టినట్టు కనిపిస్తోంది. మూడు రాష్ట్రాల వ్యక్తులను ఈ కేసులో నిందితులుగా చేర్చడం.. ఎఫ్ఐఆర్‌లో నమోదుచేసిన సెక్షన్ల తీవ్రత. దీనినే సూచిస్తున్నాయి. సంజయ్ దీపక్ రావు అలియాస్ వికాస్, శ్రీకాంత్‌లను మహారాష్ట్ర, కేరళ వాసులుగా ఎఫ్ఐఆర్‌లో పేర్కొన్నారు. అంతకుమించిన వివరాలు వీరి గురించి అందులో లేవు. మిగతా నలుగురిలో పాణి ఏపీ వ్యక్తి అని, వరలక్ష్మి ఏపీకి చెందిన రివల్యూషనరీ రైటర్స్ అసోసియేషన్ సభ్యురాలు అని పేర్కొన్నారు. చైతన్య, అంజనేయులను ఏపీ వ్యక్తులుగా ప్రస్తావించారు. ఈ ఆరుగురు వ్యక్తులు మరికొందరితో కలిసి నేరపూరిత కుట్ర చేశారట! పైగా వీరిలో ఎవరి నివాస వివరాలూ తెలియవని ఎఫ్ఐఆర్‌లో రాశారు.ఇళ్ల దగ్గర అదుపులోకి తీసుకుని ఎక్కడో అరెస్టు చూపుతూ పోలీసులు అల్లే కథలు మనకు తెలిసినవే. అక్రమంగా మోపిన వేర్వేరు కుట్ర కేసులను విరసం సీనియర్ సభ్యులు వరవరరావు, ప్రొ. సాయిబాబ ఇప్పటికే ఎదుర్కొంటున్నారు. కేరళలో నమోదైన ఎప్పటిదోకేసునో ఎన్ఐఏ వెలికితీసి భారీ కుట్రకు మరోసారి తెగబడటాన్ని విరసం ఖండిస్తోంది. వరలక్ష్మి, పాణి, అంజనేయులు పై అక్రమంగా నమోదుచేసిన కుట్ర కేసును వెనక్కి తీసుకోవాలని డిమాండ్ చేస్తోంది.

అరసవిల్లి క్రిష్ణ - అధ్యక్షుడు<br>
రివేరా - కార్యదర్శి. 3.32022<br>
**విప్లవ రచయితల సంఘం**

# ఎన్ఐఏ విచారణలు

ఇలాంటి ఒక అక్రమ కేసు కేరళలోప్రభుత్వం తయారు చేసిందని తెలిసిన రోజే (3వ తేదీ సాయంకాం) ఆ రాష్ట్రంలోని కొచ్చి నుంచి ఎన్ఐఏ అధికారులు కడప జిల్లా పొద్దుటూరులోని కా. వరలక్ష్మి ఇంటికి వచ్చారు. గంటసేపు అనేక వివరాలు అడిగారు. ఈ కేసు గురించి ఇంకా మాట్లాడవలసి ఉన్నదని, నోటీసు ఇచ్చి ఈ నెల 11వ తేదీ కొచ్చి రావాలని సమాచారం ఇచ్చి వెళ్లారు.

5 తేదీ ఉదయం 8 గంటలకు కర్నూలులోని పాణి ఇంటికి ఎన్ఐఏ బృందం వెళ్లింది. స్థానిక మూడో పట్టణ పోలీసు స్టేషన్‌కు రావాలని నోటీసు ఇచ్చారు. 10 గంటల నుంచి సాయంకాలం 3.30 దాకా విచారణ జరిగింది. పాణి సెల్ ఫోన్ స్వాధీనం చేసుకున్నారు.

11వ తేదీ కొచ్చి రానవసరం లేదని 8వ తేదీ మరోసారి వరలక్ష్మి ఇంటికి ఎన్ఐఏ అధికారులు వెళ్లారు. సాయంకాలం 6 గంటల నుంచి రాత్రి 9 గంటల దాకా విచారణ జరిపారు. ఆమె సెల్ ఫోన్ స్వాధీనం చేసుకున్నారు.

ఈ మొత్తం వ్యవహారంలో ఇంతకూ కొచ్చిలో ఫిబ్రవరి 3న నమోదైన కేసు వివరాలు అడిగినా చెప్పలేదు. ఎఫ్ఐఆర్ ఇవ్వలేదు, చూపలేదు. పైగా కేరళలోని మావోయిస్టు పార్టీ నాయకులు, సభ్యుల దగ్గరి నుంచి ఎవరెవరి గురించో అడిగారు. వారు తెలుసునా? అని అడిగారు. సీపీఐ మావోయిస్టుతో సం[illegible]ధాలు ఉన్నాయని ఆరోపించారు. విప్లవ భావజాల, రాజకీయ విశ్వాసాలకూ, సీపీఐ మావోయిస్టు ఉద్యమానికి సంబంధాలు అంటగడుతూ ప్రశ్నలు వేశారు.

గంటల కొద్దీ సాగే ఈ ప్రశ్నల పరంపర ఆగుతుందని అనిపించడం లేదు. నిజానికి ఇది ఈ ఇద్దరి సమస్య కాదు. విప్లవ రచయితల సంఘం సమస్య కాదు. దేశవ్యాప్తంగా వేలాది మంది మీద యుఎపిఏ కేసుల నమోదు, ఎన్ఐఏ అధికారుల విచారణలు, అరెస్టులు, ఏండ్ల తరబడి ఖైదు మామూలు విషయమైంది. సంబంధం లేని ప్రాంతాల్లో, తెలియని వ్యక్తులతో కలిసి నేరానికి పాల్పడ్డారనే ఆరోపణ[illegible] ఈ వ్యూహాత్మక అణచివేత ఆరంభమవుతున్నది. కొచ్చి అక్రమ కేసు ఇందులో భాగమే. ఇది కేవలం ఈ విచారణలతోనే ఆగుతుందా? ఈ విచారణలైనా ఇప్పటితో ఆ[illegible]తాయా? ఇంకా కొనసాగుతాయా? తెలియడం లేదు. పదే పదే [illegible] పేరుతో సమయం వృథా చేయడం, విసిగించం ఎన్ఐఏ విధానం[illegible]

– విరసం

# స్వీకారం




**ఖబర్ కె సాథ్**
శ్రీనివాసమూర్తి కథలు
ప్రచురణ:
తుంగభద్ర ప్రచురణలు
వెల: రూ.150/-
పేజీలు: 215




**ఫిజా**
షాజహానా కవిత్వం
ప్రచురణ:
నసల్ కితాబ్ ఘర్
వెల: 300/-
పేజీలు: 316




**రాజా రవివర్మ**
పి. మోహన్
ప్రచురణ:
కాకి ప్రచురణలు
వెల: 300/-
పేజీలు: 411




**రెప్పవాల్చని కాలం**
సంకలనం: పగిడిపాల
ప్రచురణ:
న్యూజిలాండ్
తెలుగు అసోషియేషన్
వెల: రూ.200/-
పేజీలు: 192




**మట్టి కనుగుడ్ల పాట**
దొంతం చరణ్ కవిత్వం
ప్రచురణ:
దొంతం చరణ్
వెల: రూ.150/-
పేజీలు: 119




**బ్రేకింగ్ న్యూస్**
దేశరాజు కథలు
ప్రచురణ:
ఛాయ రిసోర్స్ సెంటర్
వెల: 140/-
పేజీలు: 127




**ప్రకృతి వ్యవసాయం**
బహుజన బతుకమ్మ
ప్రచురణ:
బహుజన బతుకమ్మ
నిర్వహణ కమిటీ
వెల: 150
పేజీలు: 240




**నల్లమల పరిరక్షణ**
బహుజన బతుకమ్మ
ప్రచురణ:
బహుజన బతుకమ్మ
నిర్వహణ కమిటీ
వెల: రూ.150/-
పేజీలు: 208




**కవిత్వం 2020**
సంకలనం:
దర్భశయనం శ్రీనివాసాచార్య
ప్రచురణ:
కవన కుటీరం
వెల: 100/-
పేజీలు: 136




**నాది దు:ఖం వీడని దేశం**
హనీఫ్ కవిత్వం
ప్రచురణ:
ఆసిఫ్ ప్రచురణ
వెల: 120/-
పేజీలు: 122




**మన హైందవ రాజ్యం**
ఆకార్ పటేల్
ప్రచురణ:
డా.చెలికాని రామారావు
మెమోరియల్ కమిటీ
వెల: అమూల్యం
పేజీలు: 334




**ఫాసిజం**
ముక్తవరం పార్థసారథి
ప్రచురణ:
విరసం
వెల: 30/-
పేజీలు: 56




**అటుగా వంగిన ఆకాశం**
వైష్ణవి శ్రీ కవిత్వం
ప్రచురణ:
నవ్యాంధ్ర రాష్ట్ర
రచయిత్రుల సంఘం
వెల: 120/-
పేజీలు: 120




**మాస్టారు మాట**
తుమ్మేటి రఘోత్తమరెడ్డి
ప్రచురణ:
రైతునేస్తం పబ్లికేషన్స్
వెల: 100/-
పేజీలు: 123




**భారత రైతాంగంపై దాడి**
వ్యవసాయ సంస్కరణలు
ఎవరి ప్రయోజనాల కోసం?
ఎడిటర్: రజనీ దేశాయ్
తెలుగు: పరుచూరు జమున
ప్రచురణ:
చరిత
వెల: 120/-
పేజీలు: 142

KLVA101M200

# అరుణతార నిర్వహణకు విరాళాలివ్వండి
# శాశ్వత నిధి ఏర్పాటుకు సహకరించండి

విప్లవ రచయితల సంఘం అధికార పత్రిక అరుణతార 1977 నవంబర్ నుంచి మాస పత్రికగా వస్తోంది. సాహిత్య సాంస్కృతిక సంస్థగా విరసం విప్లవ, విప్లవ సాహిత్యోద్యమాల్లో నిర్వచించుకున్న తన రాజకీయ, సాహిత్య, మేధో పాత్రకు వాహికగా తెలుగు సమాజంపై ప్రభావం వేస్తున్నది. గత మూడు తరాలుగా ఎందరో రచయితల, బుద్ధిజీవుల ఆలోచనా వికాసానికి వేదికగా ఉన్నది. సాహిత్య పత్రిక అయినప్పటికీ సామాజిక, రాజకీయార్థిక, సిద్ధాంత విశ్లేషణలకు, చర్చలకు, అన్వేషణకు సృజనశీలమైన మాధ్యమంగా కొనసాగుతున్నది. నక్సల్బరీ శిశువుగా విరసం తాను ఎంచుకున్న విప్లవోద్యమ ప్రచార కర్తవ్యంలో అరుణతార పాత్ర గణనీయం. 1970లలో ఉత్తర తెలంగాణలో విప్లవోద్యమ పునర్నిర్మాణ దశ నుంచి ఇవాళ దేశవ్యాప్తంగా సాగుతున్న విప్లవ, ప్రజా పోరాట సంచనాలను అరుణతార తన శక్తినంతా వెచ్చించి అక్షరబద్ధం చేస్తున్నది. మరీ ముఖ్యంగా చత్తీస్‌ఘడ్‌లో సల్వాజుడుం దుర్మార్గాలు మొదలైనప్పటి నుంచి ఇవ్వాల్టి ఆపరేషన్ గ్రీన్‌హంట్ మూడో దశ, సాల్వాజుడుం రెండో దశ దాకా దండకారణ్య ప్రజా యుద్ధాన్ని, ప్రజారాజ్యాధికారాన్ని, ప్రత్యామ్నాయ రాజకీయ విధానాన్నీ, అక్కడ సాహిత్య, సాంస్కృతిక వికాసాన్నీ తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నది, విశ్లేషిస్తున్నది. దండకారణ్య విప్లవోద్యమానికి సంఘీభావ హస్తాన్ని అందిస్తున్నది. ఈ పనిలో ఇతర ప్రజాస్వామిక పత్రికల పాత్ర కూడా ఉన్నప్పటికీ అరుణతార దాన్నే ఒక ప్రధాన కర్తవ్యంగా స్వీకరించింది. ఇటీవల పెరిగిపోయిన హిందూ ఫాసిస్టు ప్రమాదానికి వ్యతిరేకంగా లౌకిక, ప్రజాస్వామిక కంఠస్వరాన్ని బలంగా వినిపిస్తున్నది. వేర్వేరు సామాజిక ఉద్యమాల ఆకాంక్షలను ఎత్తిపడుతూ వాటి న్యాయబద్ధతను విశ్లేషిస్తున్నది.

ప్రజాఉద్యమాల్లోని కార్యకర్తల సృజనాత్మక వ్యక్తీకరణలకు అరుణతార అవకాశం ఇవ్వడం వల్ల వాళ్లలోంచి ఎందరో ప్రతిభావంతులైన ఆలోచనాపరులు, రచయితలు తయారువుతున్నారు. అరుణతార ఈ పని ఆది నుంచి చేస్తున్నది. అందువల్ల ఒక పక్క లబ్ధప్రతిష్ఠుల రచనలతోపాటు ఎప్పటికప్పుడు కొత్త గొంతులు అరుణతారలో వినిపిస్తుంటాయి.

అయితే మొదటి నుంచీ అరుణతార అనేక ఆర్థిక, నిర్వహణ సమస్యలను ఎదుర్కొంటున్నది. ఒక్కోసారి ఈ ఇబ్బందులు కాస్త తక్కువగా ఉన్నా, ఇటీవల తీవ్రమైన సంక్షోభాల మధ్య ఎప్పటికప్పుడు అభిమానుల, మిత్రుల అండదండలతో నడుస్తున్నది. గతంలో ఒకసారి అరుణతారకు విరాళాలు వద్దు.. చందాలు కట్టండనే ఆదర్శాన్ని కూడా అమలు చేసింది. అయితే నానాటికి పెరుగుతున్న ప్రెస్ ఛార్జీలు, నిర్వహణ ఖర్చులు మోయలేని భారమయ్యాయి. దీంతో రెండు నెల్లకో సంచిక వచ్చిన సందర్భాలూ ఉన్నాయి. అయితే పేజీలు పెంచి పాఠకులకు మరిన్ని రచనలు అందిస్తూ వచ్చాం.

ఈ అన్ని అనుభవాల దృష్ట్యా అరుణతారకు శాశ్వత నిధి తయారు చేయకుండా ఇక పత్రికను నాలుగు కాలాల పాటు నడపడం అయ్యేపని కాదని తేలింది. ఇంత కాలం అభిమానుల సహకారంతోనే నడుస్తూ వచ్చిన అరుణతార ఈసారి శాశ్వత నిధి కోసం మీ ముందుకు వచ్చింది. ఇవాళ ఉన్న విప్లవోద్యమ ప్రత్యేక పరిస్థితుల్లో అరుణతార అవసరం ఎంత ఉన్నదో పాఠకులకు తెలుసు. తెలుగు నేల మీద, దేశంలోని ఇతర ప్రాంతాల్లో, విదేశాల్లో ఉన్న అసంఖ్యాక విప్లవాభిమానులు తలా ఒక చేయి వేస్తే శాశ్వత నిధి సమకూరడం కష్టమేమీ కాదని మా నమ్మకం. దాంతోనే మీ ముందుకు వచ్చాం. విప్లవోద్యమ రాజకీయ, సాంస్కృతిక వేదిక అరుణతారకు మీవంతు విరాళాలు ఇవ్వాలని, ఇప్పించాలని కోరుకుంటూ...

అరసవెల్లి క్రిష్ణ – విరసం అధ్యక్షులు, రివేరా – విరసం కార్యదర్శి

వరవరరావు, టి. కృష్ణాబాయి, సిఎస్ఆర్ ప్రసాద్, జి. కళ్యాణరావు, వి. చెంచయ్య, అల్లం రాజయ్య,

ఎం. రత్నమాల, పాణి, పి. వరలక్ష్మి, రాంకీ

**చందాలు, విరాళాలు పంపాల్సిన చిరునామా :**

అరసవిల్లి కృష్ణ, 6-1/16-7A/1, పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-520001




**చెక్‌లు/డ్రాఫ్టులు/ఆన్‌లైన్‌లో పంపడానికి :**

A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595, IFSC : SBIN0020714,
Branch : Vagu Center, Vijayawada.

If undelivered please return to:
ARUNATAARA
6-1/16-7A/1, Peddiraju Street
Prizer peta, Vijayawada - 520 001
Andhrapradesh

TO
Mr/Mrs.

EDITED, PRINTED, PUBLISHED BY ARASAVILLI KRSIHNA AND OWNED BY DUVVURI VENKATA KRISHNA RAO. PRINTED AT VISALAANDHRA VIGNANA SAMITHI, CHANDRAM BUILDINGS, CHANDRA RAJESWARA RAO ROAD, MACHAVARAM (PO), VIJAYAWADA - 520 004, ANDHRAPRADESH STATE (New Declaration Filed), PUBLISHED AT 6-1/16-7A/1, PEDDIRAJU STREET, PRIZER PETA, VIJAYAWADA - 520 001, ANDHRAPRADESH STATE, EDITOR : ARASAVILLI KRISHNA



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M200 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | naime |
| పేజీలు విడదీసినది | bhanu |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |